# చతుర



జూలై 2002 ★ రూ.7/-

శ్రీసుధా **పతనం**

సచిత్ర విచిత్రం



# ఏడాదికి 50 కిలోలు తగ్గింపు

జూడీ ఆడమ్స్ (46) కి మొదటినుంచీ తిండంటే ప్రేమే. ఐదు అడుగుల ఐదు అంగుళాలు పొడవుండే ఈమె తన 16 వ ఏడు దాకా ముద్దుగుమ్మలా బొద్దు గా కనిపించేది. కానీ క్రమేణా 'మొద్దుగుమ్మ' లా మారింది. కొలరెడో రాష్ట్రంలోని పార్కర్ అనే ఊళ్లో నివసించే ఈమెను మనవడు 'ఫ్యాట్‌లేడీ' అని వెక్కిరించడంతో రోషం పుట్టుకొచ్చి డయటింగ్ మొదలుపెట్టింది. 280 పౌన్లు అంటే దాదాపు 140 కిలోల బరువుగల ఈమె గోల్ఫ్ ఆటను మొదలుపెట్టింది. ఆటలో ఎక్కువ దూరం నడవాల్సి ఉంటుంది. ఏప్రిల్ 1996 నుంచీ ఆ విధంగా రెండేళ్లు డైటింగ్, గోల్ఫ్ ఆటతో 48 వ పుట్టిన రోజు వచ్చేసరికి 105 పౌన్లు బరువుకు చేరుకుంది. అంటే దాదాపు 53 కిలోలన్నమాట.

"మా ఆయన నా లావు గురించి ఎన్నిసార్లు కామెంట్ చేసినా పట్టించుకోని నేను నా మనవడి కామెంటుకు ప్రతిస్పందించడం నా అదృష్టం అంటుంది జూడీ.



# చతుర ప్రపంచం

## చిన్నారులకు నేస్తాలు

ప్రపంచ వ్యాప్తంగా చిన్నారులను ఎంతగానో అలరిస్తూ ఆకర్షించే ఆటబొమ్మల్లో టెడ్డీబేర్లు ప్రముఖస్థానం వహిస్తున్నాయి. ఈ టెడ్డీబేర్ల బొమ్మల పట్ల పిల్లలే కాక పెద్దలు సహితం అత్యంత ఆసక్తి కనపరుస్తున్నారు.

తొలిసారిగా టెడ్డీబేర్‌కు రూపకల్పన జరిగి ఇప్పటికి నూరు సంవత్సరాలయింది. ప్రపంచమంతటా ఆబాలగోపాలం ఈ సందర్భాన్ని పురస్కరించుకుని వేడుకలు జరుపుకొంటున్నారు. ఆ అందాలబొమ్మ గత చరిత్ర వింతగా అనిపిస్తుంది.

1920 వ సంవత్సరంలో అప్పటి అమెరికా ప్రెసిడెంట్ థియోడర్ రూజ్‌వెల్ట్ ఒకరోజున వేటకు వెళ్లాడు. అడవిలో ఒక చోట ఎలుగుబంటి కనిపించింది. దానిని తుపాకీతో కాల్చమని ఆయనను సిబ్బంది కోరింది. అందుకు ఆయన అంగీకరించలేదు. ఈవిషయం తెలుసుకున్న కార్టూనిస్టు క్లిఫర్డ్ బెర్రీమాన్ ఒక కార్టూన్‌ను వ్యంగ్యంగా గీశాడు. దానికి టెడ్డీబేర్ అనే పేరు పెట్టాడు. ఆ కార్టూన్ చూసిన ఓ బొమ్మలు తయారుచేసే వ్యక్తి రూజ్‌వెల్ట్ వద్ద పర్మిషన్ తీసుకుని టెడ్డీ బేర్ బొమ్మలు తయారు చేసి అమ్మసాగాడు.

1908 వ సంవత్సరంలో స్టీవ్ అనే బొమ్మల వ్యాపారి ఒక మిలియన్ టెడ్డీబేర్ బొమ్మలు తయారు చేసి హాట్‌హాట్‌గా అమ్మకం సాగించాడు. ఎ.ఎ. మిల్నీ అనే రచయిత తన కుమారుడు టెడ్డీ బేర్లతో ఆటలాడుకోవడం చూసి ఆ స్ఫూర్తితో 'విన్నీ దిఫూ' అనే రచన చేశాడు. 1980 వ సంవత్సరానికి టెడ్డీబేర్ బొమ్మలు పిల్లలు హెచ్చుగా కొనే బొమ్మలలో ప్రథమస్థానం ఆక్రమించాయి.




1998 వ సంవత్సరంలో అమెరికా ప్రభుత్వం టెడ్డీబేర్ బొమ్మతో ఒక స్టాంప్ విడుదల చేసింది. పెన్సిల్‌వేనియా లోని గెట్స్‌బర్గ్ లో ప్రపంచంలోనే అతి పెద్దదయిన టెడ్డీబేర్‌ల బొమ్మలషాపు తెరవబడింది. అచ్చట కేవలం కొత్తకొత్త టెడ్డీబేర్లు మాత్రమే లభిస్తాయి.

# ప్రముఖుల ముచ్చట్లు

హాస్య రచయితలలో మార్క్‌ట్వెయిన్ అగ్ర గణ్యుడు. ఆయన ఛలోక్తులు విసరడంలో, తమాషాలు చేయడంలో గొప్ప చతురత గల వాడు.

ట్వెయిన్ కాస్త ఆలశ్యంగా ప్రేమలో పడ్డాడు. ఓ సుందరి ఫొటో ఆయన్ను బాగా ఆకర్షించి, అంతటితో ఊరుకోక గుండెలో తిష్ట వేసింది. ఒకరోజు ఆయన హాలెండులోని తన స్నేహితుడు ఛార్లెస్ క్యాబిన్ ఇంటికి వెళ్లాడు. అక్కడ ఛార్లెస్ సోదరి ఒలీవియా ఫొటో చూసి ముగ్ధుడై పెళ్లాడితే ఆమెనే పెళ్లాడాలని దృఢనిశ్చయానికొచ్చాడు. కొన్ని నెలలు గడిచాక ట్వెయిన్ న్యూయార్క్‌లో జరిగిన ఒక విందులో ఆమెను కలిశాడు. ఆ సుందరి ఎల్‌మిరా అనే పట్టణంలో గల తమ ఇంటికి రమ్మనమని అతన్ని ఆహ్వానించింది.




కొద్దిరోజుల తర్వాత అతను న్యూయార్క్‌లో గల ఎల్‌మిరాకు వెళ్లి ఒలీవియాను, ఆమె తండ్రిని కలిశాడు. సుమారు ఒక గంట వారి ఇంట గడిపిన తర్వాత ట్వెయిన్ తిరిగి వెళ్లవలసిన సమయం అయింది. అయితే ఆ ప్రదేశాన్ని వదిలి వెళ్లడానికి ట్వెయిన్‌కి మనస్కరించ లేదు. ఒలీవియాను విడిచి వెళ్లడానికి లోలోపల బాధ పడ్డాడు. చివరికి ఒక పథకం వేశాడు.

ట్వెయిన్ గుర్రాల బగ్గీని నడిపే వ్యక్తితో రహస్యంగా చెప్పాడు, తాను బగ్గీలోకి ఎక్కి సీట్లో కూర్చోగానే అందులోని సీటు జారి వెనక్కు పడిపోయే విధంగా ఆ సీటు ఏర్పాటు చెయ్యమని. పిమ్మట తన బ్యాగ్ తీసుకుని ఒలీవియా తండ్రి వద్ద సెలవు తీసుకుని బండిలోకి ఎక్కి సీట్లో కూర్చున్నాడు.

బండి నడిపే అతను కొరడాతో గుర్రాన్ని చిన్న దెబ్బ వేశాడు. గుర్రం పరుగు ప్రారంభించింది. వెంటనే ట్వెయిన్ కూర్చున్న సీటు జారి వెనక్కి పడింది. దాంతో పాటు ట్వెయిన్‌కూడా నేలపై పడిపోయాడు. వెంటనే తన కళ్లు గట్టిగా మూసేసుకున్నాడు. ఒలీవియా కుటుంబ సభ్యులు ఎంతో బాధపడి అతణ్ణి లేవనెత్తి లోనికి తీసుకువెళ్లి మంచం మీద పడుకోపెట్టారు.

అటు పిమ్మట రెండు వారాలపాటు వారి ఇంట ట్వెయిన్ ఉండిపోయాడు అనారోగ్యం నటిస్తూ. ఆయన తాను కుర్రవానిగా ఉన్నప్పుడు మిస్సోరీలో గుర్రపుబండి తమాషా నేర్చుకున్నాడు. ఒలీవియా ఇంట ఉన్న రెండు వారాలూ అతనికి ఒలీవియా సపర్యలు చేసింది. కొంత కాలానికి వారివురూ ఉంగరాలు మార్చుకుని ఓ ఇంటివారయ్యారు.

✤

# 'ప్రేమపథం' పై సమీక్షలు

మే చతురలో ప్రచురితమైన పుచ్చా రామకృష్ణ నవల 'ప్రేమపథం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## అరుదైన మేళవింపు



*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

మే నెల చతుర 'ప్రేమపథం' చేతబట్టింది మొదలు చివరివరకు మధ్యలో ఆపకుండా, ఆసక్తిగా చదివాను. సరళమైన ఒక మంచి రచనకు ఇది ఒక చిహ్నం అనుకుంటాను. ఏ రచనకయినా ఆసక్తిగా చదివించటం అనేది ప్రథమ లక్షణంగా వుండాలి. అలా లేకుంటే ఆ రచన యొక్క ప్రయోజనం మొదట్లోనే ఆగిపోతుంది గదా. శ్రోతలు విన్నా వినకపోయినా అదేపనిగా ఉపన్యాసాలు దంచేవారు వుంటారు. అందరికీ కాలం దండగ.

కథను చెప్పేటప్పుడు మధ్యమధ్యలో అవసరం అనుకున్నప్పుడల్లా ఆయా సామాజిక అంశాల గురించి- అనాథల సమస్య, బేబీ కేర్ సెంటర్సు, ఆధునిక వైద్యంలోని వ్యాపారతత్వం వగైరా పూర్వాపరాలను తెలియజేస్తూ చక్కగా వ్యాఖ్యానించారు, అది కూడా సోది అనిపించకుండా. దీన్ని బట్టి మనకు తెలిసేదేమంటే రచయిత నవలకు అవసరమనుకున్న అంశాలమీద ప్రత్యేకించి అధ్యయనం, పరిశీలన చేశాడని. దీని మూలంగా చదువరులు కూడా కొంత నేర్చుకుంటారు కూడా.

అయితే ఇంగ్లీషుపదాలు ధారాళంగా దొర్లినట్లు వున్నాయి. ఆ భాష రానివారికి ఇబ్బంది కలుగుతుందేమో అనిపించింది.

నవల నాకు బాగా నచ్చిన కారణం మరొకటుంది. రచయిత ఒక ప్రేమకథను ఒక సామాజిక సేవకు సంబంధించిన అంశంతో





చక్కగా మేళవించారు. పైగా ప్రేమ అంశం కంటే అనాథ పిల్లలను ఆదుకోవటం అనే త్యాగమయ ఆలోచనను ప్రధానాంశంగా తీసుకువచ్చారు. వాస్తవానికి కథంతా దీని చుట్టూనే తిరిగింది. సామాజిక స్పృహ కలిగిన రచయిత అనిపించుకున్నారు. సామాజిక ప్రయోజనం సాధించారు కూడా.

రచయిత తన అభిప్రాయాన్ని చివరిలో ఆత్మపరిశీలన చేసుకున్న రమేష్ ద్వారా దిగువ మాటల్లో చెప్పించారు. "మీ ఇద్దరి మహోన్నత ఆదర్శాలముందు నా స్వార్థం ఎంత అల్పమయిందో నాకు తెలిసిపోయింది. ప్రేమ గట్టిదే. అయితే ప్రేమ పథంలో త్యాగం, మానవత, సేవాదృక్పథం ముడిపడివుంటే ఆ ప్రేమ మరింత గొప్పది అవుతుంది. పువ్వుకు తావి అబ్బినట్లు వుంటుంది" (123 పేజి) అంటూ. ఇదొక అద్భుతమైన ఆలోచన.

అనాథలైన పిల్లలను ఆదుకోవటంలో నిఖిలేష్ లక్ష్యం ఎంతగా మూర్తీభవించి వున్నదంటే ఒక చిన్న విషయంలో బలంగా తెలియపర్చాడు. వారి సంభాషణ మధ్యలో రమేష్‌కు నవ్వు వస్తుంది. కారణం ఏం చెపుతాడంటే, "ఏదో సామెత చెప్పినట్లు, నీవీ మధ్య ఏ విషయాన్నయినా అక్కడికే తీసుకువెళుతున్నావు. అది మరోసారి అర్థం కాగానే నవ్వొచ్చింది" (పేజి-106).

కార్తీక్‌ను సాకటంలో మునిగిపోయిన నిఖిలేష్ మెడికల్ చదువు భగ్నమై వుంటే అప్పుడు కూడా మౌనిక అతనిని ప్రేమించి వుండేదా? మరింతగా ప్రేమించి వుండేదని నా అభిప్రాయం. ఎందుకంటే ఆశయాలతో బంధింపబడిన ప్రేమ అంత గట్టిగా వుంటుంది. దానికి మరణం లేదు. జంటలో ఒకరు మరణించినా, ఆ రెండవవారి ప్రేమ మరింత శాశ్వతంగా వుంటుంది. ఒక చక్కని నవల చదివామన్న సంతృప్తిని పొందగలిగాను.

– పి. శ్రీరాములు

కొండాపూర్-500 032

## కనువిప్పు

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

'ప్రేమపథం' నవల చదివి సమీక్ష రాయకుండా ఉండలేకపోతున్నాను. 'ఈనాడు' దినపత్రికలో ఈ నవలకు సంబంధించిన చిన్న అడ్వర్టయిజ్‌మెంట్ చూసి ముక్కోణపు ప్రేమ నవల కాబోలు అనుకున్నాను. చతుర చేతిలోకి తీసుకొని చదవడం మొదలెట్టాక ముగ్గురు మెడికోల మధ్య నలిగే ప్రేమకథావస్తువుగా భావిస్తూ చదువుతూండగా డాక్టర్లు గ్రామాల్లో వైద్యం చేయడం, గ్రామ రాజకీయాలు కథలోకి వస్తాయనుకున్నాను. కానీ చిత్రంగా కార్తీక్ రూపంలో వచ్చిన అనాథబాలుడు కథంతటికీ కేంద్ర బిందువుగా మారిపోయాడు. నిఖిలేష్, మౌనికల మధ్య సంభాషణా రూపంలోనే అనాథబాలలు, వాళ్ళ భూత, భవిష్యత్, వర్తమానాల చర్చ "మీ కష్టాలకు కనుచూపు మేరలో ముగింపు కనిపించడంలేదర్రా! ఎవరు తీర్చగలరురా మీ కష్టాల్ని" అంటూ దేశంలో అంతర్లీనంగా ఉన్న ఒక పెద్ద సమస్యని పాఠకుల ముందుకు తెచ్చి ఆ పేజీలోనే ఆగిపోయి ఆలోచనలో పడేటట్లు చేసిన పుచ్చా రామకృష్ణగారు అభినందనీయులు. వందకోట్ల జనాభాగల మనదేశంలో వందమందిలో ఒక్కళ్ళు నిఖిలేష్ లాగా ఆలోచించినా ఈ దేశపు అనాథబాలలు రేపటి భావిపౌరులుగా చక్కనైన జీవితాన్ని గడిపే అవకాశం ఉంటుంది. పల్లెటూరిని వర్ణిస్తూ ఆ ప్రజలలోని నిష్కల్మషత్వాన్ని, ప్రేమాభిమానాలను చూడగలిగే పాజిటివ్ దృక్పథం గల రచయితలు సమస్యలకు సూచించే ముగింపులు కూడా ఆచరణాత్మకంగానే ఉంటాయి అనడంలో సందేహంలేదు. చివరగా 'ప్రేమపథం'లో త్యాగం,



మానవత, సేవాదృక్పథం ముడివడివుంటే ఆ ప్రేమ మరింత గొప్పదవుతుంది' అని రమేష్‌చేత చెప్పించిన మాటలు నకిలీ ప్రేమలతో, శారీరక అవసరాల కోసం ప్రేమ నటించే ఈనాటి యువతీయువకులకు కను విప్పు కాగలవు. అటువంటి ప్రేమికులు ఈ నవల చదివి ప్రేమపరిధిని విస్తృతం చేసు కొని అభిలషణీయంగా మార్చుకొనగలరని నమ్ముతున్నాను.

– చివుకుల శ్రీలక్ష్మి,
విజయనగరం-535 202

## గాంధీ పుట్టిన దేశం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

'ప్రేమపథం' నవలలో ప్రధాన పాత్రలైన మౌనిక, నిఖిలేశ్వర్, రమేష్ పాత్రల చిత్ర ణలో రచయిత పుచ్చా రామకృష్ణగారు చూపించిన నేర్పు ప్రశంసనీయంగా వుంది.

కేవలం అందం, వయస్సు వున్నంతమా త్రాన ఆకర్షణ ఉండదు. అందంతోపాటు మైత్రీభావం, త్యాగశీలత, ఆత్మీయత వుంటేనే మనలో ఆ వ్యక్తిపట్ల ఆత్మీయత, ఆకర్షణ కలుగుతుంది.

"ఎక్కడో కోటికొక్క అమ్మాయిని చూసిన ప్పుడు వారిలోని అందమో, లేక ఆకర్షణో కాదు, మరేదో తెలియని భావం మనల్ని పట్టి కుదుపుతుంది. ఏదో తెలియని ఆత్మీ యతాభావం ఆ అమ్మాయిమీద కలుగు తుంది. పవిత్రమైన ఆ భావం మనసును స్పందింపచేస్తుంది" నవలలోని మౌనిక పాత్ర అలాంటిదే.

కొందరు సహజంగా పరోపకారభావం, దయాగుణం కలిగివుంటారు. నిఖిలేశ్వర్ అలాంటివాడే. రోడ్డుపక్కన ప్రసవవేదనతో అల్లాడుతున్న ఒక అసహాయురాలైన యువ తిని చూసి, జాలిపడి, మిత్రుడితో కలిసి హాస్పిటల్లో చేర్చిన నిఖిలేశ్వర్ మానవతా దృష్టి, త్యాగశీలత ప్రశంసనీయం. గౌతమ బుద్ధుడు, గాంధీ పుట్టిన ఈ దేశంలో నిఖి లేశ్వర్‌లాంటి వాళ్ళు కొందరైనా వుంటారన టానికి నిదర్శనంగా నిఖిలేశ్వర్ పాత్రని రచ యిత చక్కగా చిత్రీకరించారు.

"వైద్యం రోజురోజుకీ సామాన్యుడికి అంద నంత దూరం అవుతోంది. సాధారణ హాస్పి టల్స్ స్థానే పుట్టుకొస్తున్న మల్టీ స్పెషాలి టీస్ హాస్పిటల్స్‌ని సామాన్యుడు కన్నెత్తి కూడా చూడలేడు" అన్న సత్యాన్ని రచయిత చక్కగా తెలియచేశారు.

నవలలో ఆదినుండి అంతంవరకూ మౌనిక పాత్ర స్థితప్రజ్ఞత్వానికి, దృఢసంక ల్పానికి నిదర్శనంగా వుంది. ఆ పాత్రచిత్రణ అత్యున్నతంగా వుంది.

అవివాహితగా వుండి కొడుకును కన్న భారతి పాత్ర భారతంలో కుంతిని పోలి వుంది. అయితే కుంతి తన కొడుకును నిరాధారంగా నదిలో వదిలేసింది. తరు వాత వాడేమవుతాడోనన్నది తెలియకుం డానే వదిలేసింది. భారతి అలా చేయ లేదు. తన కొడుకును ఒక మానవతా మూర్తి కాపాడతాడన్న నమ్మకం కలిగిన తరువాతనే ఉత్తరం రాసి వదిలేసి వెళ్ళిపో యింది. కుంతికన్నా భారతి బాధ్యతాయు తంగా ప్రవర్తించిందనవచ్చు.

కుంతి కొడుకు కర్ణుడు, భారతి కొడుకు కార్తీక్. ఇద్దరూ కానీనులే. (కన్యలకు పుట్టి నవాళ్ళే). "మానవత్వం, సేవాగుణంతో కూడుకున్న మీ ప్రేమపథం ఆచరణీయం, హర్షణీయం. మీరు పవిత్రప్రేమపథంలో పయనించే ప్రేమికులు! ఈ ప్రపంచంలో ఎవ్వరూ మిమ్మల్ని విడదీయలేరు" అని రమేష్ చివరలో తన హృదయనైర్మల్యాన్ని చాటుకున్నాడు.

నవల ముగింపు చాలా బావుంది.

– పాటిబండ్ల రంగనాథప్రసాద్,
హైద్రాబాద్ - 500 044





## చక్కని సందేశం

(నాలుగవ బహుమతి రూ. 50/–
పొందిన సమీక్ష)

'ప్రేమపథం'లో రచయిత పుచ్చారామకృష్ణ జీవితంలో కొన్ని నిత్యసత్యాలను నిఖిలేష్, మౌనిక పాత్రలద్వారా పాఠకులకు అందించారు. రచయిత నవలలోని సంఘటనలను విశ్లేషించిన తీరు ఎంతో బావుంది. అనాథ శరణాలయంలోని అనాథ పిల్లల పరిస్థితులనుగానీ, పల్లెటూళ్ళలో డాక్టర్లు ప్రాక్టీసు పెట్టకపోవటంవలన ప్రజలు పడే ఇబ్బందులనుగానీ, స్నేహితులమధ్య ఉండే అనురాగం, ఆప్యాయతలను తెలియచేయటంగానీ రచయిత ప్రదర్శించిన కథాగమనం ఎంతో పరిణతిని తెలియచేస్తుంది. పాత్రల సంభాషణశైలి కూడా బావున్నాయి. అన్నాచెల్లెళ్ళమధ్య అనుబంధాలు, తల్లీకొడుకుల మధ్య వాత్సల్యాన్నీ, వదినా మరదళ్ళమధ్య అసూయలు వివరించటంలో రచయిత కృతకృత్యులయ్యారు. నిఖిలేష్, మౌనిక పాత్రలద్వారా ఒక చక్కటి సందేశాన్ని పాఠకులకు అందించగలిగారు. చాలారోజుల తర్వాత ఒక మంచి నవలను చదివామన్న తృప్తిని మిగిల్చారు. రచయిత కలంనుండి ఇటువంటి సంఘసంస్కరణకు ఉపయోగపడే మరి కొన్ని రచనలు రావాలని ఆకాంక్షిస్తున్నాం.

–ఎస్.వి. స్వామి (యశస్వి)
ఒంగోలు-2

## ఉత్తమాంశం

*(ఐదవ బహుమతి రూ. 50/–
పొందిన సమీక్ష)*

'నీ కళ్ళముందు ఎవరినీ క్రూరమృగంగా మారనీయకు' అన్న మంచిమాటను సార్థకం చేసేందుకు ఓ పసివాడు అనాథ కాకూడదనే తపనతో తన ఆదర్శాన్ని చేతల్లో చూపిన నిఖిలేష్ వ్యక్తిత్వం, ఆత్మస్థైర్యం, ఆత్మవిశ్వాసం డాక్టరు కాబోయే అతడిని ఆ పవిత్ర వృత్తిలో ఉన్నత శిఖరానికి చేరుస్తుంది.

అనాథలని శరణాలయాల్లో వదిలేస్తే భవిష్యత్తులో వాళ్ళు సంఘవిద్రోహశక్తులుగా మారడం ఖాయమని గ్రహించిన నిఖిలేష్ 'పెళ్ళికాని తండ్రి' అవతారమెత్తడానికి సంశయించలేదు. ఒక పౌరుడిగా ఆ బాధ్యత స్వీకరించి అమలుచేశాడు. అందుకతడికి సహకరించిన మరో కాబోయే డాక్టరైన మౌనికలో ఒక స్త్రీలోని, ఒక వైద్యురాలిలోని సేవాధృక్పథం బైటపడింది. అందుకే ఒక మంచిపని చేసేటప్పుడు లోకాన్ని పట్టించుకోకూడదని నిఖిలేష్‌కి వత్తాసిచ్చింది. ఇద్దరి ఆశయాలూ ఒకటే కాబట్టి పెళ్ళికాని తండ్రికి అర్ధాంగి కావాలని కోరుకుంది. వారిద్దరి ఆదర్శాలు ప్రత్యక్షంగా వీక్షించిన రమేష్ మనస్ఫూర్తిగా స్వచ్ఛందంగా తన ప్రేమని వదులుకున్నాడు. ఆ ఇద్దరి సేవాదృష్టి అతడిలో మార్పు తెచ్చిందిగాబట్టే తను ప్రేమించిన యువతి- మిత్రుడూ ఒకటయ్యేందుకు నిష్కల్మషంగా పూలదండలోని దారం లాగా మిగిలిపోయాడు. అందుకే రమేష్ పాత్ర ఈ నవలలో ఉదాత్తమైంది.

మూడు ప్రధాన పాత్రలు, నాలుగు ఉపపాత్రలతో సాగిన 'ప్రేమపథం' నవలలో రచయిత 'అనాథ' అంశాన్ని కేంద్రబిందువుగా గైకొని మలిచిన తీరు అంత గొప్పగా లేదుకానీ ఫరవాలేదు. తీసుకున్న అంశంలో విశ్వప్రేమ ఉంది కాబట్టి చదివించింది.

–యం.వి.ఎస్. లక్ష్మి,
కాకినాడ - 533 004

✤





చతుర
సంపుటి :25 జూలై: 2002
సంచిక: 6 294వ సంచిక
“నేను చెప్పేదాంట్లో అతిశయోక్తిలేదు. నా కొడుకు...
తండ్రీ కొడుకుల బాంధవ్యానికీ, తల్లీకొడుకుల ఆత్మీయతకీ,
భార్యా భర్తల అనురాగానికీ... వీటికే కాదు...మానవీయ
విలువలకే తిలోదకాలిచ్చాడు.
ఇవన్నీ చూస్తూ... ఏ పరిణామ సిద్ధాంతానికీ అందని
రాతిమనిషిలా... నేనిక్కడెందుకున్నానో...
నాకే అర్థం కావడంలేదు” అంటూ వాపోయే ఆ వృద్ధుడు
కన్న మమకారాన్ని కాదని, ఆదర్శాలే తన బిడ్డలనీ...
ఆ వయసులో తీసుకున్న నిర్ణయం ఎలాంటిది?
తల్లిదండ్రుల క్రమశిక్షణలో, సంస్కారపూరిత
వాతావరణంలో... పెరిగిన పిల్లలు కూడా
తప్పుడు దోవల్ని పడుతున్న... పరిస్థితులను...
అక్షరబద్ధం చేసిన
శ్రీసుభా రచన
పతనం
ఈ నెల చతుర సమగ్ర నవల.

"నీకు సీనియర్ ఎగ్జిక్యూటివ్‌గా ప్రమోషన్ వచ్చినట్టు ఝాన్సీ ఫోన్‌చేసి చెప్పింది. మేం అందరం చాలా ఆనందపడ్డాం. అయితే రేపు కొత్త పోస్ట్‌లో జాయిన్ అవుతున్నావన్నమాట" అన్నాడు తిలక్‌గారు అల్లుణ్ణి చూస్తూ.

"అవును మామయ్యా..."

"ఉయ్యూరులో మీ నాన్నగారూ, అమ్మగారూ ఈ కబురు విని సంతోషించి ఉండాలి"

"అవును నాన్నా. మా అత్తగారు అయితే కొడుక్కి ప్రమోషన్ వచ్చిందని తెగ మురిసిపోయారు" అంది కూతురు ఝాన్సీ.

"మా నాన్నగారు రెండు నెలల్లో రిటైరవబోతున్నారు"

"మా ఆడపడుచు భైరవి హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తూ ఎలానూ మా దగ్గరే ఉంటోంది. వాళ్లిద్దర్నీ ఉయ్యూరులో కాపరం ఎత్తేసి మా దగ్గరకు వచ్చేయమని చెప్తాం"

"అయితే మీరిలా వస్తే భైరవి ఒక్కత్తీ హైదరాబాద్‌లో ఉండిపోయిందా?" అంటూ అడిగింది జయమ్మగారు కూతురు ఝాన్సీని.

"ఉద్యోగం చేస్తోందికదా. సెలవు దొరక లేదు"

"బావగారూ, ఈ శుభసమయంలో మీరు నాకు పార్టీ ఇవ్వవల్సిందే" అన్నాడు అక్కడే కూర్చున్న బోసుబాబు.

"మా ఊరు రావోయ్ నాతో. పెద్ద పార్టీ ఇస్తాను"

"నాకు కూడా ఓ ఉద్యోగం చూడండి బావగారూ... వచ్చేస్తాను. ఇక్కడ ఎవరో స్నేహితులు ఎస్టాబ్లిష్ చేసిన సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేస్తున్నాను. ఈ ఉద్యోగం ఎక్కువకాలం ఉంటుందని నమ్మకంలేదు"

"అలానే బోసూ"

"చూడు అల్లుడూ. సీనియర్ ఆఫీసర్ అంటే బాధ్యత ఎక్కువ కలిగిన ఉద్యోగం. అందులో నువ్వు పనిచేసేది డిఫెన్స్ ఫ్యాక్టరీలో. పైగా పర్చేజ్ డిపార్ట్‌మెంట్ అంటున్నావు. జాగ్రత్త నాయనా. ఎవర్నీ ఓ పట్టాన నమ్మకూడదు. మీరు ఖరీదు చేసే ప్రతి వస్తువూ ప్రజలకు కాదు, దేశంకోసం పోరాడే సిపాయిల చేతికి వెడుతుంది. నాసిరకం ఆయుధాలూ, విడిభాగాలు కొంటే కష్టమే కాదు, దేశానికి ప్రమాదం. బి కేర్‌ఫుల్" అన్నాడు హితవుగా తిలక్.

"అతనేం చిన్నపిల్లాడా ఏమిటీ? మీరొక్కరే కాదు, ఈ యువతరంలో నరనరానా దేశభక్తిని జీర్ణించుకున్నవాళ్ళూ ఉన్నారు. కనిపిస్తున్నారు" అంది నెమ్మదిగా జయమ్మ.

"నోరూరుకోదు, పైగా పెద్దవాణ్ణి. మంచి మాట చెప్పాలనిపిస్తుంది" నవ్వుతూ అనేశాడు తిలక్.

"ఆ బుద్ధులూ, విజ్ఞతా, దేశభక్తీ మన బోసుగాడికి నూరిపోయండి. నేనూ, మీ కూతురూ, అల్లుడూ మీ ఉపన్యాసాలు విని ఎప్పుడో మీదారి గొప్పదని గ్రహించాం"

"అమ్మా నీకు తెలియదేమో. నేను ఈమధ్యే నాన్నగారి శిష్యుడు విజయప్రకాష్ గారి జనహిత సంస్థలో మెంబర్‌గా చేరాను. మా సంస్థ పనిపాటలు వింటే నువ్వు ఆశ్చర్యపోతావు. మేం ప్రభుత్వాన్ని సచ్ఛీల పరిపాలనను ప్రజలకు అందివ్వమని హెచ్చరిస్తూ ఉంటాం. అలాగే ప్రజలకు తమ హక్కుల గురించీ, విధుల గురించి చెబుతూ వారికి సంఘంలోని మంచి చెడులను గుర్తిస్తూ 'వాచ్ డాగ్స్'గా ఎలా ఉండాలో నేర్పుతాం"

సరిగ్గా అప్పుడే బయటనుంచి 'గురువుగారూ' అంటూ పిలుస్తూ విజయప్రకాశ్ లోపలికి వచ్చాడు. అతను నలభైఏళ్ళ మనిషి. ఎత్తుగా, ఎర్రగా ఆకర్షణీయంగా ఉంటాడు. కళ్లు ఏవో కాంతిరేఖల తాలూకు వెలుగులు దాచుకున్నట్టుగా ఉంటాయి. చేతిలో రెండు ఫైల్స్ ఉన్నాయి. అతనితో పాటు మరో యువకుడు కూడా లోపలికి వచ్చాడు.

"రావోయ్ విజయప్రకాష్, రా చైతన్యా" అంటూ తిలక్‌గారు ఇద్దరికీ కుర్చీలు చూపించాడు. వెంటనే అల్లుణ్ణి చూసి,

"సత్యం! ఈయనే విజయప్రకాశ్, జనహిత సంస్థ ఫౌండర్. అతను చైతన్య. ఎ.సి.బి.లో ఇన్‌స్పెక్టర్" అని సత్యమూర్తిని తన అల్లుడిగా పరిచయం చేసి అతని ఉద్యోగం గురించి చెప్పాడు. సత్యమూర్తి చేతులెత్తి విజయప్రకాశ్‌కు నమస్కరించి చైతన్యతో చేతులు కలిపాడు.

విజయప్రకాశ్ సత్యమూర్తి గురించి విని, "చాలాబావుందండీ. ప్రభుత్వోద్యోగుల గురించీ, వారి ఎఫిషెన్సీ గురించి ఇప్పటికే చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి. మీ తరం వారైనా క్రమశిక్షణతో పనిచేస్తే నాలాంటివాళ్ళకు శ్రమ తగ్గించినవాళ్ళు అవుతారు. విష్‌యు గుడ్‌లక్" అన్నాడు.

"నిజమే..."

"నేను ప్రభుత్వంలో జాయింట్ సెక్రటరీగా పనిచేశాను. నా పైఅధికార్లనూ, నా కింద పనిచేసేవాళ్ళనూ అతిదగ్గరగా చూస్తే చాలామంది అవినీతి అనే ఊబిలో చిక్కుకున్నవాళ్లే కన్పించారు. ఎడ్మినిస్ట్రేషన్ అంటే అది ఓ కత్తిమీద సాము. మనం మెత్తగా వుంటే మనల్ని తప్పుదారి పట్టించేవాళ్లూ, జేబులో వేసుకునేవాళ్లూ మనచుట్టూ చేరతారు. నిష్కర్షగా పనిచేస్తే నవనాడులూ బంధనలకు గురి అవుతూ ఉంటాయి. అయినా వెరవకూడదు. పదవుల్లో ఉండి మనం ప్రజలకు మేలూ, ఉపకారం చేయకపోతే రాజకీయ నాయకులతోపాటు మనల్నీ ఓ రోజు వాళ్ళు నిలదీస్తారు" అంటూ హితవుగా చెప్పాడు.

"మీ మాటలు గుర్తుపెట్టుకుంటాను సార్" అన్నాడు నమ్రతగా సత్యమూర్తి.

"మీ డిఫెన్స్ ఫ్యాక్టరీలో మా బంధువు ఒకాయన పనిచేస్తున్నారు. ఆయన పేరు విశ్వనాథం. ఆయన ఇంకా అక్కడ ఉన్నారా? " విజయప్రకాశ్ అడిగాడు.

"ఉన్నారు సార్. ఆయన కంట్రోలర్ ఆఫ్ పర్చేజ్ అండ్ స్టోర్స్. నాకు బాగా తెలుసు. నేను ఆయన దగ్గరే పనిచేస్తున్నాను"

"జాగ్రత్త... ఆయనమీద మా వాళ్ళు ఏవేవో చెప్తూంటారు"

"అవును సార్, నాకూ తెలుసు" అన్నాడు చైతన్య. సత్యమూర్తి చైతన్యవైపు అదోలా చూశాడు.

అంతలో ఝాన్సీ నెమ్మదిగా "నాన్నగారూ, మాకు ట్రెయిన్‌కు టైం అవుతోంది. మేం బయలుదేరతాం. వెళ్లొస్తాం అంకుల్" అంది ఝాన్సీ విజయప్రకాశ్‌తో.

"మంచిది శిష్యురాలా..." అని ఆగి, "నువ్వు ఖాళీగా ఉంటే హైదరాబాద్‌లోని మన జనహిత ఆఫీసుకు వెడుతూ ఉండమ్మా. నీలాంటివాళ్ళు సంస్థకు సేవ చేస్తే నాకూ ధైర్యంగా ఉంటుంది"

"బోసూ! నువ్వు వెళ్ళి ఆటో తీసుకురా" అంది జయమ్మ.

పది నిమిషాల్లో బోసు ఆటో తీసుకు వచ్చాడు. సత్యమూర్తీ, ఝాన్సీ ఆటో ఎక్కి స్టేషన్‌కు వెళ్ళారు. ఫ్లాట్‌ఫారం జనంతో రద్దీగా ఉంది. అంతలోనే హైదరాబాద్ వెళ్లే బండి ఓ గంట ఆలస్యంగా వస్తుందనే ఎనౌన్స్‌మెంట్ విన్పించింది.

"అరే... ఎలా? " అంది ఝాన్సీ.

"ఏంచేస్తాం. వెయిటింగ్‌రూమ్‌లో కూర్చుందాం, పద"

ఇద్దరూ జెంట్స్ వెయిటింగ్ రూమ్‌కు వెళ్ళారు. ఖాళీగా ఉన్న పేమ్ కుర్చీల్లో కూర్చున్నారు. ఝాన్సీ తనతో తెచ్చుకున్న వారపత్రిక తెరిచింది. సరిగ్గా అప్పుడు, 'హలో సత్యమూర్తీ' అనే పిలుపు వినబడడంతో సత్యమూర్తి పక్కకి తిరిగి చూశాడు.

"నేను, విశ్వనాథాన్ని"

"నమస్కారం సార్..."

"నేను డ్యూటీమీద మద్రాసు వెళ్ళాను. ఈ ఊళ్లో స్వంత పనులుంటే ఇక్కడ దిగాను" అని పక్కనున్న వ్యక్తిని చూపించి,

"ఈయన పేరు రాజారావు. బొంబాయిలో ఉంటారు. మనకు రెగ్యులర్‌గా మెటీరియల్ సప్లయ్ చేస్తూఉంటారు. మంచి మనిషి" అని పరిచయం చేసి సత్యమూర్తిని చూపించి "ఇతను సత్యమూర్తి. మన ఫ్యాక్టరీలో నా దగ్గర సీనియర్ ఎగ్జిక్యూటివ్‌గా వర్క్ చేస్తున్నాడు. చాకులాంటి వ్యక్తి" అన్నాడు. రాజారావు సత్యమూర్తితో రెండు చేతులూ కలిపి, మన గురువుగారికి నేను ఎలాంటివాడినో తెలుసు. ఆయన నన్ను స్వంత తమ్ముడిలా చూసుకుంటారు. మీరు కూడా నన్ను ఓ అన్నగానే చూడాలి"

"విశ్వనాథంగారికి కావల్సిన వాళ్లు, నాకూ ఆప్తులే అవుతారు"

"అంతమాట అన్నారు చాలు. నేను ధన్యుణ్ణి" అంటూ నవ్వేశాడు రాజారావు.

"ఏమ్మా ఝాన్సీ! బావున్నావా? నేను విశ్వనాథం అంకుల్‌ని. మీ ఆయన పూర్వంనుంచీ నాకు తెలుసు..." అంటూ ఝాన్సీ దగ్గరకు వెళ్లాడు.

"అవును. పూర్వం మీరిద్దరూ స్టేట్ గవర్నమెంట్‌లో పని చేశారు కదా? మీరు గుర్తే.. మర్చిపోలేదు..."

"ఇన్నాళ్లకు మళ్లీ ఇద్దరం ఒకేచోట, ఒకే సెక్షన్‌లో కలిసి పనిచేస్తున్నాం..."

"మీలాంటి సీనియర్స్ దగ్గర పనిచేసే అవకాశం రావడం, బహుశా ఆయన అదృష్టం అనుకుంటాను"

"లేదు. ఆ అదృష్టం నాదీ"

ఇంతలో రాజారావు అటుగా వచ్చి "రండి విశ్వనాథంగారూ! కేంటీన్‌కు వెళ్లి కాఫీ తాగుదాం. మళ్లీ నేను ఢిల్లీ రైలు ఆగే ప్లాట్‌ఫారం మీదకు పోవాలిగా" అన్నాడు.

"ఇప్పుడే వస్తాను ఝాన్సీ" అన్నాడు సత్యమూర్తి విశ్వనాథం వెనుకే వెడుతూ.

"జాగ్రత్త. త్వరగా రండి" అంది నవ్వుతూ ఝాన్సీ.



"మీ ఊరూ, మన పొలాల్నీ, మొన్నో సారీ, అంతకుపూర్వం మన పెళ్లి అయిన కొత్తలో చూడ్డమే. అప్పుడు ఆ మూడ్ వేరు కదా. మళ్ళీ ఏడాదికి ఈ ఊరు వచ్చాం. మీరు అన్నీ తీరిగ్గా చూపించారు ఈసారి" అంది ఝాన్సీ నవ్వుతూ. ఆమె మాటలకు సత్యమూర్తి నవ్వేశాడు.

"పూర్వానికీ ఇప్పటికీ మా ఉయ్యూరు చాలా మారింది. ఇప్పుడిది పల్లెటూరు కాదు. మీ విజయవాడని కూడా సవాల్ చేయగలదు. ఏమనుకుంటున్నావో"

"అవునవును చూశాను. మీ ఊరు కూడా మీలాగే వళ్లుచేసి లావెక్కింది"

"మా ఇల్లూ, పొలం మాత్రం ఏం మార్పు లేకుండా నీలాగే బక్కగా ఉన్నాయి. అవునా? "

"ఝాన్సీ నవ్వింది. సత్యమూర్తి తన తలతో ఝాన్సీ నుదురును చిన్నగా 'ఢీ'కొట్టి "నువ్వు ఓ నెల్లాళ్లు నీ పుట్టింట్లో ఉండి నన్ను పస్తులు పడుకోబెట్టావు. ఇప్పుడు వడ్డీతో సహా సుఖాన్నీ సంతోషాన్నీ వాపసు చేయాలి. తెలిసిందా? " అన్నాడు లాలనగా.

"భర్తలు ఎక్కడయినా భార్యల దగ్గర వడ్డీ తీసుకుంటారేమిటి? తామే చక్రవడ్డీ కట్టి అసలుతోసహా చెల్లువేస్తారు. ఈ మాత్రం తెలియదా? " అంది వెక్కిరింపుగా ఝాన్సీ.

"అలానా, నాకు తెలియదే. నేను చిన్నప్పటినుంచీ పిసినారిని. నాకు తీసుకోవడమే గాని ఇవ్వడం తెలియదు. ఏం చేయమంటావ్. అంతా నీ దయ"

"మీ కొత్త ఉద్యోగం గురించి నాలుగైదు సార్లు అడిగి ఆఖరిగా మీ నాన్నగారు ఏమన్నారో తెలుసా? "

"ఏముంది. నా బదులు నీకు నీతిపాఠాలు వినిపించి ఉంటాడు. మా నాన్నగారి సంగతి నాకు తెలియదా? నాకు ముప్పై ఏళ్లు దాటి మీసాలు అక్కడక్కడా నెరుస్తున్నా ఆయన నన్ను చిన్నపిల్లాడే అనుకుంటాడు. ఏం చెప్పమంటావ్? "

"మామయ్యగారు ఎలాంటివారో నాకు తెలుసు. కావాలని మీరే నిప్పులాంటి మనిషికి వంకలు పెడుతున్నారు. ఆయనకు గాంధీ అనే పేరు ఎవరు పెట్టారోగానీ ఆ పేరు ఆయనకు సరిగ్గా ఉంది"

"చిన్నప్పటినుంచీ ఆయన చెప్పే నీతులు విని మా చెవులు తడకలు కట్టాయి. ఆయన ఇరవైఏళ్లు ప్రభుత్వోద్యోగం చేశాడు. అందులో ఇమడలేక ఈ షుగర్ ఫ్యాక్టరీలో చేరాడు. అయినా తనతోటి ఉద్యోగస్తుల్ని చూసి ఏమీ నేర్చుకోలేదు. అందరూ బాగుపడుతూంటే వాళ్ళది బలుపు కాదు, వాపు అంటాడు. ఏదోరోజు లంచాలు మరిగి బాగుపడ్డవాళ్లు తాము తిన్నది కక్కేరోజు వస్తుందంటాడు. రోజులు మారిన సంగతి ఆయన గుర్తించడు"

"మీ పేరు సత్యమూర్తి. మీరూ సత్యసంధుల్లా ఉండాలని ఆయన ఆశ. తప్పేముంది" అని క్షణం ఆగి, "మామయ్యగారు ఈవేళ పదవీ విరమణ చేసేరోజు. ఫ్యాక్టరీ వాళ్ళు సాయంకాలం ఫంక్షన్ ఏర్పాటు చేశారు. మనం వచ్చాం. మీ చెల్లాయి భైరవికి సెలవు దొరకలేదు. మరి ఇంతవరకూ మీ భాస్కరం అన్నయ్యా, రాధగారూ రాలేదు"

"వాడికేమయ్యిందో? "

"మీరు ఏమీ అనుకోవద్దు. మా స్నేహితురాలి తండ్రి బావగారితోపాటు రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌లోనే పనిచేస్తారు. అది తన తండ్రి గురించీ, మీ అన్నయ్య గురించి చాలా కథలు చెప్పి నవ్విస్తుంది, తెలుసా? "

"అంటే" అన్నాడు అదోలా సత్యమూర్తి.

"రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌లో పనిచేసేవాళ్ళకు రెండు చేతులా కాదు నాలుగు చేతులా సంపాదనేనట"

"సత్యమూర్తి చిన్నగా తలగోక్కుని, రెవెన్యూ స్టాఫ్‌నూ, మా ఎక్సైజ్‌లో పనిచేసేవాళ్ళనూ చూసి ఏడవని వాళ్ళు తక్కువ. మా డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తే అందులో ఉండే రిస్క్ తెలుస్తుంది. మేం చాలాసార్లు ప్రాణాలకు తెగించి పనిచేయవల్సిఉంటుంది"

"అదేమోగానీ, మీరు హైదరాబాద్‌లో ఇల్లు కొన్నారని తెలియగానే మా పెద్దమామయ్యా, మా తమ్ముడు బోసూ నన్ను ఒకటే ఎగతాళి పట్టించారు. నాకు చచ్చేటంత సిగ్గయ్యింది"

"అలానా? "

"ఒకళ్లు అన్నారని కాదు. మనమటుకు మనం నిజాయితీగా ఉంటే చాలు. జీతంమీద ఆధారపడి బతకడంలో ఇబ్బందులు ఉన్నా ఆ బతుకులో భయం ఉండదు. అలాకాకుండా లంచాలు మరిగితే అందరూ అదోలా చూస్తారు. వెనకవెనక నవ్వుకుంటారు. ఇక ప్రమాదం అంటారా, ఏమో ఏదైనా అవొచ్చు అవును కదండీ" అంది ఝాన్సీ.

సత్యమూర్తి ఝాన్సీవైపు చూశాడుగానీ జవాబు చెప్పలేదు. కాసేపు ఆగి ఆపైన లోపలికి చూసి, 'అమ్మా' అంటూ పిల్చాడు. 'వస్తున్నారా' అంటూ వంటింట్లోంచి



కాంతమ్మ వచ్చింది. 'ఏమిట్రా, సత్యం' అంది.

"నాన్నగారు ఇంకా ఇంటికి రాలేదుక దమ్మా. ఫంక్షన్‌కు టైం అవుతోంది"

"నన్నూ మిమ్మల్నీ తయారయి షుగర్ ఫ్యాక్టరీకి వచ్చేయమని పొద్దున్నే చెప్పారు. మళ్ళీ ఇంతదూరం వెనక్కి రావడం తప్పు తుంది. ఓ అరగంటలో మనం బయలుదే రదాం" అని ఝాన్సీని చూసి, "నువ్వు తయారుకా ఝాన్సీ" అంది.

"నాదేం ఆలస్యం లేదు అత్తయ్యా. కానీ నేను పొద్దున్న మీతో చెప్పానుగా. ఆ విష యంలో ఏం ఆలోచించారు? " అంది నెమ్మ దిగా ఝాన్సీ.

"ఏమిటమ్మా? "

"సత్యమూర్తి వెంటనే అన్నాడు. "అదే నమ్మా... మీరు ఈ ఊరు వదిలి, మాతో హైదరాబాద్ రావడం"

కాంతమ్మ కొడుకు మొహంలోకి చూస్తూ, "మీ నాన్నగారితో చెప్పానురా. ఆయనేమో ఈ ఊరు బాగానే ఉంది. పైగా ఈ ఊళ్లో అందరూ తెలిసినవాళ్లు. హైదరాబాద్‌లో అయితే అంతా కొత్త. తోచదు" అన్నారు.

"రిటైరయిన తర్వాత ఈ ఊళ్లో పనేమి టమ్మా. మన పొలాలు కౌలుకిచ్చాం. వాటిని రైతు చూసుకుంటాడు. ఇక్కడ కాల క్షేపం ఏముంటుంది? పైగా రిటైరయిన తర్వాత కొడుకుల దగ్గర ఉంటే మీకు ఆనందం... మాకు గౌరవం"

"ఆమాట నిజమేరా... కానీ మీ నాన్న సంగతి నీకు తెలుసుగా. ఆయన పద్ధతులూ అలవాట్లూ వేరు. అయినా కోడలూ నువ్వూ కొంతకాలం జంటగా ఉంటేనే బావుం టుంది. మీకూ బరువు బాధ్యతలు తెలిసొ స్తాయి. మేం ఎంతైనా పానకంలో పుడక లమే ఇక" అంది చిన్నగా నవ్వుతూ కాంతమ్మ.

"అలా అనొద్దు. మీరు నాకు అండగా ఉంటేనే నాకు బావుంటుంది. భైరవికి, నాకూ కూడా హైదరాబాద్ కొత్త. ఈయ నేమో పొద్దున్న వెళ్ళి అర్ధరాత్రిదాకా రారు. ఇంట్లో మీరుంటే ఆయన దూకుడు కాస్త..." అని ఆపేసింది.

"అలా అంటావా, చూద్దాం" అంటూ కాంతమ్మ "అవునురా సత్యం! భాస్కరం, రాధా ఇంతవరకూ రాలేదు. భైరవి ఎటూ రావడంలేదు" అంటూ కూతుర్నీ, పెద్దకొడు కునూ, పెద్దకోడలినీ తల్చుకుంటూ అంది కాంతమ్మ.

"వాడికేం పనిపడిందో. నువ్వూ, ఝాన్సీ తయారవండి ఫ్యాక్టరీకి వెళదాం" అన్నాడు సత్యమూర్తి.

★ ★ ★

అరగంటలో సత్యమూర్తి, ఝాన్సీ కాంత మ్మగారూ షుగర్ ఫ్యాక్టరీకి వెళ్ళారు. లోపల ఒకచోట బ్లాక్‌బోర్డుమీద, 'గాంధీగారు పదవీ విరమణ గావించే సందర్భంలో వీడ్కోలు' అని రాసి వుంది. అప్పటికే ఆ చిన్న హాలు ఒకరిద్దరు ఆఫీసర్లతో, సూపర్‌వైజర్లతో, వర్కర్లతో నిండివుంది. వేదికమీద ఫ్యాక్టరీ జి.యమ్., ఇద్దరు ఆఫీసర్లు, వారి మధ్య గాంధీగారు కూర్చుని వున్నారు. జి.ఎమ్. గాంధీగారికి పూలదండ వేశాడు.

ఆ తరువాత గాంధీగారు ఇరవైఏళ్లు ఫ్యాక్ట రీకి చేసిన సేవల గురించి మాట్లాడి, ఆపై అన్నాడు. "నిజాయితీతో కష్టపడి పనిచే యడం ఎలానో మాలో చాలామంది ఆయన్ని చూసి నేర్చుకున్నాం. డబ్బున్న వాళ్లు పెట్టుబడి పెట్టి పరిశ్రమలు స్థాపించ గలరు. ఉద్యోగాలు ఇవ్వగలరు. అయితే ఆ సంస్థ, దాని పురోభివృద్ధీ అందులో పనిచేసే వ్యక్తుల శక్తియుక్తులమీదే ఆధారపడు తుంది. గాంధీగారు ఈవేళ పదవీ విరమణ చేసినా తనలా నిస్వార్థంగా పనిచేసేవారిని తయారుచేసి నాకూ, ఫ్యాక్టరీకి రుణం తీర్చు కున్నారు. వారికి కృతజ్ఞతలు" అంటూ గాంధీగారికి బెనిఫిట్స్ తాలూకు చెక్కులు అందించాడు.




"ఆ తరువాత గాంధీగారి గురించి ఒక రిద్దరు మాట్లాడారు.

ఆఖర్ని గాంధీగారు లేచి, "ఈరోజుతో నా సర్వీసు పూర్తి అయింది. ఇంతకాలం నేను పనిచేసింది నా కాన్షస్ చెప్పినట్టుగానే! అందుకే ముక్కుకు సూటిగా పనిచేయగ ల్గాను. నా సర్వీసులో నేను ఎంతోమంది దగ్గర పనిచేశాను. నా దగ్గరా ఎంతోమంది పనిచేశారు. అందరూ ఒకేలాగ ఉండరు. రకరకాల మనుషులు ఉంటారు. కానీ ప్రతీ ఉద్యోగి తన జీవనం కోసం ఎక్కడ పనిచే సినా, పరోక్షంగా అది దేశసౌభాగ్యం కోసమే అని మర్చిపోకూడదు. మనిషికి తను మని షిననే స్పృహ ఉండాలి. పశువుగా ప్రవర్తిం చకూడదు. గత ముప్పైఏళ్లల్లో జనంలో విలువలు పతనం అవడం నా కళ్లతో చూశాను. ముఖ్యంగా అవినీతిని నీతిగా చేసుకునే ఉద్యోగస్థులు పెరిగారు.

చాలామటుకు రాజకీయాలూ, రాజకీయ నాయకులు పరిపాలనలో జోక్యం చేసుకోవ డంవల్ల ఉద్యోగస్థుల్లో స్వార్థం పెరిగింది. తప్పుడు సంపాదనకు ద్వారాలు తెరిచారు. ఓ లెఖ్ఖ ప్రకారం మనదేశంలోని ఉన్నతో ద్యోగులు, రాజకీయనాయకులు విదేశాల్లో దొంగచాటుగా దాచుకున్న డబ్బు విలువ నలభైఎనిమిదివేల కోట్ల రూపాయలు అని తేలింది. ఇది మనం విదేశాలనుంచి అప్పుగా తెచ్చుకున్న డబ్బుతో సరిసమా నంగా ఉందిట. ఇప్పుడు చెప్పండి. మనం ఎటుపోతున్నామో? ? మేధావులు గుండెలు బాదుకుంటున్నారు.

అట్టడుగువాడికి వాడి కన్నీరే కానుకగా మిగులుతోంది. అందుకే చెప్తున్నాను. ఈనాటి యువతరం మేల్కొనాలి. ఉద్యోగ స్థుల్లో నిజాయితీ పెరగాలి. దేశం మునిగి పోతే మన ఉనికే ఉండదు. అందుకే 'దేశం ఎటుపోయినా ఫర్వాలేదు. నేను మిగిలితే చాలు' అనేవాళ్లను ఓ కంట కనిపెట్టి బుద్ధి చెప్పాలి. మనుషుల్లో గడ్డితినే ఆచారం ప్రబ లకుండా చూడాలి. నమస్తే" అంటూ తన ఉపన్యాసం ముగించారు.

సభల్లో చప్పట్లు మారుమోగాయి.

ఆ తర్వాత చాలామంది గాంధీగారితో స్వయంగా కరచాలనం చేశారు. యాజ మాన్యం ఏర్పాటుచేసిన కారులో ఇంటికి తిరిగివచ్చాడు భార్యా, కొడుకూ, కోడలితో.

అలవాటుగా హాల్లో ఉన్న పొడవాటి ఈజీ చెయిర్‌లో కూర్చున్నాడు.

"ఇంతకాలానికి మీకు ఋణవిముక్తి అయింది. భైరవి పెళ్లి చేసేస్తే మనం, దేవు డనీ, యాత్రలనీ కొత్తదారులు పట్టొచ్చు" అంది చిన్నగా కాంతమ్మ.

"అలా కాదు అత్తయ్యగారూ" అంటూ ఝాన్సీ తన మనసులో మాట మరోసారి చెప్పింది. సత్యమూర్తి కూడా భార్యమాటే మాట్లాడాడు.

"ఇప్పుడేమంత తొందరొచ్చిందిరా. నాకు కొంతకాలం ఈ ఉయ్యూరులోనే ఉండాలని ఉంది. ఇంకా భైరవి పెళ్ళి మిగిలేవుంది. ఆ పెళ్లేదో మనింట్లోనే ఈ ఊళ్లోనే కానిద్దాం..."

"మనకు అక్కడ ఇల్లు ఉంది. అన్ని సదు పాయాలు ఉన్నాయి. భైరవి పెళ్ళి అక్కడే చేద్దాం"

"నువ్వు ఇల్లు కొన్నావని తెలుసు. ఈ విషయం నాకు నా స్నేహితుడి ద్వారా తెలి సింది"

"నేను ఆ ఇల్లు బ్యాంక్ ఇన్‌స్టాల్‌మెంట్స్ మీద కొన్నాను. మీరు ఏమంటారోనని చెప్ప లేకపోయాను"

"నువ్వూ, భాస్కరం కూడా పెద్దవాళ్లు అయ్యారని నాకు తెలుసు"

"ఆయన ఈ విషయం మీతో ముందుగా చెప్పకపోవడం తప్పే" అంది ఝాన్సీ.

"నీతో కూడా ఈ విషయం వాడు చెప్పలేదు. అదీ నాకు తెలుసు"

"పోనీలెండి. వాడేం కానిపని చేయలేదుగా. పట్టింపులు దేనికి" అంది కాంతమ్మ.

"మామయ్యగారూ. మీరిద్దరూ ఇక్కడ

ఉండడం నాకిష్టంలేదు. ఓ నాల్గురోజులు ఆలస్యమయినా మనం అందరం కలిసే హైదరాబాద్ వెళదాం"

"చూద్దాం అమ్మా. నువ్వు ప్రేమగా పిలుస్తూంటే నేనూ ఆయనా ఎలా కాదనగలం" అంది భరోసా ఇస్తోన్నట్టుగా కాంతమ్మ.

సరిగ్గా అప్పుడే ఇంటిముందు ఆటో ఆగింది. అందులోంచి గాంధీగారి పెద్దకొడుకు భాస్కరం, అతని భార్య రాధా దిగారు.

"రైలు బాగా లేటయ్యింది నాన్నగారూ! విజయవాడనుంచి రావడానికి ఇంకో రెండు గంటలు పట్టింది" అన్నాడు భాస్కరం తండ్రిని చూసి. రాధా, ఝాన్సీ పలకరింపుగా ముందు చేతులు కలుపుకున్నారు. కాంతమ్మగారు లోపలినుంచి టిఫినూ, కాఫీ తెచ్చి ఇద్దరికీ ఇచ్చింది. రాధ టిఫినూ, కాఫీ కూడా ముట్టుకోలేదు.

"తిను రాధా" అంది కాంతమ్మ.

"అది కాదు అత్తయ్యా" అంటూ రాధ ఒక్కసారిగా బావురుమంది. ఆమె కళ్ళవెంబడి నీళ్ళు ధారాపాతం అయ్యాయి! చుట్టూ ఉన్న నలుగురూ ఆ హఠాత్ పరిణామానికి విస్తుపోయారు!!

★ ★ ★

అప్పుడు గాంధీగారి గదిలో ఆయనా, పెద్దకొడుకు భాస్కరం ఎదురెదురుగా కూర్చుని ఉన్నారు. భాస్కరం తలవంచుకుని, నసుగుతూ పొడిమాటలతో విశాఖపట్టణంలో తన ఆఫీసులో జరిగిన, తనకు ఎదురైన ఇబ్బందుల గురించి చెప్పాడు. గాంధీగారు ఆశ్చర్యంగా కొడుకు మాటలు వింటూ ఆపైన కొద్దిగా చలించాడు. ఆపైన కోపం తనని చుట్టుముడుతూ ఉంటే ఆపుకోలేక "ఇలా ఎలా జరిగింది?" అంటూ ప్రశ్నించాడు.

భాస్కరం మరోసారి జరిగిందంతా చెప్పాడు. ఆ చెప్పడంలో తన తప్పేంలేదని, తన పైఅధికారి ప్రెషర్‌వల్ల తల ఊపవల్సి వచ్చిందని, దానిమూలంగా తన అధీనంలో ఉన్న లక్షరూపాయల ఆఫీసు డబ్బు దారి మళ్ళించవల్సి వచ్చిందనీ- అందుకు తనని సస్పెండ్ చేశారనీ చెప్పాడు.

"నీ తప్పు లేనప్పుడు- నువ్వు ఆ పైన ఉండే అధికారులను కలిసి జరిగింది చెప్పాలి. కాకపోతే వాస్తవాల్ని కాగితంమీద పెట్టి ఉండవల్సింది. ఎవడో చెబితే గవర్నమెంట్ డబ్బు స్వంతానికి వాడుకోవడం నేరం అని తెలియదా నీకు? "

"నేను-ఆ సుదర్శనంగారి కింద పనిచేస్తాను. ఆయనమీద కంప్లయింట్ యిస్తే బావుండదు. రేపు నన్ను వాళ్ళు ఏ రిమోట్ ప్లేస్‌కో ట్రాన్స్‌ఫర్ చేస్తారు. అది మరీ ప్రమాదం"

"నేనంటాను... ఆ డబ్బు నువ్వు తిన్నావని... కాదనగలవా? "

"లేదు నాన్నగారూ... రెండు రోజుల క్రితమే డబ్బు తిరిగి ఎడ్జెస్ట్ చేశాను. కానీ- నామీద సస్పెన్షన్ వాపసు తీసుకోలేదు"

"ఇందులో తప్పు చాలామటుకు సుదర్శనంగారిదే. కానీ ఆయన ఈయనగారిని ఇరికించారు" అంది రాధ.

"నాకు ప్రమోషన్ రావల్సివుంది. మధ్యలో ఈ సస్పెన్షన్ మూలంగా అది వెనక్కిపోవచ్చు అందుకే మా సెక్రటరీ గారు... అదే రామచంద్రంగారికి నచ్చచెప్పాలి. ఆయన మీకు బాగా తెలుసు కదా... మీరు ఫోన్ చేస్తే ఆయన వింటాడు"

"అవును మామయ్యా" అంది బేలగా రాధ.

"ఈ బుద్ధి నీకు ఇలాంటి గొడవల్లో ఇరుక్కునేముందే ఉండాలి. ఇప్పుడు ఏడిస్తే ఏం లాభంరా" గాంధీ కటువుగానే అన్నాడు.

"అది కాదు..."

"ఉద్యోగధర్మాలని కొన్ని ఉంటాయి. నీకు నలభై ఏళ్ళు వచ్చాయి. ఈ మాత్రం తెలియదా? నీమీద ఇంతవరకూ ఎన్ని కంప్ల



యింట్స్ వచ్చాయో నువ్వు చెప్పకపోయినా నాకు తెలుసు"

"ఎవరో కిట్టనివాళ్ళు లక్ష అంటారు. అవన్నీ పట్టించుకుంటే ఉద్యోగం చేయడం కష్టం"

"ఏమోరా రామచంద్రంగారు చాలా నిజాయితీపరుడు. లంచాలు పట్టే పందికొక్కుల్ని ఆయన అసలు స్పేర్ చేయరు. ఈవేళ నేను నీ గురించి చెప్పినా ఆయన ముందు నాకు చీవాట్లు పెడతాడు"

"అయితే నన్నేం చేయమంటారు? "

"ఎంక్వయిరీ జరుగుతుందిగా. జరిగినవన్నీ చెప్పు... అంతే"

రాధ- మామగారికీ, భర్తకూ మధ్య నడిచే వాదోపవాదాలు విని,

"అత్తయ్యా, ఆయనకు నేను ముందే చెప్పాను. మామగారు ఓ పట్టాన ఇటువంటివాటిలో మాటసాయం చేయరని. కానీ ఈయనే నన్నూ తనతోపాటు బయలుదేరదీశారు"

గాంధీ ఏమీ మాట్లాడలేదు.

"అయితే నేనూ రాధా రేపు ఉదయం బయలుదేరి మద్రాసు వెడతాం. మా మామగారికి కూడా కాస్తోకూస్తో పలుకుబడి ఉంది. ఏం చేస్తాను. ఆయన కాళ్లమీద పడతాను" అన్నాడు ఉక్రోషంగా భాస్కరం.

"మంచిది. అలాగే కానివ్వు" అంటూ గాంధీ ఆ గదిలోంచి బయటకు వెళ్లాడు.

"ఏంజరిగిందండీ? " అంది కాంతమ్మ.

"నీ పెద్దకొడుకు చేసిన నిర్వాకం ఏమిటో వాడినే అడుగు. నేను ఈరోజు రిటైరయ్యాను కదూ... తండ్రికి ఓ శుభవార్త కానుకగా ఇచ్చాడు...అంతే"

కాంతమ్మ అర్థంకాక భర్త మొహంలోకి చూసింది. ఆపనే సత్యమూర్తీ చేశాడు. ఆపైన నెమ్మదిగా "ఏమిటి నాన్నగారూ" అన్నాడు.

"మీ అన్నయ్యను అడుగు చెప్తాడు" అనేసి, "నేను పెద్దవాణ్ణి అయ్యాను. నేను సంపాదించింది తక్కువే. మీకు ఏమీ మిగల్చలేదు. ఆ విషయం నాకు తెలుసు. కానీ మీకు చదువులు చెప్పించాను. మీ అదృష్టం బావుండి మీకు ప్రభుత్వ ఉద్యోగాలు దొరికాయి. నేను నా కొడుకులు కూడా నిజాయితీగా పనిచేస్తారనీ, ఉన్నదాంట్లోనే తింటారనీ ఆశించాను. నేను మీనుంచి ఆశించేది అదొక్కటే! కాదు-లోకంలో చాలామంది చెడుమార్గాన పోతున్నారు కాబట్టి మేమూ అటే పోతామంటారా- అదీ మీ ఇష్టం... ఎవరూ కూడా కళ్లు మూసుకుని పాలు తాగే పిల్లుల్లా తమనితాము అంచనా వేసుకోకూడదు. ఉన్నతికి వెళ్లడం కష్టం. కానీ పైనుంచి కిందకు పడిపోవడం చాలాతేలిక. నువ్వూ గుర్తుంచుకో..."

"అదికాదు నాన్నగారూ, నామాట" ఆగిపోయాడు.

"ఏమిటీ"

"అదే- మీరూ అమ్మా మాతోపాటు హైదరాబాదు రావడం. మీరేం ఆలోచించారు? "

"వస్తాను. కానీ ఓమాట... కాదు ఓ షరతుమీద మీతోపాటు బయలుదేరతాను"

"చెప్పండి"

"నువ్వు మీ అన్నయ్య భాస్కరంలా మాత్రం ఎప్పుడూ ప్రవర్తించకూడదు. నీపేరుకు నాపేరుకూ కాదు- దేశానికి చెడ్డపేరు తేకూడదు. సరేనా? "

సత్యమూర్తి తలవంచుకుని- 'సరే' అన్నాడు.

సరిగ్గా అప్పుడే భైరవి హైదరాబాద్‌నుంచి తండ్రిపేర ఇచ్చిన 'హేపీ రిటైర్డ్ లైఫ్' అనే గ్రీటింగ్ టెలిగ్రాం వచ్చింది.

★ ★ ★

భైరవి బ్యాంక్‌నుంచి పనిముగించుకుని త్వరత్వరగా నడుచుకుంటూ జనరల్ పోస్టాఫీసు దాకా వచ్చింది. ఆ క్రితంరోజు ఉయ్యూరులో తండ్రి పదవీ విరమణ చేసిన సందర్భంలో జరిగిన వీడ్కోలు సభ గురించి అన్న సత్యమూర్తి ఫోన్‌చేసి




చెబుతూంటే ఆమె ఎంతగానో సంతోషించింది. తండ్రితో, తల్లితో మాట్లాడింది. ఒకటికి పదిసార్లు 'హేపీ రిటైర్‌మెంట్ లైఫ్ నాన్నగారూ' అంటూ చెప్పింది. అప్పుడే సత్యమూర్తి తను తల్లినీ, తండ్రినీ హైదరాబాద్ తీసుకువస్తున్నాననే శుభవార్త కూడా చెప్పాడు. భైరవి ఆ మాటలు వినగానే ఎంతో ఉప్పొంగిపోయింది.

అవును ఇక అందరూ ఒకే గూటిలో ఉండే అవకాశం కల్గుతోంది. రోజూ పండగగానే ఉంటుంది. పిల్లలను పెంచి, చదువులు చెప్పించి వారు ఉన్నతికి వెళ్లే అవకాశం కల్పించిన మధ్యతరగతి కుటుంబీకుడికి ఓ ప్రతిరూపం-తండ్రి! మంచికీ నిజాయితీకీ మరో కొండగుర్తు ఆయన. ఎప్పుడూ సౌమ్యంగా ఉంటూ మనిషి నిటారుగా తలెత్తుకుని ఎలా బతకాలో నిర్వచనం చెప్పగల ఉదాత్తుడు. అలాంటి వ్యక్తి కడుపున పుట్టడం నిజంగా అదృష్టమే.

ఇంటిపెద్ద ఓ మర్రివృక్షంలాంటి వాడయితే ఆయన సంతానం ఆ చెట్టునుంచి మొలకెత్తిన చిన్నా, పెద్దా ఊడలు అవుతారేమో? నిజమే ప్రతిమనిషీ చిన్న మొక్కగా జీవితాన్ని ప్రారంభించి ఒకనాటికి తల్లి చెట్టుగా మారవల్సిందే... ఎందరికో నీడనిచ్చి సేదతీర్చే చెట్టుకూ సహృదయుడైన మనిషికీ తేడాలేదు, ఉండదు.

భైరవి ఆలోచనలనుంచి తేరుకుని తిరిగి లోకంలో పడింది. ఆపైన ఒకటికి రెండుసార్లు మార్కెట్ రోడ్డువైపు చూసింది. ఎంతోమంది అటునుంచి వస్తూ కన్పిస్తున్నారు. కానీ ఆమెకు ఆ జనంలో కావల్సిన మనిషి మాత్రం కన్పించలేదు. ఓసారి చేతికున్న వాచీ చూసుకుంది. మరో ఐదు నిముషాలు గడిచాయి. చటుక్కున ఆమె వెనకనుండి, 'హలో' అన్న తీయనిది, తెలుసున్నది పిలుపు చెవుల్ని తాకగానే ఆమె విద్యుత్ తరంగమై తలతిప్పి చూసింది. వచ్చింది చైతన్య.

"ఆలస్యం చేశానుకదూ, క్షమించాలి భైరవీ"

"సరేలే..."

"సెక్షన్‌లో పని తెమలలేదు. పైగా విజయవాడనుంచి నా స్నేహితుడూ, మీ వదినగారి తమ్ముడూ బోసుబాబు వచ్చాడు. వాడికీరోజు ఇన్‌ఫోసిస్‌లో ఇంటర్వ్యూ జరిగింది. ఉదయం వాడితో సరిపోయింది"

"బోసుబాబు వచ్చాడా? మా ఇంటికి రాలేదు. ఫోన్ కూడా చేయలేదు"

"వాళ్ల అక్కా, బావా ఊళ్లోలేరని తెలిసిందట. నీ గురించి...అదే మనగురించి అడిగాడు" భైరవి వింటోంది.

అలా చైతన్య ఏవేవో కబుర్లుచెప్పి, "నాకు బాగా ఆకలివేస్తోంది, హోటల్‌కు వెడదాం" అన్నాడు. ఇద్దరూ తాజ్‌మహల్ హోటల్లోకి వెళ్లారు.

"అవునూ... నిన్న మీ నాన్నగారు రిటైరయ్యేరోజుకదా... ఫంక్షన్ ఎలా జరిగిందిట"

"మా అన్నయ్య ఫోన్‌చేశాడు" అంటూ భైరవి ఫంక్షన్ విశేషాలుచెప్పి, "చైతన్యా! ఒకటి రెండురోజుల్లో ఆ అమ్మా నాన్నా ఇక్కడికి వచ్చేస్తున్నారు తెలుసా?" అంది సంతోషంగా. చైతన్య అంతా విని చిన్నగా నవ్వి, "ఇంకేం ఇది మనకు శుభసూచకం. ఓ మంచిరోజుచూసి నువ్వు మీవాళ్లతో మనగురించి చెప్పెయ్" అన్నాడు.

"నిజమే కానీ మా అన్నయ్య అంటేనే భయంవేస్తోంది. ఏం అడ్డుపుల్ల వేస్తాడో?"

"అవును... మీ అన్నయ్యగారికి నేనంటే పీకలదాకా కోపం వుంది. ఏడాది క్రితం ఓసారి మీ అన్నయ్యను ఓ హోటల్లో ట్రాప్ చేశాం. కేసు చిన్నదే... కానీ మా ఇద్దరి మధ్యా కక్షలు పెరిగాయి. మన గురించి తెలిస్తే నిన్నూ నన్నూ కూడా ఓ పట్టాన వదిలిపెట్టడేమో"

"చూద్దాం. ఏదో దారి దొరకకపోదు"

"నేను మన గురించి బోసుబాబుకు చెప్పాను భైరవీ... అంతా విని వాడు

మనకు ఏ సహాయం కావాలన్నా చేస్తానన్నాడు. బహుశా వాడికి ఇన్ఫోసిస్‌లో ఉద్యోగం రావచ్చు వాడూ హైదరాబాద్ వస్తే మనకు అండగా ఉంటాడు"

"బోసుబాబు కూడా విజయ్‌ప్రకాశ్‌గారి జనహితలో యాక్టివ్ మెంబర్ అని విన్నాను. నిజమేనా? "

"బోసుబాబు ఫాదర్ తిలక్‌గారు విజయ్ ప్రకాశ్‌గారికి బాగా కావాల్సిన వ్యక్తి. వాడు జనహిత గురించి చెబితేనే నాకూ తెలిసింది. ఆ తర్వాతే నేనూ సంస్థలో సభ్యుడినయ్యాను. నిన్నూ జేర్పించాను"

"అవును... టి.విలో విజయ్‌ప్రకాశ్‌గారి ఆధ్వర్యంలో జరిపే గోష్ఠులే ఎంతో ఎవేక్నింగ్‌గా ఉంటాయి"

"ఇన్నాళ్లూ నీతో చెప్పకుండా దాచాను భైరవీ... ఇప్పుడు చెప్తున్నాను. మీ అన్నయ్యగారూ, ఆ విశ్వనాథంగారూ పెద్ద తిమింగలాలని పేరు తెచ్చుకున్నారు. ఏళ్లుగా వాళ్లిద్దరూ జాయింట్‌గా కరప్షన్‌కు సింహద్వారాలు తెరిచారు. తప్పదు. ఏదో రోజు వాళ్ళిద్దరూ పీకలోతు మునుగుతారు"

"అలానా? " -ఆశ్చర్యపోయింది భైరవి.

"మీ అన్నయ్యగారి సంపాదనా, ఆయన లైఫ్‌స్టైలూ చూస్తేనే తెలుస్తుంది. గట్టిగా నాలుగేళ్ళ సర్వీసు లేదు మీ అన్నయ్యకు"

భైరవి మాట్లాడలేదు.

"బహుశా మీ అన్నయ్య గురించి నీకు పూర్తిగా తెలిసే అవకాశం లేదు. ఎందుకంటే నీకీ ఊరు ట్రాన్స్‌ఫర్ అయింది ఈమధ్యనేగా? "

"అవును చైతన్యా"

"చెల్లెలుగా నువ్వు ఏ సలహా యిచ్చినా ఆయనగారు లెఖ్ఖ చేయకపోవచ్చు. అవునూ... మీ వదినగారు ఎటువంటి మనిషి? "

"మా వదినకు డబ్బు ఆశ ఉందని నేను అనుకోను. పైగా మా నాన్నగారిలాగే వాళ్ల నాన్నగారు కూడా దేశభక్తుడు. వదిన చదువుకుంది. వివేకవంతురాలని నా అభిప్రాయం"

"భర్త ఇంతచేటు సంపాదిస్తూంటే న్యాయంగా ఏ భార్యకైనా నిజం తెలియక పోదు. బహుశా మీ వదినగారు అమాయకురాలై ఉండిఉండాలి. లేకపోతే సత్యమూర్తి గారు ఎవరికీ తెలియకుండా తన సంపాదన వేరు దారులగుండా దాస్తూనయినా ఉండాలి"

"అవును... నువ్వు చెప్పింది నిజం కావచ్చు" అంటూ భైరవి ఎక్కడో ఆలోచిస్తూ అచేతనంగా తన చేతులకున్న బంగారుగాజులు, మెడలో చంద్రహారాలూ తడుముకుంది. ఎందుకో ఆమెకు ఒళ్లు గగుర్పొడిచింది. తలవంచుకుంది కాసేపు. ఓ క్షణం తర్వాత చైతన్య కళ్లల్లోకి చూస్తూ, "చైతన్యా! మనలో చాలామందిమి, దేశ భవిష్యత్ గురించి ఎన్నో కలలు కంటాం... అవకాశం దొరికితే ఉపన్యాసాలిస్తాం. కానీ ఇంట్లో ఇటు తండ్రిగానీ, అటు భర్తగాని దొంగచాటు సంపాదనతో ఇల్లంతా స్వర్ణమయం చేస్తే- ఆ ఇంట్లో ఎవరూ కూడా ఈ మార్పు ఎలా వచ్చిందని వెనక్కి తిరిగి ఆలోచించరు. ఆర్నెల్లనాడు అన్నయ్య నాకు గాజులు, గొలుసూ చేయిస్తే నేను వాటిని ఆనందంగా స్వీకరించాను. అప్పుడు నాక్కూడా ఈ ఆలోచన రాలేదు. ఇప్పుడు నాకు నేనే దోషిగా కనిపిస్తున్నాను. క్రిందటి నెలలో మనం జనహిత ఫౌండర్ అయిన విజయప్రకాష్‌గారి ఉపన్యాసం విన్నాం గుర్తుందా? .. అవినీతి ఈ దేశంలో ఎలా పాతుకుపోయిందో ఆయన చెప్పినప్పుడు ఆశ్చర్యం వేసింది ఆనాడు. ఇప్పుడు బాధగా ఉంది. ఎందుకంటే అవినీతి-మా ఇంట్లో మా అన్నయ్యా చేతుల మీదుగా మూడుపూవులూ, ఆరుకాయలుగా వృద్ధి చెందుతున్నందుకు"

"ఇది ఇప్పుడు ఇంటింటా ముసుగు వేసుకుని వుంటూనే ఉందని నా అనుమానం. నువ్వు బాధపడకు. బాధ దేనికీ పరిష్కారం




కాదు. మీ అన్నయ్యను మార్చగలిగితేనే గొప్ప"

"చైతన్యా! నాకు వంటిమీద తేళ్లూ, జర్రులూ పాకుతున్నట్లుగా ఉంది. ఈ విషయం తెలిస్తే నాన్నగారు ఎంత బాధపడతారో... పైగా ఆయన ఇక్కడికి వస్తున్నారు"

"చూడు భైరవీ! తొందరపడి ఈ విషయం నువ్వు నాన్నగారి దగ్గర ఎత్తకు. మీ అన్నయ్యతో కూడా గొడవ పడొద్దు.... దీనికి మనమే పరిష్కారం ఆలోచిద్దాం... సరేనా? "

భైరవి మాట్లాడలేదు.

"ముందు మనిద్దరి గురించి ఆలోచించు భైరవీ! మనం పెళ్లి చేసుకుందాం. అప్పుడు నువ్వు మీ అన్నగారి ప్రాపున ఉండడం తప్పుతుంది"

"ఎలాగూ నాన్నగారూ, అమ్మా వస్తున్నారు. నేను నా మనసులోని కోరిక చెబితే వాళ్లు కాదనరు. నాది మా బామ్మ పేరు. నాన్నగారికి నేనంటే అందుకే ప్రేమ ఎక్కువ" అంది నవ్వుతూ భైరవి.

"పోనీలే.. నీకో ప్లస్ పాయింట్ ఉంది... నా సంగతి చెబుతాను విను. నాది- మా అమ్మగారి తండ్రి పేరు. దాంతోనే నాకు చిన్న చిన్న ఇబ్బందులు వస్తూ ఉంటాయి. మా నాన్నగారు నన్ను పేరు పెట్టి తిట్టి మా అమ్మను ఉడికిస్తూ వుంటారు. ఏం చెప్పమంటావ్? " అంటూ నవ్వేశాడు చైతన్య.

"మీ నాన్నగారిది అన్యాయం" భైరవీ నవ్వింది.

"భైరవీ! మనం వచ్చేవారం ఇందిరా పార్కులోగానీ, మీ ఇందుమతిగారి ఇంట్లోగానీ కలుద్దాం. ఈ లోపున మీ వాళ్లు వస్తారు కాబట్టి నువ్వు మన కథను కొంచెం ముందుకు నడిపించు... బహుశా నేను రేపు ఆన్‌డ్యూటీ మీద మద్రాస్ వెళ్లవలసి రావచ్చు. వీక్ ఎండ్‌కు వచ్చేస్తాను"

"అలానే" అంటూ భైరవి చేతివాచీ చూసుకుంది.

"ఏమిటీ వాచీ చూసుకుంటున్నావ్. వెడదామంటావా? "

"అవును. ఎంతసేపు కూర్చున్నా పాపం, హోటల్‌వాడు ఎవర్నీ పొమ్మనమని అనడు. ఇక ఇంటిలో పెద్దలయితే మనం క్షణం ఆలస్యంగా ఇంటికి వెడితే ఇంతసేపూ ఎక్కడ ఉన్నావ్ అని తిట్లతో లోపలికి ఆహ్వానిస్తారు. ఇదే ఇంటికీ, హోటల్‌కూ తేడా ఏమో" అంది భైరవి లేస్తూ.

చైతన్యా, భైరవీ హోటల్‌నుంచి బయటకు వచ్చారు. తిరిగి జనరల్ పోస్టాఫీసు దగ్గరకు జేరారు. చైతన్య భైరవి వెళ్ళవల్సిన సీతాఫల్ మండీ బస్ వస్తూంటే ప్రేమగా ఆమె చేతితో తన చేతిని కలిపి ఆమెను బస్ ఎక్కించాడు!!

భైరవి సీటులో కూర్చుని పక్కకు తిరిగి స్టాప్‌లో నుంచున్న చైతన్యను చూసి చిరునవ్వు నవ్వి చేతితో వీడ్కోలు చెప్పింది!

★ ★ ★

అప్పుడు రాత్రి పది గంటలయ్యింది. ఆ ఇంటి పడగ్గదిలో డబుల్‌కాట్‌మీద సత్యమూర్తీ, ఝాన్సీ పడుకుని కబుర్లు చెప్పుకుంటున్నారు. అలవాటుగా ఆ కబుర్లలో ఒకరి చిలిపితనాన్ని మరొకరు కొండంతలుగా చిత్రీకరించుకుంటూ నవ్వుకున్నారు. ముద్దుముద్దుగా ఒకరినొకరు విమర్శించుకున్నారు. ఇంకా గ్రహాంతరవాసుల్లా కాంతివేగంతో గతంలోకి, భవిష్యత్‌లోకి ప్రయాణాలు చేశారు. అయితే ఝాన్సీ ఆలోచనల్లో చాలామటుకు, ఇళ్లూ, ఇంటి పరిస్థితులూ తిరుగాడితే, సత్యమూర్తి మాత్రం అందుకు విరుద్ధంగా గాలిలో తేలిపోయాడు. పైగా మాటల్లో ఎక్కువసేపు తన ఉద్యోగం గురించి, ఆ ఉద్యోగ నిర్వహణలో తను సాధించిన, సాధిస్తున్న విజయాలూ, ప్రమోట్ అవడం అవే దొర్లేటట్టు చూసుకున్నాడు. ముఖ్యంగా తనంటే పై అధికారుల కున్న సదభిప్రాయం, ఇంకా విశ్వనాథం తన పట్ల చూపించే ఆప్యాయత గురించి చెబుతూ, "ఆయనకు నేనంటే చాలా అభిమానం ఝాన్సీ... ఆయన కలగజేసుకున్న మూలం



గానే నాకు ప్రమోషన్ వచ్చింది" అన్నాడు.

"మీకన్నా సీనియర్స్‌ను కాదని మీకు ప్రమోషన్ ఇచ్చారంటున్నారు. వాళ్లందరూ ఊరుకున్నారా? "

"ఇక్కడ ఎఫిషెన్సీ ముఖ్యం. ఫైళ్లు పైవాళ్లు ఎటు నడిపితే అటు నడుస్తాయి"

ఝాన్సీ ఓసారి తల ఆడించి, "నిజమే కావొచ్చు కానీ పై అధికారులతో మరీ అంత రాసుకుపూసుకు తిరగడం మంచిది కాదేమో. వాళ్ళకు కరుణే కాదు, కోపం వచ్చినా కష్టమే. మర్చిపోకండి" అంది.

"అదేం కాదులే..." అంటూ సత్యమూర్తి ఏదో జ్ఞాపకం వచ్చినట్టు కాసేపు ఆగి, "చెప్పడం మర్చిపోయాను. మా విశ్వనాథం గారి తమ్ముడి కొడుకు రాఘవ పెళ్ళికి ఉన్నాడు. నేను ఆయనతో సూచాయిగా మన భైరవి గురించి చెప్పాను. ఈ విషయం అమ్మతో నాన్నగారితో చెప్తాను. ఈ సంబంధం ఎలా ఉంటుందంటావ్? "

"వాళ్ళు బాగా డబ్బున్నవాళ్ళు అంటున్నారు. మనం వాళ్లతో తూగగలమా? పైగా కట్నం ఎంత అడుగుతారో ఏమో? "

"అవన్నీ నాకు వదిలేయ్. నేను చూసుకుంటాను. అటూ ఇటూగా కట్నం పదిలక్షలు యివ్వవల్సి రావచ్చు"

"అమ్మో పదిలక్షలా. రూపాయిలా చిల్లపెంకులా అవి"

"ప్రస్తుతం స్టేట్ ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌లో జూనియర్ ఇంజినీర్ రేటు అది... నిజానికి పదిలక్షలు తక్కువనే చెప్పాలి"

"అది కాదండీ... అంత డబ్బు మనం ఎక్కడినుంచి తెస్తాం. మీ అమ్మగారూ నాన్నగారూ ఈ మాట విని హడలిపోతారు కూడా"

"కుర్రవాణ్ణి చూస్తే ఎవరైనా ఎగరేసుకుపోవాలనుకుంటారు"

"నాకు తెలుసు. మీ కన్ను మీ ఉయ్యూరు ఇంటిమీదా. ఆ రెండు ఎకరాలమీదా ఉంది కదూ... స్థిరాస్తి అమ్మి- ఇంత చేటు కట్నం యిచ్చి భైరవికి పెళ్ళిచేయడం మంచిదా? "

సత్యమూర్తి ఝాన్సీ కళ్లల్లోకి చూశాడు. ఆమె మాటలు అతని చెవులగుండా వెళ్ళి మెదడులో జొరబడ్డాయి.

"కానిపరుగులు తీయడం మంచిది కాదు. అలాగే కానిపనులు చేయనూ వద్దు.. మధ్య తరగతి కుటుంబీకులకు గొప్పలకు పోవడం- ఆ తర్వాత నాలిక కరుచుకోవడం- అలాంటి చరిత్రలూ మనందరికీ తెలియవా? "

"పూర్వంలో మనం మధ్యతరగతి మనుషులం. ఇప్పుడు కాదు... నువ్వు సీనియర్ ఎగ్జిక్యూటివ్ భార్యవి. ఆ విషయం గుర్తు ఉంచుకుని మాట్లాడు"

"రోజుల్నిబట్టి, ఖర్చుల్ని బట్టి మన వెనక ఉన్న పెద్దవాళ్లను గుర్తులో ఉంచుకుంటే మనం సాదాసీదా మనుషులమే"

"అదేం కాదు"

"ఓ మాట చెప్పమంటారా? "

"నిరభ్యంతరంగా... ధైర్యంగా" అంటూ ఆమె బుగ్గమీద చిటికేశాడు సత్యమూర్తి.

"మీ షోకులు, ఖర్చులు చూస్తుంటే నాకు భయం వేస్తోంది. ఆరు నెలలైంది మనం ఇల్లు కొని. కిందటి నెలలో మీరు భైరవికి పదిహేనుతులాల బంగారం కొని నగలు చేయించారు. వద్దన్నా వినకుండా నాకూ చంద్రహారాలు, గాజులూ చేయించారు. ఇక ఈ ఇంట్లో ఏ వస్తువూ పాతది కాదు. మన వంటిల్లు, మన డ్రాయింగ్ రూమ్, మన బెడ్ రూమ్ చూసినవాళ్లు మనల్ని చూసి కోటీశ్వరులే అనుకుంటారు"

"నేను ఇంట్లో అందరి ఆనందం కోసం ఖర్చుచేస్తున్నాను. అది తప్పా. చూస్తే నువ్వు నన్ను అనుమానిస్తున్నట్టుంది"

"అనుమానం కాదండీ... నా డౌట్ క్లియర్ చేసుకుందుకు అడిగాను. అంతే"

"నిన్ను పెళ్ళిచేసుకోకపూర్వంనుంచీ నేను ఉద్యోగస్థుణ్ణి. అప్పటికే మూడేళ్ల సర్వీసు ఉంది. పైగా నాకు ఖర్చులు తక్కువ. పొదుపరిని. అందుకని నేను జాగ్రత్త చేసిన





దాంట్లోంచి, పొలంమీద వచ్చిన ఆదాయం తోనే ఇవన్నీ చేయగల్గాను. అర్థం అయ్యిందా? ?" ఝాన్సీ మాట్లాడలేదు.

"నేను లంచాలూ గట్రా తీసుకుంటున్నానని నీ అనుమానమయితే ఆ మాట నా మొహం మీదే అడుగు"

"మీరు కరప్షన్ ఎడిక్టెడ్ కాకుండా ఉండా లని నా ఆశ. ఎందుకంటే మీ ఇంటా, మా ఇంటా అందరూ కూడా తమకు వచ్చిన జీతా లతో బతికినవాళ్లే, మా చిన్నాన్న తప్పించి. ఆయన ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్‌లో రెండు చేతులా గణించి యాభైఏళ్లు దాటిన తర్వాత జైలు పాలయ్యాడు. అప్పట్లో మా పిన్నీ, పిల్లలూ పడ్డ అవస్థలు మీకు చెప్పినా అర్థం కావు"

సత్యమూర్తి నవ్వేశాడు.

"మనసులో ఉన్నది చెప్పమన్నారుగా"

"ఝాన్సీ... నీకు తెలుసుకదా. మా నాన్న గారి పేరు గాంధీ. నిజంగా మా నాన్నవన్నీ గాంధీగారి బుద్ధులే. ఆయన తన సర్వీసంతా నిజాయితీగానే వెళ్లదీశాడు. నేను ఆయన కడుపున పుట్టాను. అది మర్చిపోకు"

"అది గుర్తుంటే చాలు తమరికి"

"అయినా ఆ రోజులూ, ఆ మనుషులూ వేరు ఝాన్సీ. ఈవేళ వాళ్లలా బతికినవాళ్ళ చేతికి మిగిలేది చిప్పే. కాలంతోపాటు మను షులూ, విలువలూ మారతాయి. తప్పదు"

"ఏమోనండీ నాకు అలా అన్పించదు. మన పుట్టుక వెనుక ఏదో ఓ పరమార్థం ఉందని నమ్మినప్పుడు మనం మంచినే పెంచి పోషిం చాలి. ఎదుటిమనిషి అక్రమాలూ, అన్యా యాలూ చేస్తున్నాడని బాధపడేముందు మనం వాటి దరిదాపులకు వెళ్ళకుండా ఉండ గలగాలి"

"చాల్లే ఆపు. అప్పుడే పదకొండు అయ్యింది"

"నాకు తోచింది చెప్పాను. సారీ మహా శయా" అంది చిన్నగా నవ్వుతూ, అతన్నివైపు తిరుగుతూ, అతనికి దగ్గరగా జరుగుతూ.

"నీ జడలో పువ్వులు రెక్కలు వాల్చుకుని సిగ్గుపడ్డం, అందుకు నా గుండెలు వేడిగా వేగంగా కొట్టుకోవడం నేను గమనించనేలేదు ఝాన్సీ... చూడు నా కళ్ళు నీ అందాన్ని కేంద్రంగా చేసుకుని ఎలా బిత్తరపోతు న్నాయో..." అంటూ సత్యమూర్తి ఝాన్సీని దగ్గరకి లాక్కున్నాడు.

"ఈ వేళ సెంటు రాసుకున్నావు, సరికొత్త వాయిలు చీర కట్టుకున్నావు, కాళ్ళకి పారాణి పెట్టుకున్న ఆనవాళ్ళూ, చేతులకు గోరింటాకు తాలూకు ఎర్రదనం... ఇవన్నీ, ఇవన్నీ" గుస గుసగా అడిగాడు.

"మీరు కవిత్వం చెపుతారుకదా అని... అంతే"

"కవిత్వం చెబితేనే ఓ నలుసును లంచంగా ప్రసాదించబోతున్నావని అర్థమయ్యింది"

"లంచం ఏమిటి కానుక అనండి" అంది ఝాన్సీ అదోలా చూస్తూ.

ఆమె అధరాలు అతనివి అయ్యాయి.



"మొత్తం హిందూస్థాన్ అంతా నాకు పాదాక్రాంతమై ఉంది. ఈ దేశంలో నేను తిన్నది చాలా తక్కువ. నేను వెనక్కి తిరిగి చూస్తే నేను పాటించిన సంయమనం నాకే



విస్మయం కల్గిస్తోంది" అని అన్నది ఎవరో తెలుసా? ఒకనాడు ఆంగ్లేయుల ప్రతినిధిగా ఈ దేశాన్ని తన గుప్పిట్లో పెట్టుకున్న క్లైవ్ మహాశయుడు.

కానీ ఇప్పుడు మనల్ని పాలించే మన పాలకుల సంగతి, వాళ్ళ స్వార్థం గురించి ఎంత తక్కువ మాట్లాడుకుంటే అంత మంచిది. ఇక మనదేశంలోని చాలామంది ఉద్యోగస్థులు, ఇంకా ఉన్నత పదవుల్లో ఉన్న వాళ్ళు ఒకరోజు బాహాటంగా కాకపోయినా, నసుగుతూనైనా క్లైవ్ మాటలు తమ గొంతుక ద్వారా విన్పించడం ఖాయం. మనం సంపాదించుకున్న స్వతంత్రం దేశభక్తుల్ని, దేశ ప్రేమికుల్ని వెనక్కినెట్టి, పదవులకోసం పాకులాడేవాళ్ళను, ఇంటిదొంగల్ని తయారు చేసుకుందుకు మాత్రమే ఉపయోగపడింది. మనం ఈ వ్యవస్థను ఎక్కడో అక్కడినుంచి నరుక్కు రాకపోతే మనకు మనుషులకు బదులు పందికొక్కులే మిగులుతాయి" అన్నాడు నిర్లిప్తంగా విజయప్రకాష్.

ఆ మాటలు విన్న తిలక్ కొన్ని క్షణాలు తల వంచుకునే ఉండిపోయి,



"నిజం... నువ్వు చెప్పింది ముమ్మాటికీ నిజం. ఈ విషానికి విరుగుడుగా కాకపోయినా చిన్నపాటి వైద్యమేకదా నువ్వుమొదలుపెట్టింది" అన్నాడు.

"నేను వేదికలు ఎక్కి మాట్లాడినా, పేపర్లలో వ్యాసాలు రాసినా ఈ దేశంమీద ప్రేమే లోపలినుంచి కుదుపులాంటిది తెస్తూ ఉంటుంది. మనుషుల్లో కనీసం ఈనాటి యువకులైనా నన్నూ, నా రాతల్నీ, నేను స్థాపించిన 'జనహిత' సంస్థనీ అర్థం చేసుకుంటారని, అర్థం చేసుకోవాలని ఆశపడుతూ ఉంటాను"

"విజయప్రకాష్ నీ ఆశయం గొప్పది. నీలాంటివాళ్ళు రాష్ట్రానికి ఒకరుండాలి"

"తిలక్‌గారూ... నేను ఆశపెట్టుకున్నది యువతమీదే. మా సభ్యుల్లో వీళ్ళు ఎక్కువే. వీళ్లందరికీ మన సామాజిక బలహీనతలు ఏమిటో తెలుసు. కానీ వాటిని రూపుమాపడం తెలియదు. ఓ వేదాంతి అన్నట్టు న్యూ వరల్డ్ ఆర్డర్ రాక తప్పదు. మీకూ తెలిసే ఉంటుంది. మన రాజకీయ నాయకులు, ఉన్నత పదవుల్లో ఉద్యోగాలు చేసిన వాళ్ళూ కలిసి విదేశాల్లో దాచుకున్న డబ్బు నలభై ఎనిమిదివేల కోట్లు. ఇది యాభై ఏళ్ళుగా మన ప్రభుత్వాలు విదేశాలనుంచి తీసుకున్న రుణంతో సమానం. ఇది వినడానికి దారుణంగా ఉన్నా పచ్చినిజం. ఈమాటే నేను అందరితో చెప్తాను"

"ముందుగా మన ప్రజలకు గుర్తు చేయవల్సింది, వారిలో దాగున్న మనోబలం గురించి"

"నిజమే"

"నేను నా పిల్లలకు అదే చెప్తూ ఉంటాను. బలహీనతల్ని ప్రేమించడం అలవాటు అయితే మనకు తెలియకుండానే అవి ఎదిగి మననుంచి ఆరాధనను, హారతులనూ కోరుకుంటాయని! నా మాటలు నా ఇంట్లో మనసా వాచా కర్మణా పాటించేది నా చిన్నకొడుకు బోసు, నా కూతురు ఝాన్సీయే ఝాన్సీ పెళ్ళయినా, భర్తచాటున ఉంటున్నా తన వ్యక్తిత్వాన్ని కాపాడుకుంటోందనే నా నమ్మకం. బోసుబాబు పెళ్ళి అయిన తర్వాత ఏం చేస్తాడో, ఎలా మారతాడో చూడవల్సిందే. నాకు ఈ సమాజం, ఈ దేశం గురించి, దాని అభ్యుదయం గురించి మాట్లాడాలంటే అదోలా ఉంటుంది. నా ఇల్లు చక్కబెట్టిననాడే నాకా అర్హత దొరుకుతుందనుకుంటాను"

"పోన్లెండి... మీ పెంపకంలో ఇంట్లో నీతిపరులూ, ఉత్తములూ తయారయ్యారూ అంటే ఆ లాభం వారిద్వారా మరికొంతమందికి అందకుండా పోదు" అని విజయప్రకాష్‌గారు తన వడిలో ఫైల్ తెరిచి నాలుగైదు కాగితాలు తిలక్‌గారి చేతుల్లో పెట్టి, "వచ్చే వారం మనం నిర్వహించే 'బ్రిడ్జ్' టి.వి. కార్యక్రమానికి తయారుచేసిన ప్రశ్నావళి ఇది. మీరు చూస్తారని తీసుకువచ్చాను. ఇది పూర్తిగా ఈనాటి విద్యార్థుల్నీ, వారి తల్లిదండ్రుల్నీ దృష్టిలో పెట్టుకుని తయారుచేసింది. చూడండి" అన్నాడు.

ఇంతలో జయమ్మగారు లోపలినుంచి రెండు కప్పుల్లో కాఫీ తెచ్చి ఇద్దరికీ చెరొకటీ అందించింది. విజయ్‌ప్రకాష్ జయమ్మగారికి చిన్నగా నమస్కారం చెప్పాడు. ఆవిడ విజయప్రకాష్‌గారి కుటుంబసభ్యుల గురించి అడిగి, నెమ్మదిగా

"తమ్ముడూ... మీ శిష్యురాలు ఝాన్సీకి నెల తప్పిందట... ఆ శుభవార్త నిన్ననే తెలిసింది" అంది.

"ఎవరు నా కుడి భుజానికా? " అంటూ నవ్వుతూ ప్రశ్నించాడు.

"ఈసారైనా దాని కడుపున కాసినవాడు నిలబడితేచాలు. నిన్నటినుంచీ నేనూ, వారూ రోజూ పూజలూ, వ్రతాలూ మొదలు పెట్టాం"

"మీరేం భయపడొద్దు. అన్నీ సవ్యంగా జరుగుతాయి. మనవడో, మనవరాలో పుడితే వాళ్ళ చలవ వల్ల మీ బోసుకు





ఉద్యోగం దొరుకుతుంది. పెళ్ళి కూడా కుదురుతుంది. చూస్తూ వుండండి అక్కయ్యగారూ..."

"వాడికా... పెళ్ళా? ! నా కళ్ళతో నేను చూస్తానని నమ్మకంలేదు. తమ్ముడూ... తండ్రిలా వాడూ ఈ దేశాన్ని ఉద్ధరించిన తర్వాతే పెళ్ళి చేసుకుంటాడట. ఈ దేశానికి స్వాతంత్ర్యం తేవడమంత తేలికకాదు పేరుకుపోయిన కుళ్ళునూ, అవినీతినీ తుడిచిపెట్టడం అంటే! కాళిదాసుగారి సంగతేమోగానీ మనవాళ్ళు కూర్చున్నకొమ్మని నరుక్కునేటంత తెలివి పరులవుతున్నారేమోనని నాకు భయంగా ఉంది"

"నువ్వు నిరాశావాదివి జయా" అన్నాడు తిలక్ నవ్వుతూ.

"వంటచేస్తూ ఆలోచించవల్సిన విషయం ఇది. వస్తాను, వస్తాను తమ్ముడూ" అంటూ జయమ్మ లోపలికి వెళ్ళిపోయింది నవ్వుకుంటూ.

విజయప్రకాష్ తన చేతుల్లో ఫైలు మూసి, ఓసారి తిలక్‌గారివైపు చూసి "మా పెద్దన్నయ్య తోడల్లుడు విశ్వనాథం మీకు తెలుసుకదా? " అని అడిగాడు.

"అంటే డిఫెన్స్ లాబ్స్‌లో పనిచేసి ఉద్యోగానికి రాజీనామా చేశాడని విన్నాను. అతనేకదూ? "

"ఉద్యోగానికి తనుగా రిజైన్ చేయలేదు. సస్పెండ్ అయ్యాడు అంతే. ప్రభుత్వం అత్యద్భుతంగా, అవలీలగా లంచాలు పట్టినవాళ్ళను నెత్తికెక్కించుకుని బిరుదులు ఇవ్వబోతుంది అని అపోహలో పడ్డాడో ఏమో. తెగ గడించాడు. ఎంక్వయిరీలు ఎదుర్కొన్నాడు. వాటినీ అధిగమించాడు. యం.పీ.లనూ, మంత్రులనూ పట్టి ఉద్యోగాన్ని పదిలపర్చుకున్నాడు. ప్రమోషన్స్ కూడా కొట్టేశాడు."

"నాకు ఇవన్నీ తెలియవు"

"తిలక్‌గారూ... నాకు తెల్సింది మీకు చెబుతున్నాను. ఈ విశ్వనాథం మహాశయుడు మీ అల్లుడు సత్యమూర్తికి, గైడ్, గురువూ, ఫిలాసఫర్ అని నేను విన్నాను. ఇందులో నిజమెంత వుందనికాదు. ఒకవేళ నిజమే అయితే అతను ఇరుకున పడితే..." విజయప్రకాష్ మాటలు ఆపేశాడు. తిలక్‌గారు తల వంచుకున్నాడు.

"మీ వియ్యంకుడు గాంధీగారికి ఇవన్నీ తెలుసో లేదో? "

"విజయ్‌ప్రకాష్ నాకు నీ దగ్గర దాచవల్సిందేంలేదు. ఆమధ్య ఝాన్సీ ఉత్తరం రాస్తూ సూచాయిగా సత్యమూర్తి గురించి రాసింది. ఉత్తరం చదివితే అందులో ఝాన్సీ మనసు ప్రతిఫలించినట్టుగానే అన్పించింది. మనలో బలహీనతలు దగ్గరగా ఉండి చూసేవాళ్ళకు బాగా తెలుస్తాయి. తర్వాత అది 'తోటకూరనాడైనా చెప్పలేకపోయామే' అన్న సామెతగా అవుతుంది. దానికి నాకు తోచిన సలహాలు రాశాను అందుకే..."

సరిగ్గా అప్పుడే బయటినుంచి బోసుబాబు వచ్చి తండ్రినీ విజయప్రకాష్‌గారినీ చూశాడు.

"నమస్తే అంకుల్" అంటూ పక్కనే కూర్చున్నాడు.

"ఇంతసేపూ ఎక్కడికి వెళ్ళావురా" తిలక్‌గారు కొడుకువైపు చూస్తూ అడిగాడు. బోసు జేబులో చెయ్యిపెట్టి ఓ కవరు బయటకు తీసి,

"నేను ఇన్ఫోసిస్‌లో మార్కెటింగ్ ఎగ్జిక్యూటివ్‌గా సెలక్ట్ అయ్యాను నాన్నగారూ. ఇవిగో పోస్టింగ్ ఆర్డర్స్... నాకు హైదరాబాద్‌లోనే పోస్టింగ్ ఆర్డర్స్ వచ్చాయి" అంటూ దాన్ని తండ్రి చేతికి ఇచ్చాడు.

"కంగ్రాట్యులేషన్స్" అన్నారు విజయప్రకాష్.

తిలక్‌గారు లెటర్ చదివి, దాన్ని విజయప్రకాష్‌గారికి అందించి లోపలికి చూసి 'జయా' అని పిలిచి కొడుక్కి ఉద్యోగం వచ్చిన సంగతి చెప్పాడు. విజయప్రకాష్‌గారు అది చదివి, "బావుంది" అని ఏదో

గుర్తుకొచ్చినవాడిలా "బోసూ, ఈ కంపెనీలోనే మా అన్నయ్య కూతురు రాణీ పనిచేస్తోంది" అన్నాడు.

"అలానాండీ..." అన్నాడు ఆశ్చర్యంగా బోసు.

"ఒరేయ్ బజారునుంచి వట్టిచేతుల్తో వచ్చావా? స్వీటు తీసుకురావల్సింది. అంకుల్ నోరు తీపి చేసేవాడివికదా..."

"ఎంతసేపమ్మా... ఇప్పుడే వెళ్ళి తీసుకువస్తాను" అంటూ బోసుబాబు కుర్చీలోంచి లేచాడు. "ఎలాగూ రేపు మనం కలుస్తాం కదా బోసూ. అప్పుడే నోరు తీపి చేద్దువుగాని" అన్నాడు విజయప్రకాష్.

"అయితే నువ్వు చేస్తున్న టెంపరరీ ఉద్యోగానికి రిజైన్ చేయాలి. నువ్వీ వారంలో ఓ కొత్త జాబ్‌లో జాయిన్ అవ్వాలి. అవునా?"

బోసుబాబు తల ఊపాడు.

"అయితే అక్కయ్యగారూ... మీరూ, బావగారూ కూడా ఇక్కడనుంచి కాపురం ఎత్తేసి హైదరాబాద్ వెళ్ళిపోతారన్నమాట"

"మీరందరూ ఏది మంచిదంటే అదే చేస్తాను. నాదేం వుంది?"

"ఈ ఊరునుంచి కాపురం ఎత్తడం అంటే మాటలతో అవుతుందా? వీడు ఎలానూ స్నేహితులతో వుంటున్నాడు. కొంతకాలం అలానే కాలక్షేపం చేస్తే బావుంటుందేమో"

"అవును... మన చైతన్య కూడా అక్కడే వుంటున్నాడుకదా" అన్నాడు విజయప్రకాశ్ గారు.

"అవును... అంకుల్. వాడూ నేనూ మంచి స్నేహితులం"

"అతను ఎ.సి.బి.లో ఇన్‌స్పెక్టర్‌గా పనిచేస్తున్నాడుకదూ?"

"అవును"

"అదికాదండీ... వీడు హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తూ, ఝాన్సీ వాళ్ళింట్లో వుండకుండా వేరే వుంటే అది బాధపడ్తుంది. అల్లుణ్ణి నొప్పించినట్టు అవుతుందేమో..."

"మనవాడు చిన్నపిల్లవాడు కాదుగా అక్క ఇంట్లో వుండడానికి" అంటూ తిలక్‌గారు చిన్నగా నవ్వారు.

విజయప్రకాశ్‌గారు ఓసారి తన చేతినున్న వాచీ చూసుకుని "నేను వెళతాను తిలక్‌గారూ... వెళతాను అక్కయ్యగారూ..." అంటూ కుర్చీలోంచి లేచాడు. తిలక్‌గారు కొడుకు బోస్‌వైపు చూసి, "బోసూ! అంకుల్‌ని నీ స్కూటర్‌మీద వాళ్ళింటిదగ్గర దిగబెట్టరా" అన్నాడు.

"నేను మా ప్రెస్‌కు వెళ్ళాల్సిన పనివుంది. ఇక్కడికి దగ్గరేగా నడిచి వెడతాను" అన్నాడు విజయప్రకాష్.

బోసు ఏదో గుర్తుకు తెచ్చుకుని, "నాకూ మన ప్రెస్‌లో పనుంది అంకుల్. మీరు వారంక్రితం నాకు అప్పగించిన పని అలానే వదిలేశాను. అది పూర్తి అయ్యిందో లేదో చూడాలి. పదండి మీతోపాటు నేనూ వస్తాను" అన్నాడు.

ఇద్దరూ బయటకు వెళ్ళి బందరు రోడ్‌ని క్రాస్ చేసి, ఏ.ఐ.ఆర్. పక్కరోడ్ వెంబడి సూర్యారావుపేటకు బయలుదేరారు. విజయప్రకాష్‌గారు ఒకసారి బోసును చూసి, "నువ్వు హైదరాబాద్ వాసివి కాబోతున్నావంటే, నీమీదో బాధ్యత పెట్టాలనిపిస్తోంది బోసూ" అన్నారు నెమ్మదిగా.

"చెప్పండి అంకుల్. మన జనహిత గురించి మీరేం చేయమన్నా చేస్తాను. ఉద్యోగం దారి ఉద్యోగానిది, ఉద్యమం దారి ఉద్యమానిది"

"నిజమే నీ సంగతీ, మన చైతన్య సంగతీ నాకు తెలుసు. మీలాంటి చాకుల్లాంటి యువకులు మేమున్నామంటూ ముందుకు రాగలిగినప్పుడే జనాన్ని నిద్రనుంచి మేల్కొల్పడం సులభం అనీ నాకు తెలుసు. కానీ నేను చెప్పేది వేరే విషయం. నువ్వు ఏమీ అనుకోకూడదు"

"ఏమీ అనుకోను అంకుల్... చెప్పండి"

"అదే... ఆ ఇన్ఫోసిస్‌లోనే మా అన్నయ్య కూతురు రాణి పనిచేస్తోందని చెప్పానుగా.





అది బాగా చదువుకుంది. తెలివైంది. ఐదారేళ్లుగా ఉద్యోగం పేర హైదరాబాద్‌లో వుంటోంది"

బోసు మాట్లాడలేదు.

"అది అక్కడ ఒక్కత్తీ వుంటోంది. అదే మా అన్నయ్యకు, వదినకూ, ఇంట్లోవాళ్ళ బాధలకు కారణమయ్యింది. నేను అన్నయ్యకి ఎన్నోసార్లు చెప్పాను"

"అంటే ఆవిడ అవివాహితా అంకుల్?"

"కాదు... పెళ్ళయ్యింది"

"మరి...?"

"పెళ్ళయి కూడా ఐదేళ్ళయ్యింది. కానీ పెళ్ళి అయిన ఏడాదికే భార్యాభర్తల మధ్య అపోహలు వచ్చాయి. అన్నయ్యా, నేనూ, వదినా ఆ భార్యాభర్తలకు సర్ది చెబుదాం అనుకున్నాం. ప్రయత్నించాం. ఓడిపోయాం"

"అరే..."

"ఇద్దరిదీ చెరోదారీ అయ్యింది. నేను రాణీతో మాట్లాడాను. మా ఇద్దరిమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలూ నడిచాయి. కానీ ఎక్కడవేసిన గొంగళి అక్కడే వుందన్న సామెత అయ్యింది" అంటూ విజయప్రకాష్ గారు తన ధోరణిలో తను చెప్పసాగాడు. బోసు ఆయన చెప్పినదంతా వింటున్నాడు. అయితే. అప్పటికే ప్రెస్‌కు దగ్గరవడంతో విజయప్రకాష్‌గారు మాటలు ఆపి, "అన్నీ వివరంగా చెప్తాను. నువ్వు వీలు చూసుకుని మా రాణిని కలవాలి, సరేనా"

"తప్పకుండా సార్... మీరు చెప్పినట్టు చేస్తాను. మనవాళ్ళన్నవాళ్ళ మనసుల్లో ఆనందం నింపడానికి అవకాశం వస్తే, అందుకు వెనకడుగు వేయకూడదనేది నా అభిమతం..." అన్నాడు బోసు తల వంచుకుని.

ఇద్దరూ ప్రెస్‌లోకి అడుగుపెట్టారు.

★ ★ ★

సత్యమూర్తి ఒంటరిగా ఉన్నప్పుడు అతనికి, రెండుమూడు సంవత్సరాలుగా తన జీవితం, అది తీసుకున్న మలుపులు గుర్తుకు వస్తాయి! ఆ వెంటనే రాణీ, ఆమెతో పరిచయం, ఆ పరిచయం ఒకరికి ఒకరిని దగ్గర చేయడం, ఆ సంఘటనలూ కూడా కళ్లల్లో మెదుల్తాయి! ఆరోజుల్లో సత్యమూర్తి స్టేట్ ఎలక్ట్రిసిటీ బోర్డ్‌లో జూనియర్ ఇంజనీర్‌గా ఉండేవాడు. తన పైఅధికారి రామనాథంగారిని కలవడానికి వెడితే ఆయనకు పి.ఏ గా ఉన్న రాణీ ఎవరో తెలిసింది. ఆమె గురించి అనుకోకుండానే ఆలోచించేవాడు. అలా తన ఆలోచనల్లో చాలా భాగం ఆమె ఆక్రమిస్తుంటే అతనికి ఆశ్చర్యం, ఆనందం రెండూ కల్గేవి. చదువుకున్న, పైగా అందంగా ఉండే రాణి అతనికి ఆత్మీయురాలిగానూ కన్పించేది.

అయితే ఓ సమయంలో సత్యమూర్తికి కొలీగ్స్ ద్వారా రాణి గురించిన కొత్త విషయాలు చెవిన పడ్డాయి. ఆమె భర్తతో వేరుపడిందనీ, వేరేగా ఒక్కత్తీ ఒంటరిగా జీవిస్తోందనే గుసగుసలూ విన్నాడు. కానీ మొదట్లో అతను రాణీ గురించి ఎవరేం చెప్పినా నమ్మేవాడు కాదు. కానీ ఓరోజు రామనాథంగారు సత్యమూర్తిని తన ఛాంబర్‌కు పిలిచి కూర్చోపెట్టి నెమ్మదిగా రాణి గురించి చెప్పాడు.

"ఇదంతా ఆమె దురదృష్టం అయ్యుంటుంది. చదువుకుంది. బుద్ధిమంతురాలు. కానీ ఏం లాభం. ఆమె మొగుడుగాడు పరమ అనుమానం మనిషిట. నిత్యం వేధిస్తాట్ట. పుట్టింటినుంచి ఇంకాఇంకా డబ్బు తెమ్మంటాడుట. పైగా ఈమె తన తల్లిదండ్రులకు తన జీతంనుంచి డబ్బు పంపి ఆదుకుంటోందని నసుగుతాట్ట. పాపం, ఆ అమ్మాయి యివన్నీ నాతో చెప్పి బాధపడింది. కన్నీళ్ళు పెట్టుకుంది"

"అయ్యో..."

"వారం నాడు గొడవపెట్టి రాణీని ఇంట్లోంచి వెళ్ళిపొమ్మనాట్ట. పైగా నన్నూ ఆమెను జత కలిపి కారు కూతలు కూశాట్ట"

"ఎవడండీ, ఆ ప్రబుద్ధుడు. ఎక్కడ పనిచేస్తాడు? "

"ఎవడో వెధవ. వాడి సంగతి వదిలేయ్" అని రామనాథంగారు ఓ క్షణం ఆగి, "చూడు సత్యమూర్తీ- నేను వర్కింగ్ ఉమెన్స్‌హాస్టల్ అథారిటీస్‌తో మాట్లాడాను. బహుశా ఓ నెలలో ఆమె అక్కడికి షిఫ్ట్ అవుతుంది. అంతవరకూ ఆమెను నేను ఎరుగున్నవాళ్ళ ఇంటిలో వుండమన్నాను. నీకు ఏమీ అభ్యంతరం లేకపోతే ఆమెను కాస్త కనిపెట్టుకుని ఉండు. ఆమె పరిస్థితులు తెలిసి జాలిపడేవాళ్ళకంటే హేళన చేసేవాళ్ళే ఎక్కువగా ఉంటారు. జాగ్రత్త. ఆమెను ఎవరూ ఏమీ అనకుండా చూడు" అన్నాడు.

సత్యమూర్తి తల ఊపి బయటకు వచ్చాడు. మేనేజర్ గదిని ఆనుకుని ఉన్న చిన్న ఛాంబర్‌లో రాణీ కూర్చుని ఉంది. సత్యమూర్తి కాసేపు ఆలోచించి, "ఈ పేపర్స్ టైపుచేసి పెట్టాలి. ఇవి నా పెర్సనల్ పేపర్స్. వీటిని ఎవరికీ యివ్వద్దు. నేనే వచ్చి తీసుకుంటాను"

"అలానే"

సరిగ్గా అప్పుడే ఆఫీసుబాయ్ టీలు తెచ్చి రాణీకి సత్యమూర్తికీ ఇచ్చాడు. సత్యమూర్తి టీ తాగుతూ, "మీరు ఎక్కడ ఉంటున్నారు? " అని చటుక్కున అడిగాడు.

రాణీ కాస్తంత తటపటాయించి "అంటే? " అంది. అంతకుమించి మాట్లాడలేదు.

"నేను నారాయణగూడాలో మా స్నేహితుల ఇంట్లో పేయింగ్ గెస్ట్‌గా ఉంటున్నాను. నిన్న సాయంకాలం మీరు దీపక్ మహల్ ముందునుంచి నడిచి వెడుతూంటే చూశాను. అందుకని అడిగాను"

"ప్రివెంటివ్ మెడిసన్స్ ఆఫీసుకి ఇవతల" అంది రాణి.

"అయితే మనం బస్‌లో ఒకే రూట్‌లో ప్రయాణం చేస్తామన్నమాట"

"కావచ్చు"

"ఉంటాను. మళ్ళీ కలుస్తాను. థాంక్స్ ఫర్ ఆఫరింగ్-టీ" అని సత్యమూర్తి చిన్నగా నవ్వాడు.

"నో మెన్షన్" అంది.

అప్పుడే రామనాథంగారు లోపలినుంచి బజ్జర్ ద్వారా రాణీని డిక్టేషన్‌కు పిలిచారు. రాణి డిక్టేషన్ తీసుకుందుకు నోట్ బుక్ చేతిలోకి తీసుకుంది. చేతి వాచీ చూసుకుంది. నాలుగు గంటలు దాటింది.

అప్పటికే చాలామంది ఉద్యోగస్థులు సీట్లు ఖాళీచేసి బయటకు వెళ్ళిపోయారు. సత్యమూర్తి తన చేతి వాచీ చూసుకున్నాడు. ఐదున్నర అయ్యింది. సీటులోంచి లేచి మేనేజర్ గదివైపు బయలుదేరాడు. ఆయన గది థర్డ్‌ఫ్లోర్‌లో ఉంది.

సత్యమూర్తి లిఫ్ట్ దగ్గరకు వెళ్ళాడు.

"కరెంట్ పోయింది సార్" అన్నాడు లిఫ్ట్ బాయ్. సత్యమూర్తి మెట్లువైపు దారితీశాడు. పైకి వెళ్ళడానికి పదినిముషాలు పట్టింది. అతను పి.ఎ చాంబర్‌లోకి వెళ్లాడు. రాణీ సీటువైపు చూశాడు. రాణీ తన సీటులోనే ఉంది. కానీ ఆమె కళ్ళు ఉబ్బి కన్పిస్తున్నాయి. నెమ్మదిగా స్వింగ్ డోర్ మీద చేయి వేశాడు. అంతలోనే కంగారుగా రామనాథంగారు తన ఛాంబర్‌లోంచి వచ్చి బయటకు వెళ్ళిపోయాడు.

"నేను... నా కాగితాలకోసం వచ్చాను. అవి రెడీ అయ్యాయా? " అంటూ రాణీ గదిలోకి వెళ్ళాడు. రాణీ తలవంచుకుని ఏమీ తెలియనట్టు కళ్లు తుడుచుకుని నిశ్శబ్దంగానే టైపుచేసిన కాగితాలు సత్యమూర్తికి అందించింది.

"మీరీపాటికి ఇంటికి వెళ్ళిపోయి ఉంటారనుకున్నాను"

"ఆ మహానుభావుడు డిక్టేషన్ మీద డిక్టేషన్ ఇచ్చాడు"

"థాంక్స్ నేను వెడతాను"

"చూడండి... ఈరోజు నాతో మా ఇంటివరకూ తోడుగా వస్తారా? "

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూలై చతుర నవల **పతనం**..............................

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

"అలానే"

"ఏమీ అనుకోవద్దు... నాకెందుకో భయంగా ఉంది"

"దేనికి భయం... లేవండి వెడదాం" అని సత్యమూర్తి రాణీవైపు తేరిపారి చూసి "మీరేమిటి దిగులుగా ఉన్నారు. సార్ ఏమన్నా దూంధాములు చేశాడా? "

"తిట్టలేదు. ఏం చెప్పమంటారు. పదండి వెడదాం" అని రాణీ తన హేండ్‌బేగ్ తీసుకుంది. ఇద్దరూ ఎలక్ట్రిసిటీ బోర్డ్ గేటు దాటి బయటకు అడుగులు వేసి, విశ్వేశ్వరయ్య స్టాట్యూ దాటి బస్‌స్టాప్‌కు చేరుకున్నారు. అరగంట తర్వాత నారాయణగూడా తాజ్ యివతల దిగారు. నెమ్మదిగా నడక సాగించారు.

★ ★ ★

సత్యమూర్తి నారాయణగూడా క్రాస్‌రోడ్స్ దాటి ఎడంచేతివైపు నడుస్తూ ఒక్కొక్క ఇంటినెంబరూ చూసుకుంటూ నడక సాగించాడు. పదినిముషాల తర్వాత ఓ చిన్న పాటి సందులో, లోపలికి ఉన్న మరో చిన్న ఇంట్లో రాణీ కన్పించింది.

"నేను సత్యమూర్తిని. లోపలికి రావచ్చునాండీ" అన్నాడు బయట నుంచే.

రాణీ దగ్గరగా వేసివున్న తలుపు తెరిచి, "మీరా" అంటూ ఆశ్చర్యపోయింది.

"అవును. మీరు రెండురోజులుగా ఆఫీసుకు రాకపోతే నన్ను విషయం తెల్సుకుని రమ్మనమని రామనాథంగారు పంపించారు"

"లోపలికి రండి" అంటూ అక్కడే ఉన్న చాప పరిచి, "కూర్చోండి" అంది.

"వంట్లో బాగుండలేదా? "

"బాగానేవుంది. ఊరునుంచి మా నాన్నగారూ చిన్నాన్నా వచ్చారు. వాళ్ళతో సరిపోయింది. గంటక్రితమే వాళ్ళు వెళ్లారు"

"అంతే కదా. రామనాథంగారు అయితే ఒకటే కిందా మీదా అయ్యాడు. నాకు కొద్దిగా షార్ట్‌హాండ్ వచ్చు దాంతో నా పని పట్టాడు"

"మీరు జూనియర్ ఇంజినీర్ కదా. ఆయనకు మీరు తప్ప మరో స్టెనోనే దొరకలేదా? "

"ఆయనకు నేనంటే అభిమానం"

"అభిమానమా... నా బొంద. ఒట్టి అవకాశవాది. పైకి సాధుజంతువులా కన్పిస్తాడు. గోముఖ వ్యాఘ్రంగాడు"

"అదేమిటీ? "

"ఏంలేదు? "

"చెప్పండి"

"మీరు ఆడవాళ్లయి ఉండి... అందునా వయసులో ఉన్న ఆడపిల్ల లయివుంటే ఆయనెవరో తెలిసేది"

"అలానా నాకు తెలియదే? "

"నాకూ తెలియదు. ఒక నెలగా ఈ కథ మొదలుపెట్టాడు. తప్పంతా నాదే. తండ్రిలాంటివాడు కదా అని ఆయనముందు వాపోయాను. లోకువ కట్టాడు. నాకు ఎవరూ లేరని తెలిసి ఈ ఇల్లు యిప్పించాడు. అందుకే రుణం తీర్చుకోవాలిట. లాయల్‌గా ఉండాలిట. ఇండైరెక్ట్‌గా హెరాస్మెంట్ చేస్తున్నాడు"

"పోనీ మీకు మహిళా కమిషన్ సభ్యులెవరైనా తెలిసి ఉంటే వాళ్లను కలవండి. ఆయనకు వాళ్ళే బుద్ధిచెబుతారు"

"ముందుగా ఈయనమీద నేను కంప్లయింట్ యివ్వవల్సివుంటుంది. కేసు మాట అటుంచి ఈ విషయం మొత్తం మన ఎలక్ట్రిసిటీ బోర్డ్‌లో అందరికీ తెలుస్తుంది. న్యాయం జరగడం మాట అటుంచండి. వెనకనుంచి మీదపడే రాళ్ళసంఖ్య, వెక్కిరింపుల సంఖ్య పెరుగుతుంది"

"అయితే అందుకా ఆఫీసుకు రావడం మానివేశారు"

రాణి తల వంచుకుంది.

"పోనీ మరోచోట ఉద్యోగానికి ప్రయత్నిస్తే బావుంటుందేమో"

"అదే ఆలోచిస్తున్నాను"

"రామనాథంగారు చెప్పాడు. మీరు బాగా



క్వాలిఫైడ్ అని. కంప్యూటర్ కోర్స్ చేశారని. మీకు అభ్యంతరం లేకపోతే ఇన్‌ఫోసిస్‌కు ఓ అప్లికేషన్ పడెయ్యండి. అక్కడ నాకో స్నేహితుడు ఉన్నాడు. చెప్పి చూస్తాను"

"అలానే"

"నేనూ డి.ఆర్.డి.ఎల్‌కు అప్లయ్ చేస్తున్నాను. రెండేళ్ళుగా ఇక్కడ పనిచేశాను. కానీ ఇక్కడ ప్రమోషన్స్‌కు అవకాశాలు తక్కువ. నేను వెళ్ళేలోపునే మీకు చేతనయిన సహాయం చేస్తాను. సరేనా"?

రాణి తల ఊపింది.

"మరి నేను వెడతాను. చీకటిపడుతోంది. మీరూ వంటా గట్రా చేసుకోవాలి"

"గట్రా ఏం లేదు. వంట ఒక్కటే చేసుకోవాలి" అంటూ రాణి గలగలా నవ్వేసింది. సత్యమూర్తి రాణివైపు చూశాడు. ఆ నవ్వు ఎందుకో అతన్ని కాసేపు కిందామీదా చేసింది.

రాణీ తన పెట్టె తెరిచి, ఓ చిన్న ఫైలులోంచి కాగితాలు తీసి "ఇదిగోనండీ నా అప్లికేషన్ ఫారం చూడండి. మీరు ఓ.కే. చేస్తే రేపే దీన్ని ఇన్‌ఫోసిస్‌కు పంపిస్తాను" అంటూ పిన్‌చేసిన కాగితాలు సత్యమూర్తి చేతికి ఇచ్చింది. సత్యమూర్తి ఆ కాగితాలు చదివి,

"అమ్మో... యూ ఆర్ వెల్ క్వాలిఫైడ్... ఇంకేం" అనేశాడు.

"ఏం అర్హతలో లెండి. జీవితం వేరూ, మనకుండే అర్హతలు వేరూ అని ఇప్పుడిప్పుడే తెలిసివస్తోంది"

"బాధపడకండి... ప్లీజ్"

"కొందరు బాధపడ్డానికే పుడతారు"

"బాధపడ్డవారికే ముందుముందు అమితమైన సుఖాలూ ఆనందాలూ తాముగా వచ్చి ఆహ్వానం పలుకుతాయని ఎక్కడో ఎవరో అనగా విన్నాను"

"చూద్దాం... ఏమవుతుందో... అంత అదృష్టం నాకు దక్కుతుందా? "





"దక్కిన తర్వాత చూడండి. అప్పుడు మిమ్మల్ని పట్టేవాళ్ళు ఉండరు"

రాణి చిన్నగా, అందంగా నవ్వింది. అలా నవ్వుతూనే ఎడంచేత్తో తల రాసుకుంది. గుండెల్లోకి చూసుకుని పమిట సరిచేసుకుంది. చేతులు కలుపుకుంది. సరిగ్గా అప్పుడే ఓ పెద్దాయనా మరో పెద్దావిడా గుమ్మందాకా వచ్చారు. ఓసారి లోపలికి తొంగిచూసిన పెద్దావిడ "అమ్మాయి... లోపల ఉన్నావా" అంటూ కేకవేసింది.

"ఉన్నాను పిన్నిగారూ"

"సరే నేను చెప్పేది విను. అనుకోకుండా నిజామాబాద్‌నుంచి, వరంగల్‌నుంచీ మా ఇంటికి చుట్టాలు వస్తున్నారు. నువ్వు రెండు రోజుల్లో వేరే ఇల్లు చూసుకో"

"అదేమిటండీ... ఇంత అర్జెంటుగా నాకు ఇల్లు ఎక్కడ దొరుకుతుంది"

"అదేమో నాకు తెలియదు. నువ్వీ వాటా ఖాళీ చేయవల్సిందే"

"అది కాదు రామనాథంగారు..."

"ఆయన సంగతి అనవసరం రాణీ"

అప్పుడే లోపలినుంచి సత్యమూర్తి బయటకు వచ్చాడు. ఇంటావిడ సత్యమూర్తివైపు కొరకొరా చూసి, "ఈ అబ్బాయి ఎవరు... నీ మొగుడా తల్లీ" అంటూ ప్రశ్నించింది. రాణీకి ఏమనాలో తెలియలేదు.

"కాదు..." రాణీ ఏదో చెప్పబోయింది.

"అవునులే... నేను మర్చిపోయాను. నీ గురించి రామనాథం చెప్పాడు"

పెద్దాయన ఓ అడుగు ముందుకువేసి, "నువ్వు" అని ఆగిపోయాడు సత్యమూర్తిని చూసి.

"ఈమెగారూ నేనూ ఎలక్ట్రిసిటీ బోర్డ్‌లో పనిచేస్తాం... మేం కోలీగ్స్"

"చూడు బాబూ! మీ సంబంధాల గురించి నాకు అనవసరం"

"నేను వెడతాను రాణీగారూ..." అన్నాడు సత్యమూర్తి ఓ అడుగువేసి.

"అతగాడితో బయటకు వెళ్లాలనుకుంటే వెళ్లమ్మా... మొహమాటం దేనికీ? కానీ ఇల్లు

మాత్రం ఖాళీ చేయి... చాలు"

"ఉండండి... నేను వస్తాను" అని రాణి గదికి తాళంవేసి సత్యమూర్తితో అడుగులు వేసింది. ఇద్దరూ మెయిన్‌రోడ్ ఎక్కారు.

"బహుశా ఈ పని ఆ రామనాథంగారు చేసి ఉంటారు. నాకు తెలుసు"

"ఇప్పుడు ఎలా? "

"మీకు ఎవరైనా తెలిసుంటే ముందు నాకో గది చూసిపెట్టండి"

"అలానే"

"మీ ఇంట్లో ఎవరెవరు ఉంటారు? మీది పెద్దిల్లా? "

"చెప్పాను కదండీ... నేను పేయింగ్ గెస్ట్‌గా ఉంటున్నానని"

"అవును... అవును.."అని మళ్లీ

"మీరు వివాహితులా బ్రహ్మాచారులా? "అని అడిగింది

"బ్రహ్మాచారిని" అనేశాడు చటుక్కున, సత్య మూర్తి.

"అలానా? "

"మీరు ఎలానూ వంట చేసుకోలేరు... మనం తాజ్‌లో భోంచేద్దాం. ఏమంటారు... అక్కడ అన్నం తింటూ ఏం చేస్తే బావుం టుందో ఆలోచిద్దాం"

"సరే" అంది రాణి.



సత్యమూర్తి రాణీతో తనకు పెళ్ళికాలేదని ఎందుకు చెప్పాడో నిజానికి అతనికే తెలి యదు! మనిషికి ఒక్కొక్క పరిస్థితిలో తన మాట మీదా చేతమీదా పట్టుకోల్పోవడం జరుగుతుందేమో. పైగా సత్యమూర్తి ఏ బాదరబందీ లేనిమనిషి. బాగా చదువుకు న్నాడు. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. దానికి తోడు పై అధికారి విశ్వనాథం స్నేహంతో అతనికి డిపార్ట్‌మెంట్‌లో పరిచ యాలు పెరిగాయి. ఆపరేషన్ విభాగంలో పని చేస్తూన్న మూలంగా ఊళ్లల్లో డబ్బున్న వాళ్ళ అండదండలూ దొరికాయి. వద్దు అన్నా ఆశ్చర్యంగా రెండు చేతులా డబ్బు ఆడడమూ మొదలయ్యింది. అది నెమ్మదిగా వందలనుంచి వేల రూపాయలకు చేరు కుంది. దానికి తోడు రాణీ పరిచయం అయ్యేనాటికి అతని భార్య ఝాన్సీ పుట్టిం టికి వెళ్ళింది. అనుకోకుండా ఆమెకు ఎబా ర్షన్ కూడా అవడంతో సత్యమూర్తికి రాత్రుళ్లు తోచేది కాదు. విశ్వనాథంగారు పార్టీలకు పిలిచేవాడు. ఆయన పనిలో మెళు కువలతోపాటు లోకంలో అందుబాటులో ఉండే అన్ని సుఖాల గురించి కొత్త నీతి పాఠాలు వినిపించేవాడు.

ఓరోజు సత్యమూర్తి తన గురించీ, రాణీ గురించీ చెప్పాడు.

"ఆ అమ్మాయికి భర్తలేదని అంటున్నావ్. రూపసి కూడా అంటున్నావ్. అవునా? "

"అవును"

"నువ్వు ఆమె బరువు బాధ్యతలు కొంతవ రకూ తీసుకున్నావుగా. కానీయ్ ఏమవు తుంది? ఏమీకాదులే"

"ఎవర్కికైనా తెలిస్తే? "

"ఎవరికి తెలిసినా ఫర్వాలేదు. కానీ నీ భార్యకు, నీ అత్తవారింటి వారికీ తెలియ కుండా ఉంటే చాలు"

"ఆమెకు ఇల్లూ వాకిలీ లేదు. ముందు ఆమెకు ఓ ఇల్లు కావాలి సార్"

"నా ఎరుకలో ఓ ఇల్లు అమ్మకానికి

ఉంది. అది నువ్వు కొనుక్కో. ప్రస్తుతానికి ఆ అమ్మాయిని ఆ ఇంట్లో ఉంచు"

"మన రామనాథంసార్ గురించి చెప్పాను కదా సార్. ఆయన నా వెనక నుంచి వెన్ను పోటు పొడిస్తే"

"వాడిమొహం... అయినా నువ్వు డి.ఆ ర్.డి.ఎల్‌లో ఎలానూ సెలెక్ట్ అవుతావు. ఈ డిపార్ట్‌మెంట్ వదిలేస్తావు. ఆ అమ్మా యికి ఎలానూ కొత్త ఉద్యోగం దొరుకుతుం దంటున్నావ్. ఇంకేం. కోటలో పాగా వేయడం ఒకటే తరువాయి"

"సరే సార్"

"ఓ పెగ్ వేస్తావా? "

"వద్దు సార్... నేను రాణీ ఇంటికి వెళ్లాలి. తాగానని తెలిస్తే ఆమె మరోలా భావించవచ్చు"

"అవును... అవును... ఇప్పుడు నువ్వు శ్రీరామచంద్రుడివి. ఇక శివధనుస్సు విర వడం ఒకటే తరువాయి ఉంది"

"నేను వెళతాను"

"కొత్తగా టూ వీలర్ కొన్నావుగా... దాని మీద వెళ్లు. రోజులు బావుంటే త్వరలోనే కారు కొందువుగానీ"

"అంతా మీదయ సార్"

విశ్వనాథంగారు నవ్వేశాడు. ఆయన చేతిలో గ్లాసు కొద్దిగా వణికింది. సత్యమూర్తి అప్పటికే బార్‌నుంచి బయటపడి స్కూటర్ ఎక్కి రాణీ వుండే ముషీరాబాద్ బయలుదే రాడు. దారిలో ఎవరికో ఫోన్ చేశాడు. అవ తలినుంచి స్నేహితుడు సత్యమూర్తికి ఏం చెప్పాడో తెలియదు గానీ సత్యమూర్తి థాంక్స్ చెప్పి తిరిగి వెహికల్ ఎక్కాడు. ఓసారి చేతి వాచీ చూసుకున్నాడు. పదిని ముషాల్లో ముషిరాబాద్ వెళ్ళి గోరక్‌పూర్‌లో ఉన్న రాణీ ఇంటిముందు ఆగాడు. తలుపు తట్టాడు. రాణీ తలుపు తెరిచింది.

"శుభవార్త-మీరు ఇన్‌ఫోసిస్‌లో పి.ఏ టు జనరల్ మేనేజర్‌గా సెలెక్ట్ అయ్యారు. కంగ్రాట్యులేషన్స్" అన్నాడు.

"ఓ" అనేసింది. ఆపైన, "థాంక్యూ సత్య మూర్తిగారూ. మీరు చేసిన ఉపకారం ఈ జన్మలో మర్చిపోలేను. నా చర్మం చెప్పులు కుట్టించి ఇచ్చినా మీ రుణం తీరదు" అంది రాణీ... అప్పుడు ఆనందంతో ఆమె కళ్ళు చెమర్చాయి. కానీ ఆమె ఆ విషయం మర్చి పోయి మాట్లాడుతూనే ఉంది.

"ఇందులో నేను చేసింది తక్కువ. మీకున్న అర్హతలే మీకు ఈ ఉద్యోగాన్ని సంపాదించి యిచ్చాయి"

"మీరు కాబట్టి ఈ మాట అన్నారు"

"అది సరే... మీరు నాకు పార్టీ యివ్వాలి"

"అదేమో నాకు తెలియదుగానీ వేడివేడిగా అన్నం పెడతాను. కొత్త ఆవకాయ. పప్పూ మామిడికాయ. ఒడియాలు. గడ్డపెరుగు"

"ఇంకా...? "

"ఇంకానా... బయట పాన్‌షాప్‌లోంచి ఓ రామ్‌ప్యారీ కొనితెస్తాను. వేసుకుందురు"

"ఇంకా? "

"ఇంకానా"

"సెకెండ్ షో సినిమాకు వెడదాం... సరేనా? " సత్యమూర్తి గోముగా అన్నాడు.

రాణి ఒక్కసారిగా కళ్లెత్తి సత్యమూర్తివైపు చూసింది. పొడవరిగా ఉన్న, బలిష్టంగా ఉన్న... నవ్వుతూంటే కుడిబుగ్గలో సొట్ట పడి, అది చుట్టూతా కొత్తగా ప్రకాశింపజేసే వదనం ఉన్న, గుబురు మీసాలు కలిగిన సత్యమూర్తి అప్పుడు ఆమెకు కొంగ్రొత్తగా కన్పించాడు! అలాగే ఇస్త్రీ చేసిన వాయిల్ చీర కట్టుకుని, తల దువ్వుకున్న జడలో మల్లెలు తురుముకున్న రాణీ.... ఇంకా ఇంకా, ఊపిరి తీసుకుని వదిలే సమయాన చిన్నగా ఎగసిపడే గుండెలు వరంగా పొందిన రాణీ... యవ్వనసామ్రాజ్యానికి పట్టమహిషిగా ఉండే అన్ని అర్హతలూ ఉన్న రాణీ... అప్పుడు సత్యమూర్తికి తనదానిలా అన్పించింది! తనకు వరాలిచ్చే దేవతలానూ కన్పించింది!! అందుకే "ఐ లైక్ యూ"




అంటూ గమ్మున రాణీని వాటేసుకున్నాడు సత్యమూర్తి!!

★ ★ ★

సత్యమూర్తి మంచంమీద పడుకుని తల కింద రెండు చేతులూ పెట్టుకుని పైకి చూస్తున్నాడు. అతనికి స్పీడుగా తిరుగుతున్న ఫేన్ కనబడింది. కళ్ళు పక్కకి తిప్పి ఓసారి గదంతా పరకాయించి చూశాడు. పడగ్గది తాలూకు అందాలు పలకరిస్తున్నట్టుగా ఉన్నాయి. రోజ్‌వుడ్‌తో చేసిన ర్యాక్‌లో మ్యూజిక్ సిస్టమ్, వీడియో కెమేరా, ఆ పక్కన వ్యాక్యూమ్ క్లీనర్... కింద అరలో రాణి అలంకరణ సామాన్లు... ఫెయిర్‌గ్లో, లా ఒరీల్ ప్లెంటిట్యూడ్, ఇంకా ఇంకా ఫెయిర్‌నెస్ లోషన్లు. ఎన్నోరకాలు... తన పక్కలో ఇంటర్‌నెట్‌తో కలిసిన సెల్ ఫోన్... సత్యమూర్తి తనలోతనే ఒకసారి నవ్వుకుని, "రాణీ, ఏం చేస్తున్నట్టు?" అంటూ లాలనగా కేకవేశాడు.

"వస్తున్నా... డ్రస్ చేసుకుంటున్నా..."

"త్వరగా రా, మళ్ళీ నేను వెళ్ళాలి" అంటూ సత్యమూర్తి టీపాయ్‌మీద ఉన్న పేపరు అందుకుని చూడసాగాడు.

"ఏమిటీ, ఆ తొందర?" అంటూ రాణి అతని మంచం దగ్గరగా వచ్చింది. అప్పుడు ఆమె స్నానం చేసి, జుట్టు దువ్వుకుని లూజుగా వదిలేసి వుంది. స్లీవ్‌లెస్ జాకెట్... తెల్లని వాయిల్‌చీర. ఆపైన అక్కడే ఉన్న సింగిల్ సోఫాలో కూర్చుంది. ఓసారి సత్యమూర్తిని పరకాయించి చూసి, "అలా పేంటూ షర్ట్‌తో ఇబ్బంది పడకపోతే లుంగీ కట్టుకుని పడుకోరాదా? ఈజీగా ఉంటుందిగా" అంది చిన్నగా, చిలిపిగా నవ్వుతూ. సత్యమూర్తి తన చేతి వాచీ చూసుకుని, "నేను వెళ్ళాలి రాణీ... తనతో కలిసి అన్నం తినకపోతే ఝాన్సీ ఊరుకోదు. ఇప్పటికే ఆలస్యం అయ్యింది" అన్నాడు.

"నా ఇంటిదగ్గర నాతో కలిసి తిన్నావని అనుకోకపోయినా, ఏ హోటల్లోనయినా తిని వచ్చావని అనుకుంటుంది. అంతా నువ్వు చెప్పేదాన్ని బట్టి ఉంటుంది"

"ఆ... అలా ఊరుకునే మనిషి కాదు ఆమె. నీకు తెలియదు"

"ఏం చేస్తుందిట?"

"అలుగుతుంది నీలానే"

"నేనూ, ఆమే ఒకటెలా అవుతాం. అయినా నీ పెళ్ళాం అంటే నీకెందుకంత భయం? ఆమెను నువ్వు కట్నం తీసుకుని పెళ్ళి చేసుకున్నావా? ఆమె ఆస్తితో వచ్చిందా? కనీసం నీతో మాట అయినా కలుపుతుందా?" అంటూ రాణి ఓసారి సత్యమూర్తిని కవ్వింపుగా చూస్తూ, "చెప్పు. ఆమెకు నాలా పడగ్గదిలో నిన్ను లాలించడం తెలుసునా. ఏమిటిట... గొప్ప"

"సరేలే-ఝాన్సీ సంగతి వదిలేయ్. అసలు విషయంలోకి రా రాణీ"

"అదే- మీ చెల్లాయి భైరవి పెళ్ళిగురించా?"

"అవును. నేను చూసిన సంబంధం మంచిది. పైగా పెళ్ళికొడుకు ఎవరోకాదు, మా సూపర్నెండెంట్ ఇంజినీర్ తమ్ముడు. కానీ మా నాన్న అంత సంబంధం ఎందుకంటాడు. అమ్మ కూడా ఆయన పాటే పాడుతోంది"

"అవును. అంత చేటు కట్నాలు పోయడానికి ఎవరైనా వెనకాడతారు కదా?"

సత్యమూర్తి చిన్నగా నవ్వి, "నేను నాన్న పేర ఊళ్లో ఉన్న ఇల్లూ, పొలం అమ్మమన్నాను. దాంతో గొడవ మొదలయ్యింది"

"ఇల్లు అమ్మడం దేనికటా?"

"ఆమాత్రం అర్థంచేసుకోలేవా రాణీ?"

"ఓ... నీ జాగ్రత్తలో నువ్వు ఉండాలిగా... అర్థమయిందిలే... పది లక్షలు కట్నం యిచ్చి మరో మూడు నాలుగు లక్షలు ఖర్చుపెట్టి పెళ్ళిచేయడం తేలికే... కానీ అన్నిటికీ లెఖ్ఖలు ఉంచకోవడం మంచిదని నీ ఉద్దేశం కాబోలు. తెలివైనవాడివే"

"అందుకేగా ఈ ఇల్లు నీ పేర- నీకు నచ్చినట్టుగా కట్టింది"

"ఏంలాభంలే" అంటూ రాణీ కుర్చీలోంచి లేచివెళ్ళి సత్యమూర్తి పక్కన కూర్చుంది.

"అదేమిటి. నీకు ఈ ఇల్లు ఒకటీ సరిపోదా? ఇంకోటి కావాలా? మొహమాటపడకు చెప్పు. వెనక్కి వెళ్లేది లేదు. కట్టిస్తాను"

"నేను ఒక్కత్తిని. నాకెవరున్నారని? నీకు నిత్యం ఆనందాన్నిస్తూ ఇలా ఏదోరోజు హరీ అంటాను. నాకెందుకు మరో ఇల్లు. ఇంకా కొనాలంటే మీ ఆవిడ పేర కొను. పూటకో ఇంట్లో పెట్టి పూజించు"

"అక్కడా నాకు పిల్లలు లేరుగా. ఏడాది పెరిగి వాసుపోవడంతో ఝాన్సీ చాలా డీలాపడింది. ఎవరితో చెప్పుకోను నా బాధలు. ఈసారి అయినా ఆమె కడుపు పండితే నా జన్మ తరించినట్టే. ఝాన్సీకి ఇప్పుడు మూడో నెల"

"కంగ్రాట్యులేషన్స్"

"థాంక్యూ"

"థాంక్యూ అని చాలా నిండుగా హృదయాన్ని చీల్చుకుని అన్నావు మూర్తీ. చాలా సంతోషం. నీకు తెలుసో తెలియదో. నువ్వెప్పుడు నన్ను చూసి నాక్కూడా కంగ్రాట్యులేషన్స్ చెబుతావా, ఆ తరుణం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తున్నాను. అటు ఝాన్సీ, ఇటు నేనూ ఒకేసారి నెల తప్పితే బావుండునని ఆశపడ్డాను" రాణి నవ్వేసింది.

"నీకు పిల్లల్ని కనాలని ఉందా రాణీ? "

"ఏం... నేను పిల్లల్ని కనకూడదా? నాకా అర్హత లేదా? "

"అది కాదు రాణీ"

"నీ ద్వారా నేను తల్లినవడం నీకు ఇష్టం లేదా? మొహం అలా పెట్టావేమిటీ, ఆముదం తాగినట్టు? " అంది మూర్తి దగ్గరగా వెళ్ళి అతని మొహంలోకి చూస్తూ.

"నిన్ను పిల్లల్ని కనవద్దని ఎలా అంటాను రాణీ. కానీ ఓ విషయం గుర్తుపెట్టుకో. నేను ప్రభుత్వోద్యోగిని, మనిద్దరి సంసారం రహస్యంగానే సాగాలి. ఎందుకంటే నువ్వు నీ భర్తనుంచీ నేను నా భార్య నుంచీ విడాకులు తీసుకోవాల్సివుంటుంది. మనమీద కోపంతో ఎవరు కంప్లయింట్ చేసినా నేను కోర్టుల చుట్టూ తిరగవల్సి వస్తుంది"

"అయితే నువ్వూ మంచి ముహూర్తం చూసి ఝాన్సీ నుంచి వేరుపడు" అంది నవ్వుతూ.

"అదంత సులభంకాదు రాణీ"

"అంటే మనిద్దరిమధ్యా బంధం ఇలానే ఇల్లీగల్ గానే ఉండాలంటావు. అదేకదా మూర్తీ నువ్వు చెప్పబోయేది? "

"అది కాదు రాణీ"

"మూర్తీ! మనిద్దరిమధ్యా స్నేహం కలిసి రెండేళ్ళు అవుతోంది. ఇలా ఎంతకాలం మూడోకంటికి తెలియకుండా బతుకుతాం... నాకు నీ ఉంపుడుకత్తెగా, ఇంకా ఇంకా గౌరవ్రాలిగా బతకాలనీ, అలానే చావాలనీలేదు..." సత్యమూర్తి రాణివైపు కళ్ళు ఆర్పకుండా చూస్తున్నాడు.

"మూర్తీ! నాది చాలా చిన్నకోరిక. ఇందులో అన్యాయం ఉందంటావా? " సత్యమూర్తి నేలచూపులు చూశాడు.

"అందరి అమ్మాయిల్లా నేను చాలాచాలా ఆశలతోనే పెరిగాను. కానీ పెళ్ళిచేసుకున్నవాడు నిత్యం అనుమానిస్తుంటే, అవమానిస్తుంటే సహించలేకపోయాను. ఆ తరువాత జరిగింది నీకు తెలుసు. నా ఉద్యోగం, మన పరిచయం, నువ్వు నీ గురించి పూర్తిగా కాకుండా అసంపూర్తిగా చెప్పడం, నేను నీ వల్లో పడడం అన్నీ నీకు గుర్తే... అయినా నిన్ను నేను నమ్మాను. కానీ నువ్వేం చేశావు? " రాణి కళ్ళు బేలగామారాయి. కన్నీటిని రాల్చుకున్నాయి. గుండె ఆవేదనతో ఎగిసెగిసి పడుతోంది.

"ఊరుకో రాణీ... నువ్వు ఇంతకాలం అయినా ఇంకా అన్నీ తలుచుకుని బాధపడుతూ మనసు పాడుచేసుకుంటున్నావని నేను అనుకోలేదు. ఇప్పటికైనా నువ్వు తిక్





స్కిన్డ్ కాకపోతే ఎలా? "

"తిక్‌స్కిన్డా, రాయా... బలే మాట్లాడ తావే నువ్వు" అంది కళ్ళు తుడుచుకుంటూ.

"సరదాగా అన్నాను. ఏమీ అనుకోకు"

సత్యమూర్తి చేతివాచీ చూసుకున్నాడు.

"నువ్వు ఇంటికి వెళ్ళాలనుకుంటున్నా వేమో సరే... ఝాన్సీ నీ గురించి ఎదురు చూస్తూ ఉంటుంది. పైగా వట్టి మనిషి కూడా కాదుగా. వేవిళ్ళ టైములో మనసు భర్తను ఎదురుగా చూస్తే కాస్త తెరిపిన పడుతుంది కదూ? " అంటూ నవ్వేసింది.

"ఆమెను హాస్పిటల్‌కు తీసుకువెళ్ళాలి"

రాణీ ఏదో గుర్తుకు తెచ్చుకుని, "నువ్వు క్రిందటివారం తీసుకువచ్చి ఇంట్లో పెట్టిన డబ్బు అలానే వుంది. పైగా అది ప్రోజక్ట్ పనులు చేయించడానికని చెప్పావ్. తీసుకు వెళ్లి బ్యాంక్‌లో వేయరాదా? ఇక్కడ వుండడం మంచిది కాదు"

"ఆ డబ్బు కొంతకాలం ఇక్కడే వుండనీ రాణీ... అది మా భైరవి పెళ్ళిగురించి వాళ్ళ దగ్గరా వీళ్ళ దగ్గరా అప్పు తీసుకు న్నాను. నువ్వు-కళ్లు ఎఱ్ఱజేసి గుండెలు బాదుకుంటావని చిన్నగా అబద్ధం చెప్పాను. దీని గురించి ఇంట్లో చెబితే- మా నాన్న గారు తను చేసే సహాయం ఆపేస్తాడు"

"ఓ" అంది రాణి.

"నువ్వయినా నా బలహీనతల్ని సాను భూతితో అర్థంచేసుకోవడానికి ప్రయ త్నించు. ఒక్కసారి నా కోణంనుంచి చూడు. అంతా తెలుస్తుంది"

"సరేలే" అంటూ రాణి చిన్నగా నవ్వింది.

"నేను వెళతాను, రేపు వస్తాను" అని ఏదో గుర్తుచేసుకుని, "మా చెల్లాయి పెళ్ళికి అందరికీ వాళ్ళు అడిగినవి కొని యిస్తు న్నాను. నీకేం కావాలో అడుగు. అందరితో పాటు నువ్వూనూ"

రాణి జవాబు చెప్పలేదు.

"పట్టుచీర కావాలా చంద్రహారాలు కావాలా? ఇంకా? "

"చెప్పనా? "

"చెప్పమనే కదా అడిగింది? "

అప్పటికే ఇద్దరూ వీధి గుమ్మందాటి పోర్టికోలోకి వచ్చారు.

"నాకు ఒకే కోరిక ఉంది మూర్తీ. నేను లూప్‌ని తీయించేసుకుంటాను. నాకు తల్లిని కావాలని ఉంది. దయుంచి నన్ను అమ్మని చేయి" అంది నెమ్మదిగా, నిర్మోహమాటంగా రాణి.

మూర్తి మళ్ళీ రాణివైపు చూశాడు. తల దించుకున్నాడు.

"నన్ను రెండు ఏళ్లుగా ప్రేయసిగా చూస్తు న్నావు. నువ్వడిగిన అన్ని ఆనందాలూ నీకు అందించాను. నీకు నన్ను తల్లిగా చూడాలని లేదా? ఒక్కసారి ఈ కోణంనుంచి ఆలో చించి చూడు" అంది ఎంతో ఆప్యాయంగా రాణి.

"అలానే... నీ కోరిక తీరుస్తాను" అంటూ సత్యమూర్తి తన రాజదూత్ రోడ్డుమీదకు నడిపించుకువెళ్ళి దానిమీద ఎక్కి, స్టార్ట్‌చేసి రాణి అందించే వీడ్కోలును అందుకుంటూ విలాసంగా కదిలిపోయాడు.

సత్యమూర్తి కొంతదూరం వెళ్లేసరికి రోడ్డు పక్కన నడుచుకుంటూ వెళ్తున్న తండ్రి కని పించాడు. బండిని తండ్రి దగ్గరగా తీసుకు వెళ్లి "బండి ఎక్కండి నాన్నా... ఎక్కడి నుంచి వస్తున్నారు" అని పలకరించాడు.

"భైరవి జాతకం చూపించడానికి శాస్త్రిగా రింటికి వెళ్ళాను. అంతే" అని గాంధీగారు కొడుకు వెనక కూర్చున్నాడు. పదినిము షాల్లో ఇద్దరూ ఇంటికి జేరుకున్నారు. స్కూటర్ చప్పుడు విని లోపలినుంచి కాంతమ్మ, భైరవి హాల్లోకి వచ్చారు. గాంధీ గారు హాల్లోని సోఫాలో కూర్చుంటే సత్య మూర్తి తనగదిలోకి వెళ్ళాడు.

"శాస్త్రిగారు ఏమన్నారు. ఆ అబ్బాయి జాతకం, మన భైరవి జాతకం సరిపో యాయా నాన్నగారూ? "

"వారు వేరే పనిమీద ఉండి వీళ్ళ జాత

కాలు చూడలేదుట. ఎల్లుండి రమ్మన్నారు"

"బాగానే ఉంది. మనవైపునుంచి ఆలస్యం కాకుండా చూడండి"

"అమ్మా నేను నా ఫ్రెండ్ ఇందుమతీ వాళ్లింటికి వెళ్లొస్తానే. వెళ్లొస్తాను నాన్న గారూ" అంటూ భైరవి అడుగు ముందుకు వేయబోతుంటే కాంతమ్మ అంది.

"ఇంక నువ్వు ఇలా స్నేహితురాళ్ళ ఇళ్ల కంటూ తిరగడం బావుంటుందా భైరవీ. ఈ విషయం వాళ్ళకు తెలిస్తే ఏమైనా అనుకో వచ్చు. పెళ్ళి అయిన తర్వాత అంటారా. మీరిద్దరూ ఎటువెళ్ళినా మేం ఏ అభ్యంతరం చెప్పం"

"నీదంతా చాదస్తం... ఇంకా పెళ్ళి కుద రలేదు. ఈ కట్టుబాట్లు ఎందుకుట?" అంటూ భైరవి బయటకు వెళ్ళింది.

"దీన్ని వంచడం మనవల్లకాదు. ఆ పని ఆ వచ్చేవాడు చేయవల్సిందే. ఓమాట విన డంలేదు. చెప్పినా తోచదు"

"ఈమాట నీ గురించి మీవాళ్ళు తరుచు నా దగ్గర అనేవారు. గుర్తుందా మర్చిపో యావా" అన్నాడు నవ్వుతూ గాంధీ.

"నా గురించా... చాల్లెండి అబద్ధాలు. ఎవరైనా వింటే నవ్వుతారు. మీ అమ్మగారే మీ గురించి ఎన్నో చెప్పేవారు. పోనీ అని నేనే నోరుమూసుకుని సర్దుకుపోయాను, తెలుసా" కాంతమ్మ నవ్వుతూ అంది.

అప్పుడే లోపలినుంచి ముందు సత్య మూర్తి వెనక ఝాన్సీ హాల్లోకి వచ్చారు. సత్యమూర్తి తండ్రిని చూసి, "నాన్నా నేనూ ఝాన్సీ, నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళివస్తాం"

"నువ్వు భోజనం చేశావా?" కాంతమ్మ అడిగింది,

"ఆయనకు నేను అన్నం పెట్టాను అత్తయ్యా"

"వెళ్ళిరండి జాగ్రత్త" అన్నాడు గాంధీ.

★ ★ ★

కొడుకూ, కోడలూ కారెక్కి బయటకు వెళ్ళగానే కాంతమ్మ భర్త పక్కన కూర్చుంది. ఓసారి నిశ్శబ్దంగా హాలుని పర కాయించి చూసింది. భర్త మొహంలోకి చూసింది. గాంధీగారూ ఓసారి భార్య మొహంలోకి చూసి,

"వారం తరువాత నీతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం చిక్కింది కాంతం. నా మనసులో ఉన్నది చెబుతాను. నీ ఉద్దేశం ఏమిటో చెప్పు. పిసరంత కూడా మొహ మాట పడొద్దు. తెలిసిందా?"

"అదేమిటీ" అంది భర్తని కొత్తగా చూస్తూ కాంతమ్మ.

"అదే కాంతం-మన భైరవికి సత్యమూర్తి గాడు తెచ్చిన సంబంధంలేదూ వాళ్లతో మనం తూగగల మంటావా? వాళ్ళు చూస్తే బాగా ఉన్న వాళ్ళలా ఉన్నారు. ఆ ఇల్లే ఓ హోటల్‌లా వుంది. మనుషులు కూడా నేల మీద పుట్టిపెరిగిన వాళ్ళలా కాకుండా ఏ పైనుంచో దిగివచ్చిన బాపతులా ఉన్నారు. వాళ్లతో భైరవి వేగగలదంటావా? మనతో వాళ్ళు ఆప్యాయంగా మసలుతారంటావా? పది లక్షలు కట్నం ఇచ్చి ఈ పెళ్ళి మనం ఎందుకుచేయాలి? వియ్యం అయినా కయ్యం అయినా సమాన ఫాయిదా చూసు కోవాలంటారు"

"నిజం చెప్పమంటారా?" అంది నెమ్మ దిగా కాంతమ్మ భర్త చెప్పింది విని.

"చెప్పు..."

"వాడితో నేను చెప్పానండీ. లేని గొప్ప లకు పోవద్దని. అయినా నిలేసి అడిగాను. కట్నానికీ పెళ్ళికీ అంత డబ్బు ఎక్కడినుంచి మనం తేగలంరా అని... ఊహూ... తనూ మీరూ చూసుకుంటారంటాడు గానీ, వివ రాలు చెప్పడు. పెద్ద ఇంజనీరుగారి తమ్ముడూ, మంచి సంబంధం... అంటూ ఒకటే పాట మొదలుపెట్టాడు"

"నన్ను మన ఉయ్యూరు ఇల్లూ, రెండెక రాల పొలం అమ్మెయ్యమని సలహా యి చ్చాడు"

"అలానా" ఆశ్చర్యపోయింది కాంతమ్మ.





"చెప్పు... ఆ ఇల్లూ పొలం అమ్మి ఈ సంబంధం చేద్దామా? నీకు ఏమనిపిస్తోంది? "

"కొడుకయి వుండి ఇదా వీడు చేయబోయే నిర్వాకం"

"మనం ఇక్కడికి వచ్చినప్పటినుంచి చూస్తున్నాను కాంతం. వీడు చాలా మారాడు. మాటలో, ప్రవర్తనలో మార్పు వచ్చింది. ఇంకా"

"చాల్లెండి. కోపంతో చూస్తే ఏ వస్తువయినా మనిషయినా అయిష్టంగానే కన్పిస్తాయి"

"కాదు కాంతం... వీడు తను పనిచేసే సంస్థలో బాగా లంచాలు మరిగాడుట. ముఖ్యంగా ఆ విశ్వనాథంగారి కింద పనిచేయడం మొదలయినప్పటినుంచీ ఇద్దరూ కలిసి నానా భ్రష్టుపనులూ చేస్తున్నారుట. మొన్నోరోజు వీడితోపాటు ఫ్యాక్టరీకి వెళ్ళాను. అక్కడ చాలామంది నావైపు చూసి, 'సత్యమూర్తిగారి తండ్రిగారా మీరు' అని అదోలా మాటలు మొదలుపెట్టారు. ఏం చెప్పమంటావ్? "

కాంతమ్మ నవ్వేసిందిగానీ జవాబు చెప్పలేదు.

"కొడుకు ఉద్యోగం చేసి మనిద్దర్నీ పోషిస్తున్నందుకు సంతోషించవల్సిందే కానీ దొంగ సంపాదనతో మన నెత్తిన కిరీటాలు పెడతానంటే మాత్రం మనం ఒప్పుకోకూడదు"

"ఆ మాత్రం వాడికి తెలియదా... లంచాలు తెగమేస్తే ఏదో ఓనాడు గొడవలు వస్తాయనీ యిరుక్కుంటామనీ అనిపించదా? "

"వివేకంతో ఆలోచించగల్గితేనే మంచి చెడులు తెలిసేది... డబ్బు మైకంలోనూ ఆడదాని వలలోనూ పడ్డవాడికి ఏమీ అర్థం కాదు"

"సరేలెండి. నేను వాణ్ణి హెచ్చరిస్తాను. మీరు కంగారుపడొద్దు"

"ప్రభుత్వ ఉద్యోగం కదా అని కన్నూ మిన్నూ కానకుండా అడ్డదారుల్లో తినడం అన్యాయం. ఓసారి ఏ కేసులోనయినా ఇరుక్కుంటే అప్పుడు తెలుస్తుంది. ఎవరూ సహాయపడరు. ఆఖరికి ఆ విశ్వనాథం కూడా ఏంచేయలేడు"

"స్వతహాగా వీడు భయస్తుడు. మరి ఎందుకిలా మారాడో..."

గాంధీగారు భార్య మొహంలోకి చూశాడు. తలవంచుకున్నాడు.

"అవునూ... మధ్యన మీరు బాధపడి మనసు పాడుచేసుకోద్దు సుమా...మనవాళ్లయినా పరాయి వాళ్ళయినా మనం కొంతవరకే చెప్పగలం. మీ రోజుల్లోలా మీలా అందరూ నీతిమంతుల్లా, కడిగిన ముత్యాల్లా ఉండమంటే ఉండగల్రా. మనుషుల బుద్ధుల్లో, ప్రవర్తనలో మార్పు వచ్చింది. చాలామంది ఎలా బతకాలని కాకుండా ఎలాగైనా బతకొచ్చు అనే కొత్త సిద్ధాంతాలు చేస్తున్నారు. ఒకవేళ మనవాళ్ళ ప్రవర్తన మనకి నచ్చకపోతే మనం దూరంగా జరగడం మంచిది. అంతేగాని మనస్పర్థలు మంచివి కావు. మన కట్టెలు వాళ్ళ చేతుల్లో వెళ్ళాల్సివుంది"

"లేదు కాంతం. నాకు పెద్దాడు భాస్కరం ప్రవర్తనతో వాడి పెళ్ళాం రాధమ్మ ప్రవర్తనతోనే రక్తసంబంధం మీద, ఆప్యాయతల మీదా నమ్మకం పోయింది. వాడు బంగారం లాంటి ఉద్యోగం చేస్తూ అవినీతికి అలవాటుపడ్డాడు. ఆఖరికి ఏమయ్యిందో తెలుసుగా? సస్పెండ్ అయ్యాడు. నా ముందు మొహం చెల్లక వెళ్ళి అత్తవారింట ఉంటున్నాడు. కానీయ్. మచ్చ వాడి మొహానే పడింది" గాంధీగారు ఆగి, "కనీసం వీడైనా తన పని తను చేసుకుపోతాడనుకుంటే ఊహూ" అని తల ఊపి,

"పోనీ మనం వీళ్ళని వదిలేసి తిరిగి ఉయ్యూరు వెళ్ళిపోదామా? ఎవరితో ఏ గొడవలూ ఉండవు. మనింట్లో మనం ఉంటాం. నా పెన్షన్, ఇంకా పొలంమీద

వచ్చేదీ మనకు చాలు"

కాంతమ్మగారు భర్త చెప్పే మాటలు వింటోంది.

"మీరు చాలాదూరం వెళ్లి ఆలోచించి పెట్టుకున్నట్టు కనబడుతోంది".

"గాలీ, వెలుతురూలేని ఇంట ఉండడం ఎవర్నికైనా అసాధ్యమే కదా? "

"భైరవి పెళ్ళి జరగాలి. ఇంకా దానికి పుట్ట బోయేవాళ్ళ ఆలనా పాలనా చూడాలి. అలాగే ఝాన్సీకి నెల తప్పింది. వీళ్ళందరి కడుపున ఒకటి రెండు కాయలు కాస్తే వాళ్ళనీ పెంచాలి. అలాంటిది- అన్నీ వదులుకుని మనం మూటాముల్లే సర్దుకుని పోగలమా. ఎవరో ఏదో అనుకుంటారని కాదు. మన మనసు అందుకు ఒప్పుకుంటుందా చెప్పండి? "

"అయితే? "

"మీరు అన్న మంచి, మీరు మెచ్చే నిజాయితీ మన సంతానంలో కనబడ్డం లేదని బాధపడ్డంలో తప్పులేదు. అంతేగానీ వాళ్ళు దుర్మార్గులని వాళ్ళు ఏనాటికీ మారరని అనుకుని లాభంలేదు. ముందు మీరు సత్యమూర్తితో సూచాయిగా చెప్పండి. నేను ఝాన్సీకి చెబుతాను. భైరవికీ చెబుతాను. మన ప్రయత్నం మనం చేద్దాం అంతేగానీ మీరు అన్నాహజారేలాగా, నేను మేథాపాట్కర్‌లాగా అవతారాలెత్తి ఈ ఇంటినీ ఈ ఇంట్లో మనుష్యుల్ని ఒక్కరోజులో ప్రక్షాళనం చేసేద్దామనుకుంటే అది కుదిరే పని కాదు. సరేనా? " అంటూ కాంతమ్మ కుర్చీలోంచి లేచింది.

"ఒక మాట చెప్తాను వింటావా? "

"వింటాను"

"భైరవి రాగానే దానికి నువ్వు అన్నీ చెప్పు. ఆ లంచగొండుల ఇంటికి కోడలిగా వెళ్ళి బతుకు పాడుచేసుకోవద్దని చెప్పు. నాకు తెలుసు మనిద్దరం చెబితే అది వింటుంది. ఈ సత్యంగాడే దానిని బాగా ఎగేసి ఉంటాడు"

"సరేలెండి. ఇంకా జాతకాలు కలవాలి కదా ఇద్దరికీ"

గాంధీగారు కుర్చీలోంచి లేచి గోడలకున్న గాంధీ, తిలక్, వివేకానంద, శ్రీ అరబిందో ఫోటోలవైపు ఓసారి చూసి తన గదిలోకి వెళ్ళారు.

అప్పుడే బయటనుంచి భైరవి వచ్చింది.

★ ★ ★

భైరవీ- ఇందుమతి మధ్య వున్న స్నేహం చాలా గట్టిది. ఆ స్నేహం వాళ్ళిద్దరి కుటుంబాలమధ్య వుండే చనువువల్ల పెరిగి పెద్దదయ్యింది. పైగా వాళ్ళిద్దరూ జూనియర్ కాలేజీ వరకూ ఉయ్యూరులోనే చదివారు. అప్పట్లో ఇందుమతి తండ్రి రామ్మూర్తిగారు పాలిటెక్నిక్ కాలేజీలో లెక్చెరర్‌గా ఉండేవారు. ఇళ్ళు కూడా పక్కపక్కనే. అయితే రామ్మూర్తిగారికి విశాఖపట్టణం ట్రాన్స్‌ఫర్ అవడంతో స్నేహితురాళ్లు నాలుగైదు ఏళ్ళు దూరంగా ఉన్నా అనుకోకుండా ఇద్దరూ బ్యాంక్ ఉద్యోగస్థులై తిరిగి హైదరాబాద్‌లో కల్సుకున్నారు. ఒకళ్ళకొకళ్లు దగ్గరయ్యారు. పైగా రామ్మూర్తిగారూ భార్యా కూడా ఏ అరమరికలూ లేకుండా భైరవిని ఇందుమతితో సమానంగా ప్రేమిస్తారు!

భైరవి ఆటోలో కూర్చుని ఇందుమతినీ, ఆ తర్వాత చెలికాడుగా మారిన చైతన్య గురించీ చాలాసేపు ఆలోచించింది. ఆటో ఇందుమతి ఇంటిముందు ఆగిన తర్వాతే ఆ ఆలోచనలు వెనక్కి మళ్లాయి. భైరవి ఆటో దిగి, 'ఇందూ' అని కేకవేసి లోపలకు రెండు అడుగులు వేసేలోపునే ఇందుమతి ఎదురొచ్చింది. ఇద్దరూ బెడ్‌రూమ్‌లో కూర్చున్నారు. భైరవి తనరాక వెనుకవున్న కారణం, చైతన్యతో మాట్లాడిన విషయాలూ అన్నీ చెప్పింది.

"బాగానే ఉంది" అంది ఇందుమతి ఆశ్చర్యంగా.

"ఇది వింటే నువ్వు మరీ ఆశ్చర్యపోతావ్. సడన్‌గా మొన్న ఆదివారం మా అన్నయ్య ఓ పెళ్ళివారి మూకను ఇంటికి తీసుకువ




చ్చాడే. పైగా ఆ పెళ్ళివారు అన్నయ్యతో పనిచేసే విశ్వనాథంగారికి కావాల్సిన వాళ్ళు. ఇంట్లో గొడవ పడ్డం ఎందుకని కేజువల్‌గా పెళ్ళివారి ముందు కూర్చున్నాను"

"పెళ్ళికొడుకు ఎలా ఉన్నాడు. నచ్చాడా ఏమిటి కొంపదీసి"

"నా బొందలా ఉన్నాడు" భైరవి పకపకా నవ్వేసింది.

"కనీసం నీ మనసులో మాట మీ అమ్మ గారితో చెప్పొద్దా"

"రోజూ అనుకుంటూనే ఉన్నాను కుదర లేదు. పైగా చైతన్య ఈ వేళే ఊరునుంచి దిగాడు"

"అతనితో చెప్పావా? "

"మా ఇంటికి రమ్మనమని చెప్పాను. దొర గారు ఈ పాటికి బయలుదేరే ఉంటాడు"

"అవునూ... మీ అన్నయ్య రభస చేస్తే" అంది అనుమానంగా ఇందుమతి.

"ఏంచేయాలో నువ్వే చెప్పు. నా తల తిరి గిపోతోంది"

"నేను సలహా ఏదో ఒకటి చెప్పగలను. కానీ ధైర్యంగా నిలబడవల్సింది మీరిద్దరూ"

"ఆ భయంలేదు. చైతన్య ధైర్యస్థుడు. రెండేళ్ళుగా ఎ.సి.బి.లో ఇన్‌స్పెక్టర్‌గా ఉంటున్నాడులే" అంది నవ్వుతూ భైరవి.

"అలానా... ఎ.సి.బి. వాళ్ళతో వేగడం కష్టమే" అంది పకపకా నవ్వుతూ ఇందు మతి.

"కష్టం ఏమిటి? " అంది ఆశ్చర్యంగా భైరవి.

"ఏంలేదు. పెళ్ళయి, సంసారగాడిలో పడ్డ తర్వాత అలవాటుగానో అవసరానికో నువ్వు అతగాడి జేబు కొట్టేశావనుకో. తన రొటీన్ డ్యూటీగా నిన్ను ట్రాప్ చేస్తాడేమో... అదీ నా సంశయం" అంది నవ్వుతూ ఇందుమతి.

"పోవే..." అని భైరవి కూడా చిన్నపిల్లలా నవ్వేసి, "ఎంతటి ఎ.సి.బి. ఉద్యోగస్థుడ యినా తన ఆనందంకోసం భార్యకు రకర కాల లంచాలు ఇవ్వవల్సిందేనే! భార్యాభర్తల న్నవాళ్లు పగలు కొలీగ్స్‌గా, రాత్రుళ్ళు తోడు దొంగలుగా అవతారాలు ఎత్తగల్గితేనే వాళ్ళు ఆదర్శదంపతులు అవుతారు తెలుసా? " అంది.

"అమ్మో... ఇవన్నీ ఎక్కడ నేర్చావే ఫూల్"

"ఆఫీసులో ఓ పెళ్ళి అయిన జోతిష్యిణి అడక్కుండానే ఇవన్నీ చెప్పిందిలే"

సరిగ్గా అప్పుడే చైతన్య స్కూటర్ దిగి గేటుదాకా వచ్చాడు. ఇందుమతి ముందుగా ఎదురువెళ్ళి "రండి, ఇదే నా ఆహ్వానం. మీ భైరవి ఇచటనే, అనగా లోపల గువ్వపిట్టలా కూర్చుని ఉంది" అంటూ చైతన్యని లోపలికి తీసుకువెళ్ళింది. భైరవి లోపలికి వస్తున్న స్నేహితుడు చైతన్యని చూసి చిరునవ్వుతో మౌనంగా ఆహ్వానించింది. మంచి పొడగరి, కసరత్తుచేసిన శరీరం, కోలమొహం, పెద్ద కళ్లు, ఇట్టే వాతావరణాన్ని బేరీజు వేయగల కనుగుడ్లు, దుబ్బుమీసాలు, మౌనహాసంతో పలకరించే పల్చని పెదాలు, పేంట్‌మీద హాఫ్‌హేండ్స్ శ్లాక్ టక్ చేసుకున్న విధానం, అన్నీ భైరవికి పరిచయమైనవే. అయినా అతను ఆ క్షణాన ఆమెకు కొత్తగానే కన్పిం చాడు. అలాగే సరికొత్తగా ఆమెను సిగ్గు చు ట్టుముట్టింది. ఓసారి కళ్ళెత్తి "ఎలా ఉన్నావ్? " అని పలకరించి, తిరిగి రెప్పలు వాల్చుకుంది.

"కన్పిస్తున్నానుగా. కానీ నువ్వే షేక్స్పియ ర్‌ని లా ఉన్నావ్. ఏమిటి సంగతి. అంతా భయమేనా, దిగులేనా? " అన్నాడు సోఫాలో కూర్చుంటూ.

"నిజమే... అందుకే ఇటు పరిగెత్తుకువ చ్చాను" అంటూ భైరవి జరిగింది చెప్పింది.

"మన ఇందుమతిగారు ఏమంటారు? "

"జరిగింది మనకు తెలుసు. ఇది చిన్న ఇష్యూ. అందుకే దాన్ని పోజిటివ్‌గా టేకిల్ చేస్తే బావుంటుందని నా ఉద్దేశం" అంది ఇందుమతి సలహా చెబుతున్నట్టుగా.

"అవునండీ. మా ఇద్దరికీ ఉద్యోగాలు ఉన్నాయి. మా బతుకులు మేం బతకగలం.

నాకా వెనక ఎవరూలేరు. ఇవన్నీ తెలిసి భైరవీ వాళ్ల ఇంట్లోవాళ్లు మా పెళ్లికి క్లియరెన్స్ ఇస్తే అదే మాకు మహాభాగ్యం... కాదంటే షరా మామూలే"

"నేను భైరవికి అదే చెప్పాను. మీ గురించి ఇంట్లో చెప్పి, వాళ్లు కాస్త ఆలోచించుకుందుకు టైం ఇస్తే బావుంటుంది"

"నా ఉద్దేశంలో ఈమె అమ్మగారూ, నాన్నగారూ మా పెళ్లికి ఒప్పుకున్నా, సత్యమూర్తిగారు మాత్రం తల ఊపకపోవచ్చు ఎందుకంటే ఆయనకు నేనంటే ప్రత్యేకంగా అయిష్టం లేకపోయినా, నా ప్రొఫెషన్ చూస్తే అయిష్టం. ఒకటిరెండుసార్లు నా విధి నిర్వహణలో ఆయనతో నేను భేటీ పడ్డాను..."

"అయ్యో..."

"అందుకే భైరవి జరిగిందంతా మొదట ఆమె వదినగారికి చెబితే బావుంటుంది. ఆవిడ సత్యమూర్తిగారిని నచ్చచెప్పి ఒప్పించొచ్చు. పైగా రెండురోజుల్లో బోసు ఇంటర్వ్యూకి ఎటూ ఈ ఊరు వస్తున్నాడు. వాడికి మా విషయం తెలుసు. వాడూ మాకు సహాయపడొచ్చు"

"అవునే. మీ కథ సుఖాంతం అవ్వాలంటే ఝాన్సీగారే ప్రధానపాత్ర పోషించాలి. తప్పదు. నువ్వు అటునుంచి నరుక్కురా"

"మా అన్నయ్య మా వదినమాట వింటాడని నాకు నమ్మకంలేదు"

"చూద్దాం... అన్నీ సవ్యంగా జరుగుతాయనే అనుకుందాం. లేదంటే రిజిస్ట్రార్ ఆఫీసుదారి ఉండనే ఉంది..." అన్నాడు చైతన్య.

"అది కాదు చైతన్యగారూ... నాది మరో సలహా ఉంది"

"చెప్పవే..." అంది భైరవి.

"భైరవీ... నేను చెప్పేది విని నువ్వూ బాగా ఆలోచించు. మీ అన్నయ్య నిన్ను తన సర్కిల్లో తెలుసున్న వాళ్లకి యిచ్చి పెళ్ళి చేయాలనుకున్నాడు. అది అతని ఆశ... కానీ నిజం తెలిస్తే మనసు మార్చుకుంటాడేమో? మీరిద్దరూ కలిసి అతనితో మాట్లాడండి. అదీ ఓపెన్‌హార్ట్‌తో... అప్పుడు సరే అనడం, లేక కాదనడం అతనిష్టం"

"నాకు ఇష్టంలేదే ఈ పని" అంది భైరవి.

చైతన్య చిన్నగా తల ఊపుతూ "అలా అనొద్దు భైరవీ... అతనూ మనిషే. స్వార్థమంటావా? ఉండడంలో తప్పులేదు. మనంగా వెళ్ళి కలిస్తే అతను మెత్తబడొచ్చు"

"సరే... నీష్టం..."

అలా ముగ్గురూ కాసేపు కబుర్లు చెప్పుకున్నారు. భవిష్యత్ గురించి చర్చించుకున్నారు. జోకులు వేసుకున్నారు. నవ్వుకున్నారు.

"మేం వెళ్తాం ఇందుమతిగారూ. మీ సలహాలకు కృతజ్ఞులం"

"బాగానే ఉందిగానీ, వెళ్తాం అని అంటున్నారేమిటి? భైరవి ఒంటరిగా మా ఇంటికి వచ్చింది. మీరు జంటగా బయటపడ్డానికి నేనెలా అనుమతి యివ్వగలను? నాకా అథారిటీ ఉందా? " అంది ఇందుమతి జోక్ చేస్తూ.

"చాల్లే... గొప్పగా జోకుతున్నాననుకుంటున్నావ్" అంటూ భైరవి తన చేతిని సుతారంగా ఇందుమతి మీదకు ఎత్తింది.

"సారీ! మంచిది. వెళ్ళిరండి. కానీ భైరవీ-నువ్వు సరాసరి మీ ఇంటికే వెళ్లు. అంతగా అయితే మధ్య కామత్‌లో కూర్చుని కాఫీ మాత్రం తాగండి. అదీ దూరం దూరంగా కూర్చుని. తెలిసిందా? " అంది వేళాకోళంగా.

"ఏయ్" అంది బుంగమూతిపెట్టి భైరవి.

చైతన్య నవ్వుతూ గుమ్మం దిగాడు. భైరవి వెళ్లి స్కూటర్‌మీద అతని వెనక కూర్చుంది. ఆశ్చర్యంగా వాళ్ళిద్దర్నీ ఎక్కించుకున్న స్కూటర్- ఓ వాహనంలా కాకుండా అచ్చు మచ్చు పూలపడవలా కదలసాగింది!

★ ★ ★

అరగంటలో భైరవి తన ఇంట్లో ఉంది. అప్పటికే సాయంత్రం అయిన మూలంగా తల్లీతండ్రీ దగ్గరలో ఉన్న ఆధ్యాత్మిక కేంద్రా





నికి వెళ్ళారు. ఇంట్లో అన్నగారు ఉన్న అలి కిడి లేదు. ఆమె సరాసరి వంటింట్లోకి వెళ్ళి కట్టర్‌మీద కూరలు తరుగుతున్న వదిన గార్ని చూసి, "వదినా" అంటూ పిల్చింది.

"వచ్చావా భైరవీ... ఇంతసేపూ ఇందు మతీ వాళ్లింట్లోనే ఉన్నావా? ఇప్పుడే ఆమెకు ఫోన్ చేశాను"

"అక్కడా అంకుల్, ఆంటీ ఊరికి వెళ్ళారు. ఇద్దరం కబుర్లలోపడ్డాం. అందుకే ఆలస్యం అయ్యింది వదినా"

"కబుర్లు చెప్పుకోవాలిగానీ కబుర్లలో పడితే ఎలా? దెబ్బలేం తగలలేదు కదా" అంది వేళాకోళంగా ఝాన్సీ.

"లేదులే"

"అయితే మంచిదే. కాఫీ కలపనా... తాగుతావా? "

"కాదు వదినా... నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి"

"మాట్లాడు"

"ఇక్కడ కాదు, దొడ్లో నైట్‌క్వీన్ పందిరి కింద కూర్చుందాం... అన్నీ చెప్తాను"

"కథా... నవలా... టి.వి. సీరియల్ తాలూకు మొదటి ఎపిసోడా? "

"అన్నీనూ"

"పద"

ఇద్దరూ దొడ్లోకి వెళ్లి అక్కడే ఉన్న గార్డెన్ చెయిర్స్‌లో కూర్చున్నారు. క్రీపర్‌కు ఉన్న నైట్‌క్వీన్ మొగ్గలన్నీ పువ్వులుగా అవతారం ఎత్తడానికి రంగం సిద్ధంచేసుకుంటున్నాయి. చెట్లమధ్యనుంచి పడమటి ఆకాశానికి తుది వీడ్కోలు చెప్తున్న సూర్యబింబం తాలూకు ఎర్రదనంతో దొడ్డంతా వెలుగుతోంది. దొడ్లో మొక్కలన్నీ అది తమకు తెలిసిన నిత్య కృత్యం అయిన ఓ ప్రక్రియే అనుకున్నా పర వశించడం మానలేదు. తలలూపి సంతోషిం చడమూ మానలేదు.

భైరవి తన మనసువిప్పి ఝాన్సీకి అన్నీ చెప్పింది. తన నిర్ణయం చెప్పింది. తన వెన్నంటి ఉండమంది. ఇంట్లో అన్నగారితో పాటు తల్లిదండ్రులకు నాజూగ్గా నచ్చజెప్పి పుణ్యంకట్టుకోమంది.

"మీ అన్నయ్య శాస్త్రిగారి దగ్గరనుంచి నీదీ ఆ అబ్బాయిదీ జాతకాలు తెచ్చారు. ఆ పెద్ద మనిషి వాటిని ఓ.కే చేశారుట"

"అవన్నీ వదిలేయ్ వదినా. నన్ను రక్షించు" అంటూ భైరవి, ఝాన్సీ కాళ్లు తాకింది.

"మంచి దానివే, ఊరుకో"

భైరవి తలవంచుకునే ఉంది. మరోసారి మళ్ళీ చెప్పిన కథే చెప్పసాగింది. "పిచ్చిపిల్లా" అంటూ ఝాన్సీ భైరవి తలా, వీపూ నిమి రింది. తనలోతనే నవ్వుకుని, "ఏమీ తెలియ నిదానిలా ఇంత గ్రంథం నడిపించి, కేసు క్రానిక్ అయిన తర్వాత నేను నీకు డాక్టర్‌గా కన్పించానా తల్లీ? " అంది.

"నువ్వు స్పెషలిస్ట్‌వని నాకు ఇప్పుడే తెలి సింది వదినా"

"నీకు తెలిసి ఉండదులే... ఈ సలహా మా తమ్ముడే నీకు యిచ్చి ఉంటాడు. అవును కదూ" అంది ఝాన్సీ భైరవికి కిత కితలు పెడుతూ.

"నిజమే వదినా"

"చూద్దాం... మీ అన్నయ్య సంగతి నీకూ తెలుసు. ఆయన ఎవరిమాటా ఓ పట్టాన వినరు. అయినా మనందరి తెలివితేటలూ కలగలిపి ఆయనమీద ప్రయోగిద్దాం. ఆపైన పైవాడు ఉన్నాడు. వాడిదయ"

"వదినా అన్నయ్యమీద ప్రయోగించవ ల్సింది తెలివితేటలు కాదు, నీ అంబుల పొదిలో ఉన్న సమ్మోహనాస్త్రాలు. సూటిగా వదలాలి. గుర్తుంచుకో" అంది భైరవి, నవ్వేస్తూ.

ఝాన్సీ అమాయకంగా మొహంపెట్టి, 'అలానా తల్లీ' అని ఆమె బుగ్గలు రెండూ గిల్లి, "మా తమ్ముడిమీద నువ్వూ, నీమీద తమ్ముడు వేసుకోగా మిగిలిన మోహనాస్త్రాలే మన్నా వుంటే నాకు యివ్వు. ఎందుకంటే మా అస్త్రాలకు మంత్రశక్తి పోయింది"




అంటూ రిటార్టు యిచ్చింది.

"మా దగ్గర సరుకు నిండుకుంది వదినా. నీ బలం నాకు తెలియదా? మరీ బెట్టుచేయకు" అంది నవ్వుతూ భైరవి.

"అడక్కుండా వరాలిచ్చే భోళా శంకరుడికి, పెళ్ళి అయి సంసారంలో పడ్డ ఆడదానికీ పెద్ద తేడా ఉండదు. ఇంట్లో భర్త అనే శాల్తీ భక్తుడి వేషం వేసుకుని దొంగ ప్రేమ నటించినా, భయపెట్టి బెదిరించినా భార్యలు, మరోదారి లేక వరాలిచ్చేస్తారు. ఆ తరువాత నిజం తెలిసి తోకముడిచి పరిగెట్టవల్సిందే ఈశ్వరుడిలా!"

"భైరవి సీరియస్‌గా అంది, "నవ్వుతాలికైనా అలా అనొద్దు వదినా. నీ పేరు ఝాన్సీ. మర్చిపోవద్దు. నీ నవ్వుతో, నీ ధైర్యంతో, నీ చాకచక్యంతో నువ్వు ఏ పని చేసినా సక్సెస్ నీదే అవుతుంది"

"సరేలే... లోపలికి పోదాం, పద. ఇంకా వంటపని పూర్తిచెయ్యాలి"

ఇద్దరూ లోపలికి వెళ్ళారు. ఓ గంట తర్వాత గాంధీగారు, కాంతమ్మ పురాణ కాలక్షేపం చేసి వచ్చారు. భోజనం చేశారు అందరూ. సత్యమూర్తి తొమ్మిది గంటలు దాటిన తర్వాత ఇంటికి వచ్చాడు. అప్పుడు సత్యమూర్తీ, ఝాన్సీ కలిసి తిన్నారు. సత్యమూర్తి భోజనం చేసి తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఝాన్సీ డైనింగ్‌టేబిల్ సర్ది, ఆ తర్వాత సబ్బుతో మొహం రుద్దుకుని, పౌడర్ రాసుకుని బొట్టుపెట్టుకుంది. డ్రెసింగ్‌టేబిల్ ముందు నిలబడి తెల్లని వాయిల్ చీర కట్టుకుని, ఫ్రిజ్‌లోని మల్లెదండ తల్లో తురుముకుంది. నెమ్మదిగా పడగ్గదిలోకి వెళ్ళి మంచంమీద వాలి, పువ్వులు నలక్కుండా తలగడను సరిజేసి, అప్పటికే పడుకున్న భర్తను చూసి, "ఎక్కడ ఆలోచిస్తున్నారు స్వామీ" అంది లాలనగా.

"ఏముంది... మామూలే. ఆఫీసు గొడవలు... ఆపైన భైరవి పెళ్ళి గురించి" అని ఊరుకున్నాడు సత్యమూర్తి.

"నేనోమాట చెప్పనా?" అంది తనుగా భర్త పక్కకి జరుగుతూ ఝాన్సీ.

"చెప్పు, ఏమిటిట" అంటూ క్రీగంట చూశాడు సత్యమూర్తి.

"ఓ కథ చెప్తాను వినండి. ఆ కథకి ముగింపు, మంచి ముగింపు- మీరే చెప్పాలి"

"కానిద్దూ"

"అయితే వినండి" అంటూ ఝాన్సీ నెమ్మదిగా మెత్తని స్వరంతో నచ్చజెప్పే పద్ధతితో భైరవి ప్రేమకథ చెప్పింది. అందుకు ఆమెను ప్రోత్సహించిన పరిస్థితులు వివరించింది. చైతన్య అనే ప్రేమికుడి గురించి చెప్పింది. అతగాడు తన తమ్ముడితో కలిసి చదివాడనీ, అతని గురించిన వివరాలు సేకరించడం సులువనీ చెప్పింది. చెల్లెలికి నచ్చిన వాణ్ణి మెచ్చడం బావుంటుందని చెప్పింది.

సత్యమూర్తి ఝాన్సీ చెప్పిందంతా వింటూ వళ్ళంతా తేళ్ళూ, జర్రులూ పాకినట్టు విలవిల్లాడిపోయాడు. కాసేపు నోరు పెద్దగా తెరిచి అరిచాడు. కళ్ళు ఎర్రబర్చుకున్నాడు. 'కాదు' 'కాదు' అన్నాడు. 'వీల్లేదు' అన్నాడు. మంచంమీద లేచి కూర్చుని వళ్ళో తలగడ పెట్టుకుని తెగ సణుక్కున్నాడు. భైరవిని ఇంట్లోంచి గెంటుతాననీ, చైతన్యని చంపుతానని మాట్లాడాడు. ఝాన్సీ ఎన్నోరకాలుగా సర్దిచెప్పింది. అయినా సత్యమూర్తి వినలేదు. ఆపైన ఆవేశంగా అన్నాడు, "నువ్వు మాట్లాడొద్దు. బహుశా అది నీ వత్తాసు చూసుకునే ఈ రంగంలోకి దిగి ఉంటుంది. ఎక్కువ మాట్లాడావంటే నిన్ను చంపుతాను" అంటూ మంచందిగి కాలుగాలిన పిల్లిలా గదంతా తిరిగాడు. ఓసారి హాల్లోకి వెళ్ళి తల ఊపుకుంటూ తిరిగి వచ్చాడు. ఝాన్సీ మాత్రం కళ్ళు అప్పగించి భర్తనే చూస్తూ మంచంమీద కూర్చుంది. సత్యమూర్తి మంచంమీదనుంచి లేచి కుర్చీలో కూర్చుని తనలోతను ఆలోచిస్తూ ఉండిపోయాడు. ఝాన్సీకి పొడి కళ్ళు పడ్డాయి. అలాగే తల వంచుకుని ఉండిపోయింది.

సత్యమూర్తి చాలాసేపు కూర్చున్నవాడు కూర్చున్నట్టే ఉండిపోయాడు. అలానే బయటకు ఓసారి చూసి వెనక్కి తిరిగి "తెల్లవారింది. అమ్మా, నాన్నా ఈ పాటికి లేచే ఉంటారు. నేను వాళ్ళిద్దరితో మాట్లాడాలి. నువ్వు కాఫీ కలిపి తీసుకురా" అని గది తలుపు తెరుచుకుని హాల్లోకి వెళ్లాడు.

అప్పటికే అక్కడ పెద్ద సోఫాలో గాంధీగారూ, కాంతమ్మ కూర్చుని ఉన్నారు. వాళ్ళ మొహాల్లో అలసట, ఆందోళనా కన్పిస్తున్నాయి. సత్యమూర్తి తండ్రికి ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నాడు. ముగ్గురూ మొహమొహాలు చూసుకున్నారు. ఝాన్సీ వంట గదిలోంచి మూడు కాఫీలు తెచ్చి ముగ్గురికీ ఇచ్చింది.

"భైరవి తను చేసిన ఛండాలపు పని మీకు చెప్పిందా" అంటూ ఒక్కసారిగా ప్రశ్నించాడు. కాంతమ్మగారు అప్రయత్నంగా తల ఊపింది. గాంధీగారు "అది తను తనకి మనం చూసిన సంబంధం యిష్టంలేదని, ఎవరో చైతన్య అనే స్నేహితుణ్ణి ప్రేమించానని చెప్పింది. అది తొందరపడిందేమో! అంతేగాని భైరవి తప్పుపన్లు చెయ్యదు. ఆ విషయం మనందరికీ కూడా తెలుసు" అన్నాడు పరోక్షంగా.

"మీకేం మీరు ఎన్నయినా మాట్లాడతారు నాన్నా... నేను మా విశ్వనాథంగారికి నా మొహం ఎలా చూపించాలి. ఏం చెప్పాలి. నా పరువు మంటగలిపింది అది. దానికి ఇంట్లో ఆడింది ఆటా, పాడింది పాటా అయ్యింది"

"ఇలా జరుగుతుందని ఎవరం అనుకున్నాంరా... నువ్వు కంగారుపడకు. మనిద్దరం వెళ్ళి ఆయన్ని క్షమాపణలు అడుగుదాం" అని గాంధీగారు కాసేపు ఆగి, తిరిగి, "ఓ విధంగా ఈ సంబంధం తప్పిపోవడం మంచిదే అయ్యిందనుకోవాలి. వాళ్ళు మనం అనుకున్నంత మంచివాళ్ళు కాదుట. ఆ ఇంట ప్రభుత్వోద్యోగుల్లో చాలామంది తిమింగలాలేట. నీతి నియమాలు పట్టించుకోరుట" అన్నాడు.

"ఇవన్నీ ఎవరో కిట్టనివాళ్ళు నీకు చెప్పి ఉంటారు నాన్నా. విశ్వనాథంగారు పెద్దమనిషి. కాళ్ల దగ్గరకు బంగారంలాంటి సంబంధం వస్తే అదీ మీరూ కలిసి కాలదన్నారు. మన భైరవి ప్రియుడు చైతన్య గురించి కూడా నాకు చాలా తెలుసు"

"అసలు విషయం వదిలేసి... యివన్నీ దేనికిరా సత్యం... నువ్వు దాన్నీ, మమ్మల్నీ కూడా అర్థంచేసుకో. భైరవి చిన్నపిల్లకాదు. మెడలు వంచి పెళ్ళిచేయడానికి"

"నాన్న గట్టిగా చెబితే అది నోరు మూసుకుని పడుండేది. నేను భాస్కరం అన్నయ్యకు ఉత్తరం రాశాను. అన్నయ్య కూడా ఈ సంబంధాన్ని ఓ.కే. చేశాడు. తను హైదరాబాద్ వస్తానని ఫోన్ చేసి చెప్పాడు. ఆయన ఆ పని చేయలేదు" గాంధీగారు తననితను అదుపులో పెట్టుకుంటూ అన్నాడు. "ఎవరికయినా కొంతవరకే చెప్పడం పెద్దమనిషి తరహా అన్పించుకుంటుంది. నాకు నా అభిప్రాయాలు బలవంతంగా ఎవరిమీదా రుద్దడం చేయాలనిపించదు. ఈ విషయంలో నాకు మీరెంతో, భైరవీ అంతే"

"అంతేనంటారా? "

"సత్యం నువ్వు కోపం తెచ్చుకోకురా" అంది తిరిగి కాంతమ్మ.

"నువ్వు ఊరుకో అమ్మా... నామాట చెప్తున్నాను. దాని పెళ్ళి ఆ చైతన్యతో ఈ ఇంట జరగడానికి వీల్లేదు. నేను జరగనివ్వను. మీ ఇద్దరికీ నచ్చితే దాన్ని తీసుకు వెళ్ళి ఆ పెళ్లేదో ఉయ్యూరులో చేయండి. అంతే"

గాంధీగారూ, కాంతమ్మగారూ మాట్లాడలేదు. బొమ్మల్లా చూస్తూ ఉండిపోయారు.

"అది కాదండీ, నా మాట వినండి. ఇది మంచిది కాదు" అంటూ ఝాన్సీ ఏదో చెప్పబోయింది.

"ఝాన్సీ- యూ డోంట్ ఇంటర్‌ఫియర్ ఇన్ దిస్ ఎఫైర్... యూ ప్లీజ్ గెటవుట్ ఆఫ్ దిస్ ప్లేస్" అన్నాడు కటువుగా సత్య మూర్తి.

ఝాన్సీ ఆశ్చర్యంగా భర్త మొహంలోకి చూసింది. ఆమెకు ఆ మాటలు చెంపదెబ్బలా తగిలినట్టు అయ్యింది. 'సారీ' అని మాత్రం చెప్పి ఝాన్సీ అక్కడినుంచి తన గదిలోకి వెళ్ళిపోయింది. అప్పుడే భైరవి తన గదిలోంచి వచ్చింది. ఓసారి అక్కడి మనుష్యుల్నీ, వాతావరణాన్నీ చూసింది. చెవినపడ్డ మాటలు గుర్తుకు వస్తున్నా తమాయించుకుని నెమ్మదిగా, "చూడు అన్నయ్యా... నా విషయంలో నువ్వు అమ్మతో నాన్నతో ఘర్షణపడొద్దు. ఇందులో వాళ్ళ ప్రమేయం ఏంలేదు. ఇది పూర్తిగా నా స్వవిషయం" అంది.

"నేను నీకు తెచ్చింది అణాకాణీ సంబంధం అనుకున్నావా? అతగాడు చదువుకున్నవాడు. జూనియర్ ఇంజనీర్ తెలుసా? "

"ఒకవేళ నాకు నువ్వు ప్రయిమ్ మినిస్టర్‌తో పెళ్ళి జరిపిస్తానన్నా నేను ఈ మాటే అనేదాన్ని"

"నీకు పొగరే. అనవా? ఏమైనా అంటావ్? చదువు చెప్పించాను. ఉద్యోగం వేయించాను కదూ"

"అన్నయ్యా, చైతన్య కూడా చదువుకున్నవాడు. ఉద్యోగస్థుడు. చెప్పు అతనిలో నీకు ఏ చెడుగుణాలు కన్పించాయి? "

"అతను చాలాసార్లు నన్ను కరప్షన్ కేసుల్లో పట్టుకోవాలనీ, ఇరికించాలనీ చూశాడు. నా గౌరవాన్ని దెబ్బతీయాలనుకున్నాడు- నేను నా అదృష్టం బావుండి బయటపడగల్గాను"

"అతను తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించాడు. ప్రత్యేకించి అతనికి నీమీద వైరం ఏంఉండదుగా"

"అది నాకు అనవసరం"

"నాకు అతను మంచి స్నేహితుడు. మేం పెళ్ళి చేసుకోవాలనుకున్నాం. చేసుకుంటాం"

"ఊరుకో భైరవీ. అన్నయ్యకు నేను చెబుతాను. మీరు దెబ్బలాడుకోకండి" అంది కాంతమ్మగారు.

"ఇది దెబ్బలాటకాదమ్మా... అన్నయ్య అన్యాయంగా నామీదా, అతనిమీదా" అని భైరవి ఆగిపోయింది.

"చూడు భైరవీ... నువ్వు ఏ గంగలో దూకుతావో నాకు అనవసరం. నీ గురించి నాకేం చెప్పొద్దు. మనిద్దరికీ ఈ రోజుతో చెడినట్టే" అంటూ, సత్యమూర్తి కుర్చీలోంచి లేచి బయటకు వెళ్ళిపోయాడు.

కాంతమ్మగారు లేచి భైరవి దగ్గరకు వెళ్ళి "ఏమిటే ఇది" అంది, దుఃఖాన్ని గొంతుకలో దాచుకునే ప్రయత్నం చేస్తూ!

"నువ్వు చెప్పమ్మా... నేనేం తప్పుచేశాను. కాని పని చేశానా? "

"భైరవీ నువ్వు బాధపడకు. కళ్ళు తుడుచుకో. వాడి తరహాయే అంత" అన్నాడు ఓదార్పుగా గాంధీగారు.

"నాన్నా నేనూ, చైతన్యా రిజిస్టర్ మేరేజ్ చేసుకుంటాం. మీరు పీటలమీద కూర్చుని, నాకు కన్నెధార పోసి పెళ్ళిచేసి అన్నయ్యతో విరోధం తెచ్చుకోవద్దు" అంది ఓ నిర్ణయానికి వచ్చినదానిలా.

గాంధీగారికి ఆవేశం వచ్చింది. లోపలి బాధని అదుపులో పెట్టుకుంటూనే, "భైరవీ- వాడికి నేనెందుకు భయపడాలి. నా కూతురి పెళ్ళి నాకు నచ్చినట్టు నాకు నచ్చినచోట చేస్తాను. నీకు అన్నయ్య లేక పోయినా అమ్మ, నేనూ ఉన్నాం. మనం ఉయ్యూరు వెడదాం" అన్నాడు.

"కాదు నాన్నా. చిన్నన్నయ్య సంగతి నీకు తెలుసు. ఎంతైనా వాడు నీ కన్నకొడుకు. నా మూలంగా నా పెళ్ళిమూలంగా



ఇంట్లో కలతలు రేగడం నాకిష్టంలేదు. ఈ వయసులో మీరు బాధలు పడకూడదు. నిశ్చింతగా బతకాలి. అది నా ఆశ"

"ఫర్వాలేదు భైరవీ నీకోసం- వీడిని వదులుకోవడం నాకు పెద్ద పనేంకాదు. అమ్మా, నేనూ మన ఊరు వెళ్ళిపోతాం అంతగా అయితే"

"వద్దు నాన్నా... నీకు తెలియదా... ప్రేమ అనేది చాలా త్యాగాలు కోరుతుంది. అందుకు నేను సిద్ధపడాలిగాని మిమ్మల్ని అనాథలు కమ్మని అనకూడదు. నువ్వూ, అమ్మా, వదినా నా మేలుకోరితే చాలు"

"అదికాదు నీ ముద్దూముచ్చటా మాటేమిటి? " అంది కాంతమ్మగారు కళ్ళు తుడుచుకుంటూ.

"అన్నీ అవే జరుగుతాయమ్మా... నువ్వు ఏడవకు. నేనూ, చైతన్యా ఈ ఊర్లోనే ఉంటాం. నేనూ అతనూ మిమ్మల్ని చూడడానికి వస్తాం" అని భైరవి తండ్రి దగ్గరకు వెళ్ళి "ఊ అను నాన్నా... నేను చెప్పినట్టు చేస్తానని" అంటూ ఆయన చేతులు పుచ్చుకుంది.

"సరేనమ్మా. నీ ఇష్టం"

"సాయంత్రం నువ్వూ, అమ్మా బిర్లామందిర్‌కి రండి. నేను చైతన్యని అక్కడికి తీసుకువస్తాను. మీరు అతనితో మాట్లాడండి. సరేనా నాన్నా" అని అడిగింది.

గాంధీగారు తల ఊపారు.

"భైరవీ... మరి వదిన" అని కాంతమ్మగారు ఆగిపోయింది. అప్పుడే తన గదిలోంచి ఝాన్సీ అక్కడికి వచ్చింది. భైరవికి దగ్గరగా వెళ్ళి ఆమెను తనలోకి తీసుకుని, "అత్తయ్యా-భైరవి చెప్పినట్టు మనం చేద్దాం. భైరవి తెలివైంది. ధైర్యస్థురాలు. తప్పకుండా ఆమె సుఖపడుతుంది" అంది. ఆ పైన ఆమెను తన కూడా తన గదిలోకి తీసుకువెళ్ళింది.



సికింద్రాబాద్ స్టేషన్‌లో విశాఖ ఎక్స్‌ప్రెస్ దిగిన భాస్కరం, రాధా ఓ ఆటో మాట్లాడుకుని సీతాఫలమండీలోని సత్యమూర్తి ఇంటిముందు దిగారు. గేటు తెరుచుకుని లోపలికి వెళ్ళారు. భాస్కరం 'నాన్నగారూ, అమ్మా' అంటూ తలుపు తట్టాడు. కాంతమ్మగారు తలుపు తెరిచి, కొడుకునూ, కోడల్నీ చూసి 'మీరా ఎవరో అనుకున్నాను సుమా, రండి' అంటూ ఆహ్వానించి ఆ పైన లోపలికి చూసి, "ఏమండీ పెద్దబ్బాయీ, కోడలూ వచ్చారు" అంటూ చిన్నగా కేకపెట్టింది" కూర్చోరా, కూర్చో అమ్మా" అంటూ సోఫా చూపించింది.

భాస్కరం, రాధా సోఫాలో తల్లికి అటూ ఇటూ కూర్చున్నారు. అంతలోనే ఝాన్సీ లోపలినుంచి వచ్చి బావగార్నీ తోడికోడలినీ పలకరించింది.

"ఝాన్సీ... మి ఆయన ఇల్లుకట్టాడని తెలిసిందిగానీ ఇంత పెద్ద ఇల్లు అని అనుకోలేదు. వాడు అదృష్టజాతకుడు. వాడి కుడిచేతిలో జెర్రిపోతులాంటి ఫేట్ లైన్ వుంది. వాడు పట్టిందల్లా బంగారం అవుతుందని నేను అప్పట్లోనే అనేవాణ్ణి. అది

నిజమయింది"

"మరిదిగారూ, భైరవీ ఆఫీసుకు వెళ్లారా? " రాధ అడిగింది.

"అవును. మీ మరిది భోజనానికి వస్తా మన్నారు"

అప్పుడే లోపలినుంచి గాంధీగారు వచ్చారు. భాస్కరం, రాధా సోఫాలోంచి లేచి ఆయనకు నమస్కారాలు చేశారు. "ఎలా ఉన్నారు? " అని ఒకేసారి ఇద్దరూ గాంధీగారిని ప్రశ్నించారు.

"బాగానే ఉన్నాను"

"మీకూ అమ్మకూ సత్యం అంటేనే ఇష్టం. అందుకే ఇక్కడ ఉంటున్నారు. అదే మేం అడిగితే మా దగ్గరకు రావడానికి మీకు ఏనాడూ వీలు చిక్కలేదు"

"అదేం మాటరా... నీకు తెలియదా... నాన్నగారు సర్వీసులో ఉండగా గుమ్మం దాటి పట్టుమని పదిరోజులు ఎవరింట్లో ఉండలేదు. మీ ఊరూ వస్తాం. మాకు వాడెంతో నువ్వూ అంతే. పైగా ఝాన్సీ సంగతి తెలుసుగా వట్టి మనిషి కాదు. అందుకే ఎటూ పోవడంలేదు"

"అత్తయ్యగారూ... ఝాన్సీకి ఐదోనెల వచ్చి ఉండాలి. కానీ వళ్లు చేయలేదు" అని ఝాన్సీని చూసి "ఏం అమ్మా నువ్వు చూస్తే గట్టిగా తింటోన్నట్టు అన్పించడంలేదు. వచ్చిన తరువాత మామరిదిని నిలబె ట్టమంటావా ఏమిటీ చెప్పు"

"వాడూ మరదలూ డబ్బు వెనకేయడం ఓ ఉద్యమంగా పెట్టుకున్నారేమో మనకు ఎలా తెలుస్తుంది" భాస్కరం నవ్వేశాడు.

కాంతమ్మగారు రాధను చూసి, "నువ్వు వెళ్ళి బట్టలు మార్చుకుని స్నానం చేసిరా అమ్మా... నేను కాఫీ కలిపి తెస్తాను" అంటూ సోఫాలోంచి లేచింది.

"ఈవేళా రేపూ వంటింటి చార్జి నేను తీసుకుంటాను అత్తయ్యా మీరు కూర్చోండి. పద ఝాన్సీ... కాస్త మీ వంటింటిని పరి చయం చేయి చాలు"

రాధా, ఝాన్సీ వంటింటివైపు వెళ్ళారు. వారి వెనకే కాంతమ్మగారూ లేచింది. భాస్కరం ఓ క్షణం ఆగి, "నాన్నగారూ? " అన్నాడు.

"ఏమిటి? "

"సత్యం ఉత్తరం రాశాడు. భైరవి ఇలా చేస్తుందని నేను అనుకోలేదు" గాంధీగారు మాట్లాడలేదు.

"చదువుకుంది. చేతిలో మంచి ఉద్యోగం ఉంది. అందుకే అది స్వతంత్రం ప్రకటించు కుంది"

"పోలికలు ఎక్కడికి పోతాయి. మీ అన్న దమ్ములిద్దరూ ఏనాడో సర్వస్వతంత్రుల య్యారు. అది మీ చెల్లెలేగా"

"అదేమిటి నాన్నగారూ నిష్ఠూరంగా మాట్లాడతారు. మేం చదువుకునే రోజుల్లో గానీ మా పెళ్ళిళ్ళ విషయంలోగానీ మేం ఏ రోజైనా మీ మాటకు ఎదురు చెప్పామా? "

"ఎందుకులే- అవన్నీ... కడుపు చించు కుంటే అది కాళ్ళమీదే పడుతుంది." "మా విషయంలో మీరెప్పుడూ నిష్కర్షగా ఉండే వారు. అలాంటిది..." భాస్కరం ఆగిపో యాడు.

"ఆదర్శాల విషయంలోనే నేను మీతో భేటీ పడేవాణ్ణి. కానీ భైరవి విషయంలో ఎదురయిన సమస్య చాలా చిన్నది. అవునా కాదా, చెప్పు" అన్నాడు సూటిగా గాంధీగారు.

"వాడు- మంచి సంబంధం చూశానని రాస్తే నేనూ రాధా చాలా సంతోషించాం. కట్నం ఎక్కువయినా మన పొలం అమ్మేస్తే డబ్బు ఇబ్బంది వుండదనీ వాడు రాసాడు కానీ"

"భాస్కరం-అసలు ఆ సంబంధం వాడు అనుకున్నంత గొప్పదేం కాదు"

"వాళ్ళు కలిగిన వాళ్లుట. పైగా పెళ్ళికొ డుకు మంచి ఉద్యోగం చేస్తున్నాట్ట. అంత కన్నా మనకు కావల్సింది ఏ ముంటుంది? "

"కానీ మన భైరవి తనకు తానుగా

చైతన్య అనే అబ్బాయిని ఎంచుకుంది. అతగాడూ మంచి ఉద్యోగమే చేస్తున్నాడు"

"నాకు మీ మనసు తెలుసు నాన్నగారూ... మీకు మన పొలం అమ్మడం ఇష్టంలేదు. ఇంకా"

"కట్నం తీసుకున్నవాడి కాళ్ళుకడిగి పిల్లను కన్యాదానం ఇవ్వడం ఎందుకో నాకు మంచి పని అని అన్పించదు. పైగా అది నోరు తెరిచి తన మనసులోమాట చెప్పగానే దాని ముద్దు చెల్లించాలనిపించింది"

"అది చిన్నపిల్ల... మనం దానికి నచ్చచెప్పాలి. దారికి తీసుకురావాలి అది సయ్ అంటే మనం సయ్ అనడం మంచిది కాదేమో"

గాంధీగారు చిన్నగా నవ్వేశారు "రేపు నీ పిల్లలు పెద్దవాళ్ళవుతారు. పెళ్ళికి ఎదుగుతారు. అప్పుడు నువ్వు వాళ్లతో నిష్కర్షగా ఉండగలవా? వాళ్ళ ముద్దు చెల్లించవా. ఏ తల్లిదండ్రులకైనా పిల్లలమీద ప్రేమ పిల్లలు ఎదిగినట్టే వాళ్లతోపాటు ఎదిగి పాదులు వేస్తుందిరా"

భాస్కరం తండ్రిమొహంలోకి ఓసారి చూసి, చప్పున తలవంచుకున్నాడు. అప్పుడే లోపలనుంచి రాధ కాఫీలు తెచ్చి మామగారికీ భర్తకీ ఇచ్చి

"ఏమిటి మామయ్యగారితో భేటీకి దిగారా? " అనేసింది.

"ఏంలేదు. మామూలు మాటలే"

"మీరు వెళ్ళి స్నానం చేయండి" అంది రాధ.

"మీరు కూడా లేచి మీ పూజా కార్యక్రమం మొదలుపెట్టండి" అంది కాంతమ్మ అటుగా వచ్చి

గాంధీగారు సోఫాలోంచి పూజగదిలోకి వెళ్ళాడు. కాంతమ్మగారు భర్తవెనకే వెళ్ళబోయింది. అయితే భాస్కరం-తల్లిని చూస్తూ "అమ్మా" అన్నాడు.

"ఏమిటిరా"

"కూర్చో అమ్మా- చెబుతాను"

కాంతమ్మగారు అక్కడే నిలబడ్డ రాధవైపు చూసింది.

"నువ్వు వంట పని చూడు రాధా... నేను అమ్మతో మాట్లాడాలి"

"సరే" అంటూ రాధ లోపలికి వెళ్ళింది.

భాస్కరం నెమ్మదిగా, "ఇదంతా ఏమిటమ్మా... అసలు ఏం జరిగింది? "

"నాన్నగారు చెప్పలేదా? "

"అదికాదమ్మా... మీ కడుపున పుట్టిన మేం ఝుగ్గురం కూడా ఏదో విధంగా మీకు మనశ్శాంతి లేకుండానే చేస్తూ వస్తున్నాం. అదే నాకు బాధగా ఉంది"

"ఏది ఎలా జరగాలో అలా జరిగి తీరుతుంది. ఎవరూ దేన్నీ ఆపలేరురా"

అమ్మా... నువ్వూ నాన్నగారూ మాతో పాటు విశాఖపట్టణం వచ్చెయ్యండి"

"ఇక్కడ పరిస్థితులు తెలిసీ- మళ్ళీ అలా మాట్లాడితే ఎలారా? "

సరిగ్గా అప్పుడే బయటనుంచి సత్యమూర్తి లోపలికి వచ్చి, డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్న అన్నగార్ని చూసి "ఎప్పుడొచ్చావ్ అన్నయ్యా అంతా కులాసానా" అంటూ పక్క సోఫాలో కూర్చున్నాడు.

"నీ ఉత్తరం చూడగానే నాకు కాళ్ళూ చేతులూ ఆడలేదురా. అందుకే నేనూ మీ వదినా పరిగెత్తుకువచ్చాం"

"నువ్వూ వదినా కలిసి భైరవికి బాగా గడ్డి పెడతారనే నేను మీకు ఉత్తరం రాశాను"

"నీకు అంత కోపం పనికిరాదురా, సత్యం" అన్నాడు, నెమ్మదిగా, భాస్కరం.

"నువ్వూ ఆ మాటే అంటున్నావా? నాన్నగారి మొహం, అమ్మ మొహం చూసి ఊరుకున్నానుగానీ లేకపోతేనా"

"తప్పురా... ఎంత తోస్తే అంత మాట్లాడ్డమేనా? " అంది కాంతమ్మ.

"నీకు తెలియదమ్మా... దయుంచి నువ్వు లోపలికి వెళ్లు... నేను అన్నయ్యతో మాట్లాడాలి"

"సరే... మీ ఇష్టం" అని కాంతమ్మ అక్క





# ఏరినముత్యాలు

★ కష్టాలలో వెనుకటి సుఖాన్ని గుర్తుచేసుకోవడం కన్నా గుండెకోత మరొకటి లేదు

– డాంటే

★ జీవిత గానానికి కన్నీరు పల్లవి. చిరునవ్వు అనుపల్లవి.

– డా॥ఎస్. రాధాకృష్ణ

★ నొప్పి లేని చికిత్స, ముళ్లు లేని సింహాసనం, దూషణ లేని కీర్తి లేదు.

– విలియం పెన్

★ అధికారం ఎక్కువయిన కొద్దీ దుర్వినియోగం జరిగి ఉపద్రవాలు సంభవించడానికి అవకాశం ఉంది.

– ఎడ్మండ్ బర్క్

★ ఆశను విస్మరించినవారికే శాంతి యొక్క అనుభవాలు తెలుస్తాయి.

– స్వామీ ప్రభవానంద

★ మనలో ఓడు పోవాలేకానీ మనం ఓడిపోకూడదు.

– జిల్లెళ్లమూడి అమ్మ

★ తుపానులో ప్రయాణంచేస్తున్న విమానం లాంటిది వృద్ధాప్యం. ఎక్కిన తరువాత చేయగలిగినది ఏమీలేదు.

– గోల్డ్‌మెయిర్

★ ఉదయం లేచింది మొదలు కీటకం లాగ ఎవరి వృత్తిని వారు సక్రమంగా నిర్వర్తించడం ముఖ్యం. అదే ముక్తికి మార్గం.

– స్వామీ వివేకానంద

★ గొప్ప అంశాలు రూపొందే కర్మాగారం మౌనం.

– కార్లైల్

★ ప్రతిభావంతులైన వారి ప్రతిమాటలోనూ మనం చెప్పలేక తోసిపుచ్చిన భావాలే తిరిగి హుందాగా మనకు సాక్షాత్కరిస్తాయి.

– ఎమర్సన్

★ ఎక్కువ ఆదాయం గలవారు మాత్రమే అనుభవించగల భోగం కోపం.

– జార్జివిలియం కర్టిస్

★ అమర్యాదగా జీవించడంకంటే గౌరవంగా చనిపోవడం మేలు.

– టాసిబస్

★ మూర్ఖుడు కూడా శాంతంగా ఉంటే వివేకి కిందే లెఖ్ఖ

– ఓల్డ్ టెస్టిమెంట్

★ నిజం తెలుసుకోవడం కష్ట సాధ్యమే. అయినా తొందరపాటు నిర్ణయాలకంటే అది మంచిది.

– ఒక సామెత

★ మనలో కుళ్లు పోవాలికానీ మనం కుళ్లి పోకూడదు.

– జిల్లెళ్లమూడి అమ్మ

సేకరణ : సువర్చల

డినుంచి లేచి లోపలికి వెళ్లింది.

"అన్నయ్యా, నువ్వు భైరవికి ఫోన్‌చేసి ఇంటికి రమ్మనమని చెప్పు. ఈవేళ ఏదో ఒకటి తేలిపోవాలి" అన్నాడు కటువుగా సత్యమూర్తి.

"నేనోమాట చెప్తాను. వింటావా సత్యం?"

"చెప్పు"

"నేను భోజనం చేసి భైరవీవాళ్ళ ఆఫీసుకు వెడదామనుకుంటున్నాను. అన్ని విషయాలూ దానితో మాట్లాడతాను. నువ్వు మాత్రం ఆవేశపడొద్దు"

"ఏం మాట్లాడతావ్?"

"అయితే చెప్తాను. కానీ ఓ షరతు. నా మాటలు విని నువ్వు కోపంతెచ్చుకో కూడదు. బాధపడకూడదు. సరేనా?"

సత్యమూర్తి తల ఊపాడు అయిష్టంగానే!

"నువ్వు మన చెల్లాయికి దానిమీద ప్రేమతోనే నువ్వు సంబంధం తెచ్చి ఉండచ్చు. అది గొప్పదే కావచ్చు. కానీ మనసులేనివాడిని కట్టుకుని అదేం సుఖపడుతుందో ఆలోచించావా?" అని ఓ క్షణం ఆగి, తిరిగి అన్నాడు, "నాకు తెలుసు సత్యం. అది నీకు నచ్చనివాణ్ణి పైగా నీ శత్రువును ప్రేమించింది. అదే కదా నీ కోపానికీ ఆవేశానికీ కారణం?"

"అన్నీ తెలిసి అది ఇలా చేయవచ్చా. నేనూ, ఝాన్సీ దానికేం లోటు చెయ్యలేదే. ప్రేమగానే చూశామే. ఇది ఏమటంటావ్? పరోక్షంగా మొహంమీద కొట్టడమే కదా?"

భాస్కరం ఒక్కసారిగా నవ్వేశాడు. నవ్వు ఆపుకుని, "సత్యం నీలో వున్నది అమాయకత్వమో, వెర్రితనమో నాకు అర్థం కావడం లేదు. నిజం చెప్పు? నువ్వు ఎవరి భరోసా చూసుకుని దానికి ఇలాంటి గొప్పింటి సంబంధం చూశావ్. పైగా పది లక్షల కట్నం యివ్వాలా మనం"

"అది కాదు అన్నయ్యా..."

"నువ్వు రెండు చేతులా గడిస్తూ ఉండొచ్చు. కానీ రోజులు ఒకలాగే ఉండవు. నీ భార్యా, నీకు పుట్టబోయే పిల్లలూ వాళ్ళ భవిష్యత్ మాట ఏమిటిరా?"

"మన ఊళ్లోవున్న పొలంలో కొంత అమ్మేద్దాం. తక్కువ పడ్డది నువ్వూ నేనూ సరిసమానంగా భరిద్దాం. అంతే కదా?"

"నేను చాలా ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నాను. నీ సంగతేమోగానీ నాకు పొలంలో వచ్చే వాటాయే ఆధారం. అయినా కాగలకార్యం గంధర్వులే తీరుస్తారు అన్నట్టు భైరవి తనుగా ఒకణ్ణి ఎన్నుకుంది. ఆ అబ్బాయికి కట్నం యివ్వవల్సిన అవసరం తప్పుతుంది. ఆలోచించు"

"ఆ పెళ్ళి కొడుకు తల్లిదండ్రులు నాకు ఆప్తులకన్నా ఎక్కువ. నేనంటే ప్రాణం పెడతారు. పైగా నా ఫ్యూచర్ ఆయన చేతుల్లో వుంది. కట్నంగా కొంత నా చేతిలో డబ్బు పడ్డా పరోక్షంగా ఆయన ఉపకారం చేయకుండా ఉండే మనిషి కాదు"

"మన దగ్గర ఉన్నది కాస్తా ఊడ్చుకుని గాలిలో దీపం పెట్టడం దేనికిరా. రేపు ఏది ఎటు అయినా నువ్వు ఏమవుతావో ఆలోచించు"

"నువ్వు ఇలా మాట్లాడతావనుకోలేదు అన్నయ్యా"

"నువ్వు ఇలా పంతానికి పోతావని నేనూ అనుకోలేదు. దానికి బుద్ధిచెప్పి దారికి తెస్తావనుకున్నాను"

"భైరవి ఉద్యోగంచేసుకుంటోంది. డబ్బు గడిస్తోంది. ఆ అబ్బాయిదీ మంచి ఉద్యోగమే. పైగా మన బావ ఎ.సి.బి. మనిషయితే మనకే లాభం. నువ్వు అతనితో మంచిగా ఉంటే అతనూ రేపు నీకూ ఉపయోగపడొచ్చు. సత్యం కొండను తవ్వి ఎలకను పట్టొద్దురా. నా మాట విను"

సత్యమూర్తి కాసేపు దిక్కులు చూశాడు! ఆ పైన తలవంచుకున్నాడు. చాలా సేపు ఆలోచించాడు. అయినా అతనిలోని




పంతం,ఉక్రోషం మాత్రం బింకంగానే ఉన్నాయి. మంకుపట్టు వదలడమూలేదు!!

★ ★ ★

విశాఖపట్టణం నుంచి వచ్చిన పెద్ద అన్నగారూ, వదినా తన ఆఫీసుకు వచ్చి తనతో మాట్లాడాలనీ ఇందిరా పార్క్కు వెడదామనీ అనడంతో భైరవి మొదట ఆశ్చర్యపోయింది. అయినా ధైర్యం తెచ్చుకుని వాళ్ళతోపాటు ఆటో ఎక్కింది! పార్క్కు వెళ్ళిన ముగ్గురూ ఓ ఖాళీ ప్రదేశంలో ఎవరూ లేని చోట కూర్చున్నారు.

"ఏం జరిగింది భైరవీ? ఎందుకంటే ఇంట్లో ఎవరూ కూడా సరిగ్గా చెప్పడంలేదు. నువ్వు మనసువిప్పి మాతో చెబితే-మాకు తోచిన మంచి మాటో, సహాయమో చేయడానికి మాకు వీలవుతుంది. మమ్మల్ని నమ్ము" అంది రాధ ఆప్యాయంగా.

భైరవి తలవంచుకుని, "జరిగినవన్నీ చిన్నన్నయ్య మీకు ఉత్తరంలో రాసివుండాలే" అంది.

"రాశాడనుకో... కానీ ఆ ఉత్తరంలో వాడి గొంతుకే వినబడింది. నీనోటివెంట వినేది మరోరకంగా ఉండొచ్చుకదా" అన్నాడు భాస్కరం.

"నిన్ను సాధించాలని మేం అంతదూరం నుంచి ఇక్కడకు రాలేదు, భైరవీ... నిజం చెప్తున్నాను. నేనూ మీ అన్నయ్యా నీ తరపున నిలబడతాం. మీ చిన్నన్నయ్య, తన మనసు తిప్పుకునేటట్టు చేయడానికి ప్రయత్నిస్తాం"

భైరవి ఆశ్చర్యంగా అన్నా వదినల మొహాల్లోకి చూసింది. ఆపైన నెమ్మదిగా జరిగిందంతా చెప్పింది.

"ఇందులో నువ్వు చేసిన తప్పేంలేదు. హృదయపూర్వకంగా నిన్ను ప్రేమించి చేయిపుచ్చుకుని నడిపిస్తానన్నవాడికి దగ్గరయ్యావే. రేపు ఇదే పని నా కూతురు చేసినా నేను దాన్ని సమర్థిస్తాను"

"థాంక్యూ అన్నయ్యా"

"నీకు ఇక్కడ అంతగా ఇబ్బంది అనిపిస్తే నువ్వూ, నాన్నగారూ అమ్మా మా విశాఖపట్టణం వచ్చెయ్యండి. అక్కడ నా ఇంట్లో నీ పెళ్లి జరిపిస్తాను."

"అవును భైరవీ" అంది లాలనగా రాధ.

"నీకుకూడా మా ఇద్దరి తరపునా థాంక్స్ చెబుతున్నాను వదినా"

"అదిసరే మా తమ్ముణ్ణి మాకు ఎప్పుడు చూపిస్తావు? నీ సెలక్షన్ ఎలాంటిదో చూడాలని ఉంది మరదలా"

"నా చెల్లెలు మనుషుల్ని ఎన్నిక చేయడంలో ఎవరికీ తీసిపోదు. నీకు తెలుసో తెలియదో" అన్నాడు భాస్కరం.

"ఆ విషయం నాకు తెలుసండీ. భైరవి నా అంత తెలివి తక్కువదికాదు. నేను కాబట్టి మన పెళ్లి చూపులనాడు నా కళ్లు నన్ను వెర్రిదాన్ని చేసి ఆడిస్తే ఇట్టే బుట్టలో పడ్డాను" అంది రాధ నవ్వేస్తూ.

"చూడు భైరవీ! మీ వదినకు వయసు పెరుగుతున్నా సిగ్గు మాత్రం తగ్గ మొహం పడుతోంది.."

"అదేం కాదు అన్నయ్యా! మా వదిన బంగారం. నిన్ను మాటలతో ఆట పట్టిస్తుంది కానీ ఆమె మనసు వెన్న" అంటూ భైరవి రాధ భుజం మీద వాలింది. అప్పుడు భైరవికి వదినగారు కట్టుకున్న చీర, బోసిగా ఉన్న ఆమె మెడ, సాదాసీదా గాజులతో ఉన్న రెండు చేతులూ దీనంగా కనిపించాయి.

"వదినా! నువ్వేమిటీ ఇలా... అదే మెడలో నగానట్రా లేకుండా ఉన్నావ్. రైలుప్రయాణం అని జాగ్రత్తలు తీసుకున్నావా?"

"ఇందులో రహస్యం మీ అన్నయ్యే విప్పి చెప్పగలరు."

భాస్కరం తలొంచుకుని "ఏం చెప్పను భైరవీ! నావల్ల చాలా పొరపాట్లు జరిగాయి. నేను ఒళ్లూ పై తెలియకుండా ప్రవర్తించాను. తగిన శాస్తి జరిగింది. ఆ పర్యవసానం మీ వదినగారి మీద కూడా పడింది"



"మామయ్యగారు నీకు చెప్పే ఉండాలి. మీ అన్నయ్య పైఅధికారి ఈయనని ఓ ఫ్రాడ్ కేసులో ఇరికించాడు. దాంతో..." అని రాధ మాటలు రాక ఆగిపోయింది.

"నాకు కొంతవరకే తెలుసు. నాన్నగారు నిన్ను బాగా మందలించిన విషయం అమ్మ చెప్పింది అన్నయ్యా"

"ఆయన తప్పేంలేదు"

"నాన్నకి తనవాళ్లు అన్నవాళ్లందరూ ఎప్పుడూ కడిగిన ముత్యాల్లా కనబడాలని ఆశపడతారు. ఎదుటివాళ్లలో చిన్నపాటి పొరపాటునూ, తొట్రుపాటునూ ఆయన తట్టుకోలేరు."

"అవును భైరవీ!" అంటూ రాధ చాలా సేపు తన కుటుంబం గురించీ, పిల్లల గురించీ చెప్పింది. భాస్కరం చేతి వాచీ చూసుకుని "రాధా! మనం వెడదాం లే. మనగురించి ఇంట్లో ఎదురు చూస్తూ ఉంటారు." అన్నాడు. ముగ్గురూ లేచారు. పార్కు బయటకి వచ్చారు.

★ ★ ★

ఆ సాయంత్రం గాంధీగారూ, కాంతమ్మా, భాస్కరం, రాధా, సత్యమూర్తీ ఇంటి డాబా మీద బరకాలు వేసుకుని కూర్చున్నారు. అప్పటికే సత్యమూర్తి పదేపదే భైరవి పెళ్లి విషయంలో తండ్రితో, అన్నగారితో భేటీ పడ్డాడు. ఎవరు చెప్పినా తన ధోరణిలో తను మాట్లాడాడు.

"భైరవి ఆ చైతన్యని పెళ్లి చేసుకోవడం నాకు సుతరామూ ఇష్టంలేదు. ఒకవేళ అది మంకు పట్టు పడితే అది నా ఇంట్లో ఉండ డానికి వీల్లేదు. మీరెవరు ఏమనుకున్నా నేను లెఖ్ఖ చెయ్యను"

"ఇది చిన్న విషయంరా. దాని పెళ్లి విషయంలో ఇంటిల్లపాదిమీ రాజీ పడుతు న్నామే. నువ్వు ఇలా తిక్కగా మాట్లాడితే ఏంబావుంటుంది? రేపు నువ్వూ తండ్రివి కాబోతున్నావు."

"నువ్వు చెప్పద్దమ్మా, నేను వినను."

"సరేరా నీ ఇష్టం. మేం అయితే దాని తరపునే మాట్లాడతాం, నిలబడతాం" గాంధీ గారు అన్నారు

"సత్యం! నువ్వు మరోసారి ఆలోచించు"

"నాకు ఎవరూ ఏంచెప్పద్దు. నేను వెళుతు న్నాను" అంటూ సత్యమూర్తి విసవిసా కిందకు వెళ్లిపోయాడు.

"వీడు చాలా మారాడు కాంతం" అన్నాడు దిగులుగా గాంధీగారు.

"ఏంచేస్తాం? ఇదంతా మన దురదృష్టం"

"అమ్మా! మేం ఇక్కడకు వచ్చిన పని అయినట్టే. మేం రేపు సాయంత్రం రైలు ఎక్కుతాం" అన్నాడు భాస్కరం.

"మనమైనా తన పెళ్లికి ఉండకపోతే భైరవి బాధపడుతుందేమో" రాధ అంది.

"ఉండొచ్చు కానీ ఆఫీసులో నాకు అర్జంటు పనులున్నాయి"

గాంధీగారు భాస్కరం వైపు చూసి "భాస్కరం! అక్కడ మీ ఆఫీసులో గొడవ లన్నీ సర్దు మణిగినట్టేనా? జాగ్రత్తగా ఉంటున్నావా? " అడిగాడు.

భాస్కరం మాట్లాడలేదు.

"లేదు అత్తయ్యా! ఆర్నెల్లక్రితం ఆఫీసు గొడవల్లో లెఖ్ఖలు సరిచేయడానికి ఈయన గారు లక్ష రూపాయలు అప్పు చేయాల్సివ చ్చింది. అది వడ్డీతో పెరిగి తడిసి మోపెడ వుతోంది"

"అయ్యో! ఎలా మరీ? "

"సమయానికి మా నాన్నగారు పెరాలసి స్‌తో మంచాన పడ్డారు. దాని మూలంగా ఆయన ఆర్థిక పరిస్థితీ దిగజారింది. ఏంచే యాలో తోచకుండా ఉంది." అంటూ రాధ కళ్లు ఒత్తుకుంది.

"నాన్నా! నేను తప్పు చేశాను. నిజమే. అయితే అప్పు చేసిన డబ్బు వచ్చే నెలలో వాపసు చేయాలి. లేకపోతే ఇచ్చినవాళ్లు కోర్టుకు వెళతామంటున్నారు. అమ్మా! అడు గుతున్నానని ఏమీ అనుకోవద్దు. ఎలానూ




ఉయ్యూరులో మన పొలాలు ఉన్నాయి. నాన్నగారు నా వాటాకు ఎంతివ్వదల్చుకున్నారో లెఖ్ఖలు కట్టి నా షేరు అమ్మెయ్యండి. నన్ను గట్టెక్కించండి"

గాంధీగారు కొడుకు వైపు చూశాడు అదోలా.

"క్షమించండి నాన్నా. నాకు మరోదారి కనిపించక ఈమాట మాట్లాడాను. అవసరానికి ఆదుకోని ఆస్తీ, డబ్బూ ఉండి ఏం ప్రయోజనం? "

"సరేరా! నువ్వు చెప్పవలసింది చెప్పావు. నాన్నగారు కూడా ఆలోచించాలి కదా" అంటూ కాంతమ్మ భర్త మొహంలోకి చూసింది. రాధ ఓసారి అత్తమామల్నీ, భర్తనీ చూసి "నేను కిందకి వెళతాను అత్తయ్యా! ఝూన్సీ ఒక్కత్తీ ఉంది." అని లేచి మెట్లవైపు వెళ్లింది.

గాంధీగారు కొన్నిక్షణాలు భాస్కరం మొహంలోకి చూసి "అయితే నువ్వీ ఊరు వచ్చింది ఇందుకన్నమాట. చాలా బావుందిరా నీ సలహా" అన్నారు.

"మరేం చేయమంటారు నాన్నగారూ? "

"మనకు ఆస్తి లేదనుకో. నువ్వు అప్పుడేం చేసేవాడివిరా"

"ఏం చేస్తాను. ఏ విషం మింగో, ఉరేసుకునే చచ్చేవాణ్ణి. సరేనా, నాన్నగారూ"

"ఏం మాటలురా అవి... నిండు ఇంట్లో ఇలానేనా మాట్లాడేది? " అంది బాధగా కాంతమ్మ.

"లేకపోతే ఏమిటమ్మా... భైరవికి కట్నం యిచ్చి పెళ్ళి చేయవల్సివస్తే మనం ఏం చేసేవాళ్లం... పొలంలో కొంత అమ్మేవాళ్ళం కాదా? "

"నేను కట్నాలు తీసుకుని మీ అన్నదమ్ముల పెళ్ళిళ్ళు చేయలేదురా... భైరవి విషయంలోనూ నేను నా మాట మీదే నిలబడేవాణ్ణి"

"మాటలు ఎన్ని అయినా చెప్పచ్చు నాన్నా.. అదృష్టం బావుండి, ఆ చైతన్య మన భైరవిని ప్రేమించాడు. లేకపోతే అప్పుడు తెలిసేది. అది జన్మంతా పెళ్ళి కాకుండా బతకవల్సి వచ్చేది" అని ఓ క్షణం ఆగి, "ఇంతకీ మన పొలంలో నాకు వచ్చే వాటా అమ్ముతారా లేదా చెప్పండి చాలు"

"నేను నీకు ఉత్తరం రాస్తాను"

"అమ్మా... నా మాట చెబుతున్నాను. ఓ నెలలోపు నాకు మీదగ్గరనుంచి డబ్బు వచ్చిందా సరేసరి. లేకపోతే నా వాటాను ఎలా రాబట్టుకోవాలో నాకు తెలుసు"

"అంటే నువ్వు కోర్టుకు వెడతావా"

"తప్పనిసరి పరిస్థితుల్లో వెళ్తాను"

గాంధీగారు కొడుకు మాటలతో కోపంతో ఊగిపోయాడు. అలాగే క్షణికావేశానికీ లోనయ్యాడు. అందుకే, "యూ" అంటూ ఒక్కసారిగా చేయి ఊత తీసుకుని బరకం మీద నుంచి లేచాడు. అప్పటికే ఆయన కుడి చేయి కొంత ఎత్తుకు లేచి ఆగిపోయింది.

"ఊరుకోండి... నువ్వైనా తగ్గరా భాస్కరం... కంగారుపడి కోడళ్ళు పైకి వస్తే పరువు పోతుంది సుమా" అంది సర్ది చెబుతూ కాంతమ్మ. భాస్కరం ఉడుకుమోత్తనంతో క్రీగంటితో తల్లినీ తండ్రినీ ఓసారి చూసి మెట్లవైపు అడుగులు వేశాడు. అప్పటికే సగం మెట్లు ఎక్కి పైకి వస్తూన్న భైరవి అన్నగారిని చూసింది. భాస్కరం చూశాడు!

"ఏమిటి అన్నయ్యా... అమ్మా, నాన్నా ఏరి? నువ్వు ఒక్కడివే కిందకు వస్తున్నావ్ దేనికీ? " భైరవి అనుమానంగా అడిగింది.

"ఏం లేదు..."

"నువ్వూ నాన్నగారూ" భైరవి ఆగిపోయింది.

"గొడవపడ్డాం. నాన్నగారు నామీద చేయి ఎత్తబోయారు"

"అయ్యో... అలానా... సారీ అన్నయ్యా. పద... నా గదిలోకి వెళ్ళి మాట్లాడుకుందాం" అంటూ భైరవి అన్నగారి చేయి పుచ్చుకుని తన గదిలోకి తీసుకువెళ్ళింది.



ఇద్దరూ మంచం మీద కూర్చున్నారు.

"ఏం జరిగింది అన్నయ్యా"

భాస్కరం-తండ్రికీ తనకీ మధ్య జరిగిన మాటల గురించి చెప్పాడు. ఆఖరిగా అన్నాడు. "నాకు నలభైఏళ్లు దాటాయి. ఎదిగిన పిల్లలు ఉన్నారు. అలాంటిది నేను నాకు బాధ కలిగి మాట్లాడితే ఆయన నామీద చేయి ఎత్తారు. ఈ రోజు ఎంత అవమాన పడవల్సివచ్చింది. ఛీ" అంటూ మాటలు ఆపేశాడు.

"నీకు అర్జంటుగా కావల్సింది డబ్బు... అంతే కదా? "

"అవును"

"ఆ డబ్బు నేను సర్దుతాను. నీకు ఇష్ట మేనా అన్నయ్యా? "

భాస్కరం ఆశ్చర్యంగా చెల్లెలి మొహంలోకి చూశాడు.

"చెప్పు అన్నయ్యా? "

"అది కాదు భైరవీ. న్యాయంగా నాకు మన ఆస్తిమీద హక్కులేదా"

"ఆ సంగతి నాన్నగారు ఆలోచించాలి కదా. పైగా నా పరిస్థితులు తెలుసుండీ ఆయన అలా నిమ్మకు నీరెత్తినట్టుగా ఉంటే నేనేం చేయాలి. నువ్వే చెప్పు? "

అవన్నీ తర్వాత ఆలోచిద్దాం. నా దగ్గర అంత క్యాష్ అయితే లేదు. కానీ నగలరూపంలో పదిహేను తులాలకు మించే బంగారం వుంది. ఆ బంగారం అవే గొలుసులూ, గాజులూ నెక్లెస్ నేను వాడటం లేదు. పెట్టెలో పడి ఉన్నాయి. అవి అమ్మేసి నీ పని కానిచ్చుకో"

"అమ్మా, నాన్న ఇంకా సత్యం నిన్ను ఏదైనా అంటే"

"అవి లాకర్లో పెట్టానని వాళ్ళు అనుకుంటున్నారు. వాటిని నేను వాడడం లేదని అమ్మకూ నాన్నకూ కూడా తెలుసు.

"ఎందుకని? "

"ఆ కారణం అడగొద్దు" అని భైరవి మాటలు ఆపేసి, "కానీ నాదో కోరిక ఉంది అన్నయ్యా... అది నువ్వు నెరవేరిస్తే చాలు"

"చెప్పు భైరవీ... ఏమిటీ? "

"సారీ... నీ చెల్లెల్ని అయివుండి నీకు సలహాయిస్తున్నాను. నువ్వు ఇంకెప్పుడూ అలా ప్రభుత్వం తాలూకు డబ్బు ముట్టుకోనని నాకు మాట యివ్వాలి. ఇస్తావా అన్నయ్యా? "

"నేను తప్పు చేశాను. కరప్షన్‌కు కొమ్ము కాశాను... సారీ"

"అందుకే చెబుతున్నాను అన్నయ్యా. నాన్నగారు నిన్ను తిట్టింది నీమీద కోపంతో కాదు. తనలో యిమడని బాధకి తట్టుకోలేక నీతో అలా ప్రవర్తించి ఉంటారు. మనం నాటిన మొక్క ఎదుగుతూ ఆకాశాన్ని తాకితే కల్గే ఆనందం వేరు. అలా కాకుండా అది కుక్కమూతి పిందెలు వేస్తే కలిగే క్షోభ వేరు. మన నాన్నగారు తనని ఎవరు ఏమన్నా మౌనంగానే ఉంటారు. కోపం తెచ్చుకోరు కానీ పైవాళ్లు తన సంతానాన్ని వేలెత్తి చూపితే సహించలేరు"

భాస్కరం కళ్లు పెద్దవి చేసి చెల్లెలివైపు చూశాడు.

"జవాబు చెప్పు అన్నయ్యా? "

"లేదమ్మా... ఇక నుంచి నేను నిజాయితీగా ఉద్యోగం చేస్తాను. నన్ను నమ్ము"

"థాంక్యూ" అంది భైరవి.

★ ★ ★

సత్యమూర్తి తన బావమరిదికి ఉద్యోగం వచ్చిందనీ, అతను హైదరాబాద్ తనింటికే వస్తున్నాడనీ తెలిసి తెగ సంతోషించాడు. స్టేషన్‌కువెళ్లి అతన్ని రిసీవ్ చేసుకుని ఇంటికి తీసుకువచ్చాడు. కాసేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పి ఆ తర్వాత హాస్యంగా మాట్లాడసాగాడు.

"బోసూ, నీకు ఉద్యోగం వచ్చింది. ఇక పెళ్లి కూడా చేసేసుకోవచ్చు ఇప్పటికే చాలా మంది నీ గురించి అడుగుతున్నారు. నీ రేటు ఎంతో చెబితే బావుంటుంది. మొహమాటపడకు"





"మాకు పెద్ద ఆశలు లేవు. వాడికి తోడుగా మా వాళ్లకు అండగా ఉండే అమ్మాయి దొరికితే చాలు" అంది ఝాన్సీ.

"ఈ కబుర్లకేంలే... అతనిమాట వది లేయ్. నీకూ, మీ అమ్మగారికి లాంఛనాలు ఎంతచేటు కావాలో చెప్పు" అన్నాడు సత్యమూర్తి తిరిగి.

"నాకు ఒక్క పైసా కూడా అవసరంలేదు"

"ఒకవేళ నేను మీ తమ్ముడికి పెద్దగా కట్నం ఇచ్చేవాళ్లను చూశాననుకో. అప్పుడు నువ్వు కలగజేసుకోకూడదు"

"ఒకవేళ మా తమ్ముడు కట్నం తీసుకుందుకు తల ఊపినా, మా నాన్నగారు అందుకు సుతరామూ ఇష్టపడరు. ఆ విషయం మీకు తెలుసు. మామయ్యగారికీ, అత్తయ్యకూ తెలుసు..." అంది ధీమాగా ఝాన్సీ.

బోసు చిన్నగా నవ్వి, "బావ ఆనాడు పెళ్లి చూపుల్లో నిన్ను చూసి మనసు పారేసుకున్నారో లేదో తెలియదుగానీ నాన్నగారు మాత్రం 'తను కట్నం యివ్వడానికి వ్యతిరేకినని' గట్టిగా చెప్పడం నాకు ఇంకా గుర్తే... బహుశా బావ నిన్ను ఆటపట్టించడానికి అంటున్నాడు అంతే..."

"ఆ అదేంకాదురా... ఇందులో మీ బావగారి ఆదర్శం ఏంలేదు. అటు నాన్నా, ఇటు మామయ్యగారు కట్నాలు తీసుకోవడానికీ, ఇవ్వడానికీ వ్యతిరేకులు కాబట్టి ఈయనగారు మాట్లాడలేదు... లేకపోతేనా? "

అందరి మాటలూ విన్న గాంధీ చిన్నగా నవ్వేసి, "ఇంతకీ నువ్వు ఏ అమ్మాయినయినా చూడ్డానికెళ్లావా? " అనడిగారు.

"ఇంతవరకూ ఎవర్నీ చూడలేదండీ"

"మొహమాటపడకు బోసూ... నువ్వు ఏ అమ్మాయి మీదైనా మనసు పడితే చెప్పు. అంతేగానీ, మా చెల్లాయి భైరవి, ఆ చైతన్యలా మాత్రం చేయకు. మా ఇంట్లో జరిగిన కథ నీకు తెలిసిందేకదా? మీ నాన్నగారూ, అమ్మగారూ తట్టుకోలేకపోవచ్చు- నాకు తెలుసు వాళ్లు సున్నిత హృదయులు" అన్నాడు సత్యమూర్తి కావాలని నవ్వుతూ, అలాగే ఝాన్సీనీ చూస్తూ.

"ఆ విషయంలో మీరు చాలా గాయపడ్డారని విన్నాను... సారీ..."

"పైగా అది ఇంట్లోంచి వెళ్ళిపోయి తన స్నేహితురాలి ఇంట్లో ఉంటోంది. బహుశా వాళ్ల రిజిస్టర్ మేరేజ్‌కు నీకు పిలుపువచ్చి ఉండాలి. ఆ, చైతన్య నీ స్నేహితుడేట కదా..."

"ఎందుకులెండి బావగారూ... ఆ విషయాలు! అన్నీ చెప్పి మిమ్మల్ని నొప్పించడం నాకిష్టంలేదు."

"అవునులే... నాకు తెలుసు... వాళ్ళిద్దరూ, నువ్వూ, మీ అక్కయ్యా, మా అమ్మా నాన్నా మీ ఆరుగురే ఈ లోకంలో ఆదర్శవంతులు. ఒక్కమాట చెప్పు... మనచుట్టూ కట్నం లేకుండా ఎన్ని పెళ్లిళ్లు జరుగుతున్నాయంటావ్? బహుశా లక్షల్లో ఒకటి... అంటే అటు డబ్బున్నవాడే కాకుండా, ఇటు డబ్బులేనివాడు కూడా కట్నాలు ఇవ్వడానికీ, తీసుకోవడానికీ అలవాటు పడ్డప్పుడు, అది ఓ ఆచారం అయినప్పుడు- వేదికలెక్కి ఉపన్యాసాలు ఇచ్చినా అది అరణ్యరోదనేకదా? "

గాంధీగారు కొడుకు సత్యమూర్తి మాటల్ని మధ్యలోనే అడ్డుకున్నాడు. "సత్యం! నీ వాదన తప్పురా. డబ్బులేని వాళ్లుకూడా అప్పుచేసి కట్నం ఇచ్చి కూతుళ్ల పెళ్లిళ్లు చేస్తున్నారంటే దాని వెనక ఉన్న కారణం - తన కూతురికి కట్నం ఇవ్వకపోతే పెళ్లి కాదన్న భయం. ఆడపిల్లకు వయసు పెరిగితే పెళ్లికి అర్హత పోగొట్టుకుని మోడులా మిగిలిపోతుందని ఆందోళన. అందుకే ప్రభుత్వం డౌరీయాక్ట్ తీసుకు వచ్చినా జనంలో అది తన ప్రభావాన్ని చూపించలేకపోయింది. మగ పిల్లల్లోనూ వారి తల్లితండ్రుల దృక్పథంలోనూ ఏనాడు మార్పు వస్తుందో అప్పుడు



మాత్రమే వరకట్న పిశాచం సమాజంలోంచి అదృశ్యమౌతుంది…"

"మామయ్యగారూ! మీరు చెప్పింది నిజం"

సత్యమూర్తి తండ్రీ, బోసుబాబుల మాటలు నచ్చనట్టు మొహంపెట్టి, "నాకు ఆఫీసుకు టైం అయ్యింది. నేను వెళతాను" అని బోసుబాబు మొహం చూసి "పోర్టికోలో నా స్కూటరుంది. అది నువ్వు ఉపయోగించుకోవచ్చు. మొదటిరోజు నా స్కూటర్‌మీద ఆఫీసుకు వెళ్లు. అంతా నీకు మేలే జరుగుతుంది. మనం తిరిగి రాత్రి కలుసుకుందాం" అని సత్యమూర్తి బయటకి వెళ్లిపోయాడు.

అప్పుడు అక్కడ గాంధీగారూ, బోసుబాబు మిగిలారు. కాంతమ్మ, ఝాన్సీ తమ తమ పనులు చూసుకుందుకు లోపలికి వెళ్లారు.



"అవునూ… మన కాబోయే అల్లుడు చైతన్యా, నువ్వూ ప్రాణ స్నేహితులటకదా? మొన్న గుడిలో అతను నీ గురించి చెప్పాడు"

"అవునండీ మామయ్యగారూ! మద్రాసులో చదివిన నాలుగేళ్ళూ ఇద్దరం ఒకే రూ

మ్‌లో ఉండేవాళ్లం. మమ్మల్ని చదువు దగ్గర చేసింది. నిరుద్యోగం దూరం చేసింది. నాకీ ఊళ్లో ఉద్యోగం వచ్చింది. మళ్లీ మా స్నేహం గట్టిపడొచ్చు. పైగా వాడు అన్నగారు కూడా కాబోతున్నాడు కదా!"

"మీరనుకున్నట్టే జరుగుతుందిలే"

బోసుబాబు ఓ క్షణం గాంధీగారిని చూసి, "మామయ్యగారూ! ఈ పెళ్లి మీ చేతులమీదుగా జరిపించవలిసి ఉంది. మీలాంటి ధైర్యస్థులు వెనకడుగు వేయడం నాకెందుకో అదోలా అనిపిస్తోందండీ" అన్నాడు తన మాటల్లో మర్యాద హద్దుమీరకుండా చూసుకుంటూ.

"మొదట- ఈ ఇల్లు వదిలేసి మా ఊరు వెళ్లి అక్కడ భైరవికీ, చైతన్యకీ పెళ్లి చేద్దాం అనుకున్నాను. కానీ బాగా ఆలోచించిన తర్వాత నా మనసు వెనక్కి లాగింది. మా సత్యమూర్తి, భాస్కరం ఇద్దరూ చాలా మొండివాళ్ళు. సత్యం మనసును అదుపులో పెట్టుకోవడం తెలియనివాడు. హృదయం వినిపించే చప్పుళ్లను పసిగట్టలేనివాడు. బహుశా దురదృష్టవంతుడయ్యుంటాడు. మావాడు ఈ కోవలోకి వస్తాడు. ఈ విషయంలో భైరవి కూడా నన్ను వెనక్కి లాగింది. అందుకే నేను తలొంచాను"

"మీరూ, మా నాన్న ఓ తరహా మనుషులు. మీలా బ్రతగ్గలగడం మా వల్ల అవుతుందంటారా సార్" అన్నాడు బోసుబాబు చిన్నగా నవ్వుతూ.

"ఈకాలం యువతకు తెలియనిదేంలేదయ్యా. కానీ లోపం ఏమిటంటే బ్రతుకు మీద చాలామందికి చులకన భావం ఉంది. అది పోతే చాలు.."

బోసుబాబు తలవంచుకుని చిన్నగా నవ్వేశాడు. కుర్చీలోంచి లేచి...

"నేను ఆఫీసుకు వెళ్లి అక్కడినుంచి చైతన్య రూమ్‌కి వెళతాను. రేపు రాత్రికి వాళ్ల పెళ్లికదా, అదీ యాదగిరి గుట్టలో అని తెలిసింది" అని లోపలికి చూసి "అక్కా" అని పిలిచాడు. ఝాన్సీ వచ్చింది. "నేను వెళుతున్నాను"

"మామయ్యగారూ! వాళ్లు యాదగిరిగుట్టలో పెళ్లిచేసుకుని తిరిగి రాగానే ఇద్దర్నీ మనింటికి రమ్మనీ- వచ్చి మీ ఆశీర్వాదాలు తీసుకోమని కబురు పంపిస్తున్నాను. ఏమంటారు? "

"మంచిదమ్మా"

"వీడేమన్నా గొడవ చేస్తాడేమో" అంది కాంతమ్మ.

"పక్కన నేను ఉంటాను. బావగారికి నేను నచ్చచెబుతాను. మీరేం భయపడొద్దు" బోసు పోర్టికోలోకి వెళ్లి స్కూటర్ బయటకి తీశాడు. గాంధీగారు కూడా అతని వెనకనే రోడ్డుమీదకి వెళ్లి "బోసూ! ఓ మాట" అన్నారు.



చైతన్య గుమ్మం దగ్గర స్కూటర్ దిగిన బోసుబాబును చూసి ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. "రారా! చాలా రోజుల తర్వాత.... ఇంటర్వ్యూ ఎలా జరిగింది? కూర్చో" అంటూ కుర్చీ చూపించాడు. బోసుబాబు, "అంతా బాగానే ఉంది. ఇంటర్వ్యూ బాగా చేశాను. ఇంకా..." అంటూ స్నేహి




తుడి మొహంలోకి పరీక్షగా చూడ్డం మొదలెట్టాడు.

"ఏమిటిరా, కొత్తగా చూస్తున్నావు"

"నీ మొహంలో పెళ్ళికళ స్పష్టంగా కనిపిస్తోంది. దాన్నే చూస్తున్నాను"

"అంతేకదా, నీలో కూడా పెళ్ళికళ ఛాయామాత్రంగా నాకు కనిపిస్తోందిరా. ఎవర్నయినా ఖరారు చేసుకున్నావా? "

"ఆపవోయ్ నీ చంచాగిరీ. ఇంతకీ మరదలుగారెక్కడ? కనబడరేం? "

"ఆమె గువ్వ పిట్టలా మారి తన స్నేహితురాలు ఇందుమతి అని ఉందిలే, ఆమె ఇంట దాక్కుని ఉంది. కాసేపట్లో రావచ్చులే..."

"ఏమిట్రా ఇదంతా? ఇలా జరిగిందేమిటీ? మీ ప్లానింగ్ లోపమా? అందుకే మా బావ మొండికేశాడా? " అంటూ ప్రశ్నించాడు బోసుబాబు.

చైతన్య టూకీగా తన గురించీ, భైరవి గురించీ చెప్పాడు.

"ఆశ్చర్యంరా. నీకు ఎలాగూ కన్నవాళ్ళు లేరు. అంతా ఉండి భైరవి ఎవరూ లేని వాళ్ళలా మారింది..."

"మీ బావగారి పంతం, నామీద కక్షా మమ్మల్ని ఈ దశకి లాక్కొచ్చాయి"

బోసు ఓసారి ఆ గదంతా చూసి "అవునూ, మీ కొత్తకాపురం ఈ రూమ్‌లోనే ప్రారంభించదల్చారా? ఈ గది చూస్తే-బ్రహ్మచారులకే ప్రత్యేకం అనేటట్టుగా ఉంది"

"మా ఆఫీసులో కొలీగ్ ఒకాయన దిల్ సుఖ్ నగర్‌లో ఓ చిన్నవాటా మాట్లాడిపెట్టాడు. ఈ వారాంతానికి కొత్తింటికి వెడతాం. నేనూ, భైరవీ, ఇందుమతీ వెళ్ళి ఇల్లు చూశాం. బావుంది. ఎడ్వాన్స్ కూడా ఇచ్చాం"

సరిగ్గా అప్పుడే వీధిలో ఆటో ఆగింది. అందులోంచి భైరవీ, ఇందుమతీ దిగి లోపలికి వచ్చారు. భైరవి అక్కడ ఉన్న బోసుబాబును చూసి ఏమీ అనలేక, చిన్నగా తొట్రుపడింది. అదిచూసి బోసుబాబు "బావున్నావా భైరవీ? నన్ను చూసి నువ్వు కంగారుపడనవసరం లేదు. నేను మీ మనిషినే" అన్నాడు చనువుగా.

భైరవి సమాధానంగా అవునన్నట్టుగా తల ఊపింది. ఇందుమతి వింతగా చూస్తోంది.

చైతన్య బోసుబాబుకు ఇందుమతిని చూపిస్తూ, "ఈవిడగారు భైరవి కొలీగ్. మా ఇద్దరికీ గైడ్. రేపు రాత్రివరకూ పెళ్ళిపెద్ద. ఆ తర్వాత మా పాలిట పెర్మనెంట్ సలహాదారిణి" అంటూ పరిచయం చేశాడు.

ఇందుమతీ, బోసుబాబూ ఒకరినొకరు విష్ చేసుకున్నారు. ఇందుమతి చైతన్యను చూసి "చూడండి చైతన్యగారూ! రేపు యాదగిరిలో జరిగే మీ పెళ్ళికి అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయి. ముహూర్తం టైముకి రిజిస్ట్రారుగారూ, వారి సిబ్బందీ అక్కడికి వచ్చి మీ పెళ్ళికి లీగల్ స్టేటస్ కల్పిస్తారు. అంటే వారి సమక్షంలో డాక్యుమెంటేషన్ వర్క్ పూర్తి చేస్తారు. మీకు సర్టిఫికెట్ ఇస్తారు... ఆ తర్వాత మనందరం హైదరాబాద్ తిరిగి వచ్చేస్తాం. తాజ్ హోటల్లో అయిన వాళ్ళకు మీరు పెళ్ళి భోజనం పెడతారు. ఫైనల్‌గా మీరిద్దరూ మా ఇంట ఆతిథ్యం స్వీకరిస్తారు. మూడు నిద్రల ముచ్చట మా ఇంట జరుపబడునని-అందుకు మీ ఇద్దరి అంగీకారం తెల్పమనీ మా నాన్నగారు అన్నారు. అఫ్‌కోర్స్ మీ పెళ్ళికి నేనేకాదు, మా అమ్మా, నాన్నా కూడా వస్తామన్నారు" అంటూ గుక్క తిప్పుకోకుండా చెప్పేసింది.

"నాదో చిన్న సవరణ... అనగా సలహా" అన్నాడు బోసుబాబు.

"ఏమిట్రా? "

"మీరు యాదగిరిగుట్టలో పెళ్ళిచేసుకుని తిరిగి ఈ ఊరు రాగానే ముందుగా ఓ పని చేస్తే బావుంటుందనిపిస్తోంది. సరాసరి మీ

అన్నగారింటికి వెళ్లి- మామయ్యగారివీ, అత్తయ్యగారివీ ఆశీర్వాదాలు తీసుకోవాలి. తమ స్వహస్తాలతో మీ పెళ్లి జరిపించలేకపోయిన వాళ్లకు మిమ్మల్ని దీవించి అక్షింతలు జల్లే అవకాశం ఇవ్వాలి. ఇది న్యాయం. చూడ్డానికి బావుంటుంది"

"నాదేం లేదురా... అంతా భైరవి ఇష్టం"

"అన్నయ్య మమ్మల్ని చూసి గొడవ చేస్తే? "

"బావగారు అంతదూరం వెళ్లకపోవచ్చు అవన్నీ అక్క చూసుకుంటుంది. తనే ఈమాట మీతో చెప్పమంది"

"సరే చిన బావగారూ!" అంది నవ్వుతూ భైరవి.

బోసుబాబు ఏదో గుర్తుచేసుకుని తను కూడా తీసుకువచ్చిన బేగ్ తెరిచి, అందులోంచి ఓ బ్యాంక్ డ్రాఫ్ట్ తీసి భైరవికి అందించాడు.

"ఇదేమిటీ? "

"ఇది మీ నాన్నగారు నీకు ఇమ్మన్నారు. కొత్త సంసారానికి అవసరమైనవన్నీ కొనుక్కోమన్నారు. డి.డి యాభైవేలకి తయారు చేయించారు"

భైరవికి ఏం మాట్లాడాలో తెలియలేదు. ఆ డ్రాఫ్ట్ చైతన్య చేతిలో పెట్టింది. దాన్ని ఆశ్చర్యంగా చూస్తున్న చైతన్యతో...

"ఆప్యాయంగా వారు ఇచ్చారు. తీసుకోవడం మీ విధి. ఇందులో చర్చించాల్సిందీ, మథనపడాల్సిందీ ఏంలేదు" అంది భైరవి.

"అవును... నిజమే" అంది ఇందుమతి.

"మనం ఇప్పుడు ఏంచెయ్యాలి? పన్లు అన్నీ ఓ కొలిక్కి వచ్చాయిగా" అన్నాడు చైతన్య.

"ముందు ఏహోటల్‌కో వెళ్లి టిఫిన్ కాఫీ తీసుకోవాలి" బోసు అన్నాడు.

"అవును... పదండి వెడదాం. మన దగ్గర రెండు స్కూటర్లు ఉన్నాయికదా" అని చైతన్య భైరవివైపు చూశాడు. పదినిముషాల్లో ఓ స్కూటర్‌మీద చైతన్య, భైరవీ- మరోదానిమీద బోసుబాబూ ఇందుమతీ ఎక్కారు.

★ ★ ★

మర్నాడు అన్నీ అనుకున్నట్టు జరిగాయి. చైతన్య, భైరవీ, బోసుబాబు, ఇందుమతి ఇంకా ఇందుమతి తల్లిదండ్రులూ, ఆఫీసులో పనిచేసే కొలీగ్స్, మొత్తం ఇరవైమంది యాదగిరి గుట్ట వెళ్లారు. పెళ్లి అయింది. చైతన్యా, భైరవీ భార్యాభర్తలయ్యారు. రిజిస్ట్రార్ ఆఫ్ మేరెజెస్ తరఫునుంచి సబ్‌రిజిస్ట్రార్, మరో ఇద్దరు ఆఫీస్ స్టాఫ్ ఆ పెళ్లిని చూసి, దాన్ని డాక్యుమెంటేషన్ చేశారు. అలా అక్కడ ఓ రెండు గంటలసేపు వివాహ వేడుకల్లో పాల్గొని అందరూ తిరిగి హైదరాబాద్ చేరుకున్నారు. అప్పటికే రాత్రి పదిగంటలయ్యింది. మిత్రులందరూ తాజ్ మహల్ హోటల్‌కు వెడితే చైతన్యా, భైరవీ, బోసుబాబూ సీతాఫలమండిలోని అన్నగారి ఇంటికి వెళ్లారు.

బోసుబాబు మొదట లోపలికి వెడుతూ తనపక్కనే నడుస్తున్న చైతన్యని అతని వెనక వున్న భైరవినీ 'పదండి' అంటూ హాల్లోకి తీసుకువెళ్లాడు.

"మామయ్యగారూ! మీ అమ్మాయీ, అల్లుడు వచ్చారు. అత్తయ్యగారినీ అక్కనీ పిలవండి" అన్నాడు నెమ్మదిగా.

గాంధీగారు మధుపర్కాలతో నిలబడ్డ కూతుర్నీ, అల్లుడిని చూసి వాళ్లకి దగ్గరగా వెళ్లి ముందు చైతన్య భుజంమీద ఓ చేయి, అలానే కూతురు భుజంమీద మరో చేయి వేసి దగ్గరకు తీసుకున్నారు. అప్పుడే లోపలినుంచి కాంతమ్మగారూ, ఝాన్సీ వచ్చారు. వాళ్లిద్దరూ కూడా చైతన్యనీ భైరవినీ చూశారు. కొన్ని క్షణాలపాటు గాంధీగారు, కాంతమ్మగారూ ఉద్వేగంతో కిందా మీదా అయ్యారు. అలాగే ఝాన్సీ కళ్లతో మరదలిని చూస్తే భైరవీ ఆపని చేసింది. అప్పుడు వారిద్దరి మధ్యా ఎన్నేళ్లుగానో దాగిన ఆప్యాయత కట్టలు తెంచుకోవాలని చూడటో





యింది. ఇద్దరూ తమనితాము హద్దులో పెట్టుకున్నారు.

నిశ్శబ్దంగానే చైతన్య, భైరవీ ముందు గాంధీగారికీ, కాంతమ్మగారికీ వంగి నమస్కరించారు. బోసుబాబూ, ఝాన్సీ అక్షింతలు అందిస్తే వాళ్లిద్దరూ కూతుర్నీ అల్లుణ్ణీ ఆశీర్వదించారు. తరువాత ఝాన్సీ కూడా తనకి నమస్కరించిన భైరవిని లేపి దగ్గరగా తీసుకుంది.

"మీరిద్దరూ పదికాలాలపాటు సుఖసంతోషాలతో ఉండాలి. మీరు స్నేహితులు కాబట్టి బతుకంతా ఆదర్శదంపతులుగా ఉంటారని ఆశిస్తున్నాను" అన్నారు గాంధీ గారు.

"భైరవీ జాగ్రత్త... ఏదైనా అవసరంపడితే ఫోన్ చేస్తూ ఉండు. నేనో, ఝాన్సీనో వస్తాం. అన్నయ్య ఎప్పుడూ ఈవేళటిలానే ఉంటాడనుకోకు. వాడూ మారతాడు" అని, ఆ తర్వాత అల్లుణ్ణి చూసి, "అంతేకదు నాయనా" అంది కాంతమ్మ.

"అవునండీ" అని చైతన్య నవ్వుతూ తల ఊపాడు.

"అత్తయ్యగారూ! నేను ఈ ఊళ్లోనే ఉంటాను. ఈ చైతన్యా, భైరవీ నాకు రెండు కళ్లు. మీరు బెంగపెట్టుకోవద్దు" అన్నాడు బోసుబాబు.

"మరి మేం వెడతాం మామయ్యగారూ... అంతా మా కోసం హోటల్ దగ్గర ఎదురు చూస్తూ ఉంటారు" అన్నాడు చైతన్య.

"సరే"

"వెళ్లొస్తాం నాన్నగారూ... వెళ్లొస్తాం అమ్మా... వెళ్లివస్తాను వదినా"

తిరిగి అందరూ పదినిముషాల్లో సికిందరాబాద్ సర్దార్‌పటేల్ రోడ్‌ని ఆనుకుని ఉన్న సందులోని బెల్సన్ తాజ్‌మహల్ హోటల్‌కి జేరారు. ఇందుమతి, మరికొందరు స్నేహితులూ వాళ్లని హోటల్ గుమ్మం దగ్గరే రిసీవ్‌చేసుకుని లిఫ్ట్‌లో పైకి తీసుకు వెళ్లారు. ఇందుమతి-చైతన్యనీ, భైరవినీ అక్కడ ఉన్న హాల్లోకి తీసుకువెళ్లి ఓ పక్కగా వున్న రెండు మహారాజా కుర్చీల్లో కూర్చోపెట్టింది. రిసెప్షన్‌కు వచ్చినవాళ్లు చిరునవ్వుతో వధూవరుల్ని పలకరించి బహుమతులు అందజేసి కేటరింగ్‌వైపుకి వెడుతున్నారు.

ఇందుమతి అటుగా వచ్చిన తెలిసినవాళ్లని చైతన్యకి పరిచయం చేస్తోంది. అప్పుడు ఇరవై అయిదేళ్లు దాటినట్టున్న ఓ యువతిని చూసి 'రండి, రండి' అంటూ నవ్వుతూ పలకరించి ఆమెను చైతన్యకూ, భైరవికీ పరిచయం చేస్తూ, "మీరు నాలుగు రోజుల్లో కొలువు వుండబోయేది వీరి ఇంటి పైభాగాన్నే. ఈవిడ పేరు రాణి. ఇన్‌ఫోసిస్‌లో పనిచేస్తున్నారు" అంది.

"మీరు మా రిసెప్షన్‌కి రావడం... మాకు చాలా ఆనందంగా ఉంది. అంతదూరం నుంచి వచ్చారు. మీవారు..." అని ఆగిపోయింది భైరవి.

"వారికి ఈ నెల మొదట్లోనే విశాఖపట్టణం ట్రాన్స్‌ఫర్ అయింది. ఊళ్ళోలేరు" అంది చిన్నగా రాణి.

"ఓ" అంది భైరవి. ఆపైన సంధ్యారాణీ అందించిన గిఫ్ట్ పేకెట్ చేతుల్లోకి తీసుకుంది. దానికి ఎటాచ్డ్‌గా ఉన్న కార్డ్‌మీద పేరు రాణి అని ఉండడంతో ఆ పేరు ఒకటికి రెండుసార్లు మననం చేసుకుంది.

★ ★ ★

సాయంకాలం సముద్రస్నానం చేస్తూ చీకటి చీరలుకట్టుకుంటోన్న సమయమది. విశాఖపట్టణం బీచ్‌రోడ్‌లో వున్న ఓ ఖరీదయిన హోటల్ తాలూకు గది అది. రూమ్ కిటికీలు తెరిచి చూస్తే సముద్రం కన్పిస్తుంది. పైనుంచి చూస్తే జనం, వాహనాలూ, బొమ్మల కొలువులోని బొమ్మలు లాగే ప్రాణం పోసుకుని వీధిలో సంచరిస్తున్నాయనిపిస్తోంది.

అప్పటికే ఓ సింగిల్ రూమ్‌లో ఇద్దరు వ్యక్తులు ఎదురెదురుగా కూర్చుని చేతుల్లో

విస్కీగ్లాసులు ధరించి నిజానికీ, నిషాకూ మధ్య ఊగిసలాడుతున్నారు. అందుకే వాళ్ల మాటల్లో పొంతనలేదు. ఒక్కొక్కసారి ఔచిత్యానికి దూరంగానూ పోతున్నారు. వాళ్లు దేశం గురించి దేశంలోని రకరకాల మనుషుల గురించి ముఖ్యంగా వయసులో ఉండి మిసమిసలాడే అమ్మాయిల గురించి మాట్లాడుకుంటూ రసికతకు ప్రతీకలుగా కన్పిస్తున్నారు. ఆ తరువాత అందులో ఓ వ్యక్తి కాస్తంత బాధగానూ, భయంగానూ మాట్లాడుతుంటే మరొకాయన, "ఈ లోకంలో మనిద్దరమేకాదు లక్షలమంది దారితప్పే బతుకుతున్నారు... ఈ యుగంలో ఏదైనా అందం దాగి ఉందంటే... అది ఆడామగా కూడా లక్ష్మణరేఖ దాటి బతకాలని ఆశపడుతున్నందువల్లే బాగా గుర్తుంచుకో. ఎవరి బతుకులకూ అర్థంఉండదు. పరమార్థం ఉండదు. మిగిలేది అంతా శూన్యమే... సత్యమూర్తీ"

"ఎంత బాగా చెప్పారు గురువుగారూ... తలమానికాలైన గుళికలు వదిలారు. ఎంత గింజుకున్నా, ఎంత తాగినా నా మాటల్లో కవిత్వం తొంగిచూడదు. వేదాంతం బయట పడదు. ఇంకా పోతే కక్కులే వస్తాయి. ఎలాగైనా మీరు అన్ని రంగాల్లోనూ సీనియర్... ఒప్పుకుంటున్నాను. విశ్వనాథం గారూ..." అన్నాడు సత్యమూర్తి మాటలు విస్కీ నోటిలో నాని తడబడుతూ బయటకు వస్తూంటే.

"నన్ను ములగచెట్టు ఎక్కించకు... నువ్వు మంచివాడివి. కానీ నీలో కొన్ని పద్ధతులు నాకు అదోలా అన్పిస్తాయి. నచ్చవు. ఒకటి చెప్పనా... మీ చెల్లాయి నా తమ్ముడి కొడుకుని పెళ్ళిచేసుకోనంది. రిజెక్ట్ చేసింది నిజమే. అయినా దానికి ఆ అమ్మాయిని అన్నిమాటలు అనడం తప్పు. నీ కూతురి మీద నీకు సర్వాధికారాలూ ఉంటాయిగానీ చెల్లెలిమీద ఉంటాయా? ఇంకా పోతే నీకు పదిలక్షలు మిగిలాయికదా? "





"మీ దగ్గర నామాట పోయింది. ఇది మిమ్మల్ని అవమానించినట్టుకాదా? మీరు దేవుళ్ళాంటి వారు కాబట్టి నవ్వేసి ఊరుకున్నారు. పైగా" అని ఆగిపోయాడు సత్యమూర్తి.

"ఇంకా ఉందా చెప్పేది, చెప్పు వింటాను" అంటూ విశ్వనాథంగారు, తను గ్లాసులు వెలితిగా, ఉండడం చూసి వాటిని నింపాడు.

"ఏంచెప్పను సార్! గుండె భగ్గుమంటోంది"

"దేనికి సత్యమూర్తీ... నీ హృదయాన్ని మరెవరైనా గాయపర్చారా. వాళ్ళెవరో చెప్పు. వాళ్ల అంతు చూస్తాను. మన సెక్షన్లో నువ్వు నాకు బాగా కావల్సినవాడివి. అసిస్టెంట్ వి. బయటేమో నా ప్రాణానివి"

"వాడు సార్. ఆ చైతన్యగాడు"

"ఏ సెక్షన్లో పనిచేస్తాడు? "

"వాడు మనవాడుకాదు. ఎ.సి.బి.లో సబ్ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేస్తాడు."

"ఎ.సి.బి. చైతన్యా... అంటే..." అంటూ విశ్వనాథంగారు బుర్ర గోక్కుని ఓసారి గ్లాసుచేతికి తీసుకుని అందులోని విస్కీ చప్పరించి ఆపైన ప్లేటులోని బిరియానీ కొద్దిగా తిన్నాడు.

"వాడేసార్! రెండేళ్లక్రితం నన్ను ట్రాప్ చేయబోయాడు. మీరు మినిస్టర్‌గారితో చెప్పారు... అతగాడే..."

"ఆ దుర్మార్గుడా... జ్ఞాపకం వస్తోంది. చెప్పు... ఏం చేయమంటావ్ వాడిని. ఓసారి తన్నిద్దామా... ట్రాన్స్‌ఫర్ చేయించమంటావా? "

"వాడేసార్! నా చెల్లెల్ని ప్రేమించి పెళ్ళిచేసుకున్నది"

"ఆ...!" అనేశాడు విశ్వనాథం.

"అవును... నన్ను పట్టించాలని చూసిన వాడు నాకు బావ అయి కూర్చున్నాడు. ఇది అవమానంకాదా? " అంటూ సత్యమూర్తి గమ్మున గ్లాసెత్తి రెండుగుక్కల్లో అందులోది తాగేశాడు.

విశ్వనాథం చాలా సేపు సత్యమూర్తి

మొహంలోకి చూశాడు. అతగాడి తల నిమిరాడు. అదోలా నవ్వాడు.

"ఏమిటిసార్! నావైపు అలా చూస్తున్నారు"

"ఇంత చిన్న విషయానికి నా శిష్యుడు బాధపడడం చూస్తుంటే జాలివేస్తోంది..." అంటూ ఊగిపోతూ నవ్వేశాడు.

"అదేమిటి సార్, అలా నవ్వుతున్నారు? "

"నీ పిచ్చిమాటలకు నవ్వురాక చస్తుందా చెప్పు" అని ఓ క్షణం ఆగి, "ఆ చైతన్యగాడు వెనకెప్పుడో ఏదోచేశాడు. దాన్ని అప్పుడే మర్చిపోవాలి. ఒకవేళ నీకు అతగాడిమీద కోపం ఉంటే తీర్చుకోవల్సిన విధానం వేరు. ముందు నీ చెల్లెల్ని మంచిచేసుకో. అతగాడితో ప్రేమగా ఉండు. నీదగ్గర డబ్బు ఉందిగా... దానితో ఇద్దర్నీ ముంచెత్తు. దాంతో ఇద్దరూ నువ్వు చెప్పినట్టు వింటారు అర్థమయిందా? "

"వాళ్లిద్దరి మొహాలూ చూడననీ, వాళ్లింటికి వెళ్లకూడదనీ నిర్ణయించుకున్నాను. నా భార్యకు కూడా వాళ్లతో ఇలాగే ఉండాలని చెప్పాను"

"సత్యమూర్తీ! ఆరేళ్లబట్టీ ఉద్యోగం చేస్తున్నావు. అనుభవం సంపాదించావ్. నీ చేతికింద ఎందరో పనిచేస్తున్నారు. అందరూ నిన్ను మంచివాడంటారు. అలాంటిది-అయినవాళ్లతో నిష్కర్షగా ఉండడం బావుండదు కదా? "

"అది వేరు, ఇదివేరు కదా? "

"ఎక్కడయినా ఎడ్మినిస్ట్రేషన్ అనే మాటకి ఒకటే అర్థం. ఇంటిలో నలుగురు స్వంత మనుషులతో విభేదాలు దేనికీ? ఇటీజ్ యువర్ ఫెయిల్యూర్- ఒప్పుకో" అని విశ్వనాథం నవ్వేసి, "ఇంకో పెగ్ వేసుకో. మనసు తేలిక పడుతుంది" అనేశాడు.

సత్యమూర్తి గురువు చెప్పినట్టే చేశాడు.

"ఇప్పటినుంచీ మీ బావ- అదే ఆ చైతన్యతో మంచిగా ఉంటూండు. అడగకపోయినా అతనికి సహాయపడు. నీకు అవసరం లేకపోయినా అతని సలహాలూ, సహాయాలూ తీసుకో. ఓ ఏడాది గడిచేటప్పటికి మీ బావ నీ దారికి వస్తాడు. నీకోసం ప్రాణం పెడతాడు. దాంతో ఏమైనా గొడవలు వస్తే తొందరపడి ఏ కేసులోనో నిన్ను ఇరికించడు. నీ మూలంగా నేనూ రక్షింపబడతాను. మనం లొసుగు మనుషులం. ఇంకా సర్వీస్ ఉంది. ముందు ముందు ఇంకా ఎన్ని వెధవ పనులు చేయాల్సివస్తుందో? ? ఇలాంటి చాకులాంటి కుర్రాడు మనవైపు ఉండడం మనకే లాభం. అర్థం అయ్యిందా? ఇంకా చెప్పమంటావా? "

"నాది పొరపాటే సార్"

"అవునూ, నీకో బావమరిది ఉన్నాడని చెప్పావ్..."

"ఉన్నాడు. పేరు బోసుబాబు. యం.సి.ఏ చేశాడు. మొన్ననే ఇన్ఫోసిస్‌లో ప్రోగ్రామర్‌గా జాయిన్ అయ్యాడు" అంటూ బోసుబాబు గురించిన వివరాలు చెప్పాడు సత్యమూర్తి.

"ఇంకేం. నీ కొలీగ్ రామారావ్ కూతురికి ఎలాగో ఓలాగ సంబంధం ఖాయపర్చు. ఓసారి ఆ కుర్రవాణ్ణి నా దగ్గరకు తీసుకురా. నేను ట్యూషన్ చెబుతాను" అని ఆగి "నీలా డ్రింక్ చేస్తాడా? హుషారయిన వాడేనా? " అడిగాడు.

"నా దృష్టిలో ఇంకా పడలేదు. వాళ్లది విజయవాడ"

"ఆ అబ్బాయి గురించి నీ భార్యని అడుగు. అన్నీ తెలుస్తాయి. ఒకవేళ ఫక్తు ఋష్యశృంగుడయినా భయపడకు. మనం దారిలో పెడదాం"

"మా బోసుబాబుది అంతా మా మామగారి తరహా. చిలకపలుకులు చెపుతాడు. మాట్లాడితే భగవద్గీత, వివేకానందుడు, రవీంద్రనాథ్‌టాగూర్ అంటూంటాడు. కాస్తంత కవిత్వం పిచ్చి కూడా ఉంది"

"చిలకల గురించి తెలియనివాళ్లే చిలకప లుకులు పలుకుతారు. కవిత్వం చెబుతారు. ఓ ఆడ చిలక పరిచయం అయితే తరువాత తమ రూట్ మొత్తం మార్చుకుంటారు" అంటూ నవ్వేశాడు విశ్వనాథం.

"ప్రస్తుతం మా ఇంట్లోనే ఉంటున్నాడు"

"ఇంకేం... మీవాడికి మంచి సంబంధం నేను చూస్తాను" అని చేతివాచీ చూసుకుని "కాసేపు తాగడం ఆపుదాం. మన పార్టీ వచ్చే టైమయింది. మనం పూర్తి నిషాలో ఉంటే వాడు మనల్ని ముంచి పోవచ్చు రోజులు బావోలేదు. అసలునోట్లు బదులు దొంగ నోట్లు మన మొహాన కొడితే డేంజర్" అన్నాడు.

సత్యమూర్తి 'సరే' అని విస్కీ బాటిల్ ఓ మూలగా పెట్టాడు. గబగబా బిరియానీ, నూడిల్స్ జతగా తిని నిశ్శబ్దంగా కుర్చీకి జేరబడ్డాడు. పది నిముషాల్లో వాళ్ల గదిలో కాలింగ్ బెల్ మోగింది. సత్యమూర్తి 'మన పార్టీ రాజారావు అయ్యుంటాడు' నెమ్మదిగా అని వెనక్కి చూస్తూ, ముందుకు నడుస్తూ గది తలుపు తెరిచాడు.

రాజారావు అనే యాభై ఏళ్ల పెద్దమనిషి రేమాండ్ సూట్‌లో లోపలికి వచ్చి 'హలో' అంటూ మొదట విశ్వనాథంతో చేతులు కలిపి, ఆ తర్వాత సత్యమూర్తికి విష్ చేశాడు.

"మీకు తెలుసుగా రాజారావ్... మనం ఎక్కువసేపు ముచ్చట్లు ఆడ్డానికిలేదు. టూకీగా చెబుతున్నాను. మీ యం.డిగారు అడిగిన ప్రకారం మేం వెనకనుంచి మీకు సహాయపడతాం. మా సహాయం ఆంధ్రా, రాయలసీమ, తెలంగాణాలోని మీ అన్ని ప్లాంట్లకూ వర్తిస్తుంది"

"థాంక్యూ" అన్నాడు రాజారావు చిన్నగా.

"అలాగే మా రిక్విజిషన్ కూడా మిమ్మల్ని ఓవర్ బర్డెన్ చేయలేదని నా ఆశ. అవునా?"

"ఏదోలెండి. మనం కష్టనష్టాల గురించి చర్చించుకుందుకు టైమ్ లేదు. మన స్నేహం ఒకరోజులో పోయేది కాదని మీకూ మాకూ తెలుసు"

"దెన్ ఇటీజ్ ఆల్‌రైట్"

రాజారావు తన సూట్‌కేస్ తెరిచి డబ్బు చూపించి అది విశ్వనాథం ముందుంచాడు. విశ్వనాథం ఆ సూట్‌కేస్ మూసేసి దాన్ని పక్కకు పెట్టాడు. ఆ తర్వాత రాజారావుని చూసి "మీకు వెట్ డ్రింక్ ఇష్టమా? లేక పోతే హాటా చెప్పండి. సభా మర్యాదని కాపాడాలి కదా, అందుకని అడుగుతు న్నాను"

"సారీ, వద్దుసార్. నాకీ రాత్రి చాలా పన్లున్నాయి. మనం ఎలానూ హైదరాబా ద్‌లో కలుస్తాం కదా! అప్పుడు చూసు కుందాం మన బలాబలాలు" అనేశాడు నవ్వుతూ రాజారావ్.

"వారికి ఫైవ్‌స్టార్ హోటల్స్‌గానీ ఆనవు సార్. మనం చిన్నవాళ్లం" అన్నాడు సత్య మూర్తి.

"ఒకటి రెండేళ్లల్లో మీరూ ఎదుగుతారు. అప్పుడు మిమ్మల్ని పట్టుకుందుకు మేం కాక తీయలు, తాజ్‌కృష్ణాలు, అశోకా హోటల్స్ వెదకవల్సిందే" రాజారావ్ దీవనగా అన్నాడు.

"అంతచేటు ప్రోగ్రెస్ మాకొద్దులే. అవన్నీ ఐ.ఏ.ఎస్ వాళ్లకే ప్రత్యేకం. మా ఆపరేషన్స్ ఆంధ్రప్రదేశ్ దాటి విస్తరిల్లాలని మేం ఆశ పడడం లేదు. అత్యాస వద్దు. కటకటాల వెనక్కి వెళ్లద్దు. ఏమంటారు?" అంటూ నవ్వేశాడు విశ్వనాథం.

"నిజమే. నేను వెళతాను, శెలవు మరి" అంటూ రాజారావ్ కుర్చీలోంచి లేచి గది తలుపు తీసుకుని బయటకు వెడుతూ, సత్య మూర్తిని బయటకి రమ్మని సౌజ్ఞచేశాడు. సత్యమూర్తి నెమ్మదిగా కారిడార్‌లోకి వెళ్లాడు. రాజారావ్ సత్యమూర్తి చెవిలో ఏదో చెప్పి లిఫ్ట్‌లోకి మాయమయ్యాడు. సత్యమూర్తి తిరిగి ఆ గదిలోకి వచ్చి తలుపు

బోల్ట్ పెట్టి విశ్వనాథంగారికి ఎదురుగా కూర్చున్నాడు. విశ్వనాథం సత్యమూర్తిని చూసి, "ఇక నువ్వు తాగడానికి వీల్లేదు. ఆ బిరియానీ తినెయ్. పళ్లు తిను. ఆ తర్వాత మంచం ఎక్కి పడుకో. నిన్ను ఫలక్‌నామా టైముకి నేను లేపుతాను. నేను అన్నీ ఆలోచించి నీకు సామర్లకోట దాకా టికెట్ కొన్నాను. అక్కడినుంచి నువ్వు కాకినాడ వెళ్లు. మీ చుట్టాలింట్లో ఓరోజు ఉండి విజయవాడకు వెళ్లు" అన్నాడు.

"మరి ఈ డబ్బు?"

"దాని గురించే చెబుతున్నాను" అని కాసేపు ఆలోచించి,

"మీ అత్తగారిల్లు విజయవాడే కదా, అక్కడికి వెళ్లు. ఈ సూట్‌కేస్ ఓ వారం అక్కడ వదిలేయ్. డ్యూటీమీద మద్రాస్ వెళుతున్నానని చెప్పి నువ్వు నేరుగా హైదరాబాద్ వెళ్లిపో కానీ డ్యూటీలో జాయిన్ కావద్దు. వంట్లో బావుండలేదని కాకినాడ నుంచే లీవ్ లెటర్ పంపు. నేను చెప్పింది అర్థమవుతోందా?"

"ఈ డబ్బు మా అత్తారింట్లో వదిలితే బావుంటుందా?"

"అందులో లుంగీ, తువ్వాలూ మాత్రమే వున్నాయని చెప్పు. ఆ తర్వాత మనం దానిని హైదరాబాద్ రప్పించే ఏర్పాటు చేద్దాం" అన్నాడు.

"అలాగే సార్. కానీ ఓ చిన్నమాట, మన క్లయింట్ రాజారావ్ మనకోసం ఓ అమ్మాయిని బుక్‌చేసి పై ఫ్లోర్‌లో ఉంచాట్ట. మొహమాటపడొద్దన్నాడు. మీకు గుర్తు చేయమన్నాడు"

"అలానా? ఓరి వీడి నమ్రత పాడుగానూ. సరే ఏంచేస్తాం? కాదనకూడదు కదా! అగ్నికి ఆజ్యం తోడవడం అంటే ఇదే. సరే, నువ్వు రెస్ట్ తీసుకో. నే వెళ్లివస్తాను" అన్నాడు విశ్వనాథం.

సత్యమూర్తి తలవంచుకున్నాడు.





"నాకు అయితే ఇటువంటి అవకాశం ఏడాదికి ఒకటి రెండు సార్లుగానీ రాదు. పైగా యాభై ఏళ్లు రావడం కాకుండా జుట్టు కూడా నెరిసింది. తగు జాగ్రత్తలు తీసుకోకపోతే పరువు బజారుకు ఎక్కుతుంది. ప్రమాదాలు చెప్పి రావు కదా"

"అవును సార్. కష్టే ఫలీ అన్నారు అందుకే" అని సత్యమూర్తి జోక్ పేల్చి నవ్వేశాడు.

"అలానా? నాకు తెలియదులే" అంటూ విశ్వనాథం కూడా నవ్వేసి "నువ్వు అదృష్టవంతుడివి. చక్కగా చిన్న ఇల్లు కూడా నడుపుతున్నావ్. దానికీ ధైర్యం కావాలి కాబోలు" అన్నాడు నవ్వేస్తూ.

"ఏదోలెండి. అయినా దానికన్నా ఈ తంతే నయంసార్. బరువు, బాధ్యతలు, భయాలూ ఉండవు. నా తిప్పలు ఎవరితో చెప్పుకోను. ఒక్కొక్కసారి ఆమె నా పెళ్లాం కన్నా ఎక్కువ అథారిటీ చేస్తుంది" అంటూ పెదవి విరిచాడు సత్యమూర్తి.

"నేను నీకు ఆ రోజుల్లోనే చెప్పాను. పైగా ఆమె పేర ఇల్లు కట్టావు, అనుభవిస్తున్నావు. ఏంచేస్తావ్? సాగినన్నిరోజులు సాగనీ. ఒక విధంగా ఆమె మనకు పరోక్షంగా సహాయ పడుతోందికదా! బరువు అనిపించినప్పుడు దాన్ని అప్పుడే దించుకోవచ్చు"

"అందుకే మెతగ్గా ఉంటున్నాను"

"ఏదిఏమైనా ఇలాంటివి మనుషుల్ని ఇరుకున పడేస్తాయి. జాగ్రత్త. మనలాంటి వాళ్లం లోకం కళ్లు కప్పి సాధువులు అనిపించుకోవాలంటే మనలో ఒకటి రెండు మించి వీక్‌నెస్‌లు ఉండకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. అలాగే ఇంటాబయటా అందరితోనూ మంచిగా ఉండాలి. ఆదర్శ పురుషుడిగా, పాపభీతి ఉన్నవాడిగా ముద్ర వేయించుకోవాలి" అని విశ్వనాథంగారు అద్దంముందు నిలబడి కాస్త పౌడరూ, సెంటూ రాసుకుని, "నువ్వు నిద్రపో. నేవచ్చి లేపుతాను. స్టేషన్ దాకా వస్తాలే. నే వెళ్లిరానా...ఆ" అంటూ బయటకి

వెళ్లాడు.

సత్యమూర్తి తలకింద చేతులు పెట్టుకుని అవి కలుపుకుని, విడదీసి అవస్థలు పడుతున్నాడు. పడ్డాడు. బలవంతంగా మంచం ఎక్కాడు. అయినా అతని ఆలోచనల్లో రాణీయే కదుల్తోంది. విశాఖ వచ్చేముందు అతి దగ్గరగా వచ్చి తాళికట్టిన భార్యలా, "చెడు తిరుగుళ్లకు, ఎంగిలి కూడుకూ అక్కడ దూరంగా ఉంటానని ఒట్టెయ్ మూర్తీ!" అని అడగడం, ఆ మాటలూ గుర్తొచ్చాయి.

★ ★ ★

సత్యమూర్తిని చూసి తిలక్‌గారు గేటువరకూ వెళ్ళి, ప్రేమగా పలకరించి లోపలికి చూసి 'జయా' అని పిలిచి భార్యతో అల్లుడు వచ్చిన విషయం చెప్పాడు.

"అనుకోకుండా అఫీషియల్ డ్యూటీమీద విశాఖపట్టణం, కాకినాడ వెళ్ళాను. రేపు గుంటూరు వెళ్ళాలి. మిమ్మల్ని చూసినట్టు ఉంటుంది కదా అని వచ్చాను"

"మంచిపని చేశావు... మీ అమ్మగారూ, నాన్నగారూ, ఝూన్సీ కులాసానా? " అంటూ జయమ్మ పేరుపేరునా అడిగింది. లోపలికి వెళ్ళి కాఫీ, టిఫిన్ తెచ్చి భర్తకీ, అల్లుడికీ పెట్టింది.

"అసలు దేవుడు మేలు చేస్తే మనందరం హైదరాబాద్‌లో కలిసేవాళ్ళం. కానీ ఆయన చిన్నచూపు చూశాడు" అంటూ భైరవి చేసిన పని గురించి చెప్పాడు.

"ఒక్కొక్కసారి మనం అనుకున్నట్టుగా జరగదు. అయినా ఓర్చుకోవాలి. భైరవి తనకి నచ్చినవాణ్ణి చేసుకుంది. తనుగా జీవితాన్ని సరిదిద్దుకోవాలనే మనం కోరుకుందాం. నువ్వూ, నేనూ బాధపడి ఏంలాభం ఉండదు"

"స్వంత చెల్లెలు... పాపం అబ్బాయి ఏవేవో ఊహించి ఉంటాడు. తను అనుకున్నట్టు జరగకపోతే బాధపడడా? " అంది సర్దిచెబుతూ జయమ్మ.

"సరే- ఇది మా అందరి తలరాత ప్రభావం అని ఇప్పుడిప్పుడే తెలిసొస్తోంది"

"సత్యం... నువ్వు బోసుకు ఏదో సంబంధం చూశావులా వుంది. రామారావు గారని ఒకాయన వచ్చారు"

"అవునండీ ఆయన మాతోనే కలిసి పని చేస్తారు. బాగా ఉన్నవాడు. వారికి ఒక్కత్తే కూతురు. వారిది గౌరవనీయమైన కుటుంబం"

"మన బోసు తనుగా ఎవరినయినా ఎన్నుకున్నా నేను కాదనను. మాకుగా మేం కలగజేసుకుని పెళ్ళి చెయ్యాలన్నా దానికీ ఒప్పుకుంటాను. నాకయితే సాంప్రదాయమైన ఇంటిలోంచి వచ్చిన అమ్మాయి అయితే చాలు. మాకు కట్నాలు వద్దు. నేను పైసా తీసుకోను"

"అల్లుడూ వీరి ఆదర్శాలకు తగ్గవాళ్ళనే చూడు. ఈ ఏడాది వాడి పెళ్ళి జరిగితే బాగుంటుందనిపిస్తోంది"

సత్యమూర్తి అదోలా నవ్వి "కట్నం అడిగే వాళ్ళను మనం అసహ్యించుకుని దూరంగా తరిమికొడుతోన్నట్టే, కట్నం వద్దన్నవాళ్ళని అనుమానంగా చూసేవాళ్ళూ నాకు ఎదురయ్యారు. మామయ్యా... ఈ రోజుల్లో మా నాన్నలా, మీలా మడికట్టుకుని కూర్చున్నవాళ్లు తక్కువ! ఇప్పుడు కట్నం యివ్వడం స్టేటస్ సింబల్ అయింది. కూతురికి కన్యాధారపోసి ఆ వెనువెంటనే అమ్మాయినీ, అల్లుణ్ణీ స్వంత ఖర్చులమీద అమెరికా పంపడం అత్తవారింటికి క్రెడిట్‌గానూ ఉంటుంది"

"వెయ్యి వెర్రి విధాలు"

"అవును... చుట్టుపక్కల అందరిళ్ళలో ఇదే తీరు నడుస్తోంది"

"నాకు తెలుసు మీరు గాంధేయవాది అని మామయ్యా"

"ఈమధ్య ఆ విజయప్రకాశ్‌గారితో వీరికి స్నేహం అయ్యింది. ఇద్దరూ కలిసి మన సమాజాన్ని సరికొత్తగా తీర్చిదిద్దుతారుట. ఏం చెప్పమంటావ్" అంటూ నవ్వేసింది.

"మీ అత్తగారు ఈమధ్య నన్ను బాగా

ఆటపట్టిస్తోందోయ్. చూడు. ఎలా మాట్లా డుతోందో"

"సరేగాని, అతన్ని స్నానం చేయని వ్వండి. వంట పూర్తి అయ్యింది. ఇద్దరికీ వడ్డిస్తాను. భోజనం చేసి కబుర్లు చెప్పుకో వచ్చు"

"అలానేగాని... మన ఝాన్సీకి నాలుగో నెలో ఐదోనెలో వస్తోందేమో. అమ్మాయిని ఓసారి పంపమని అల్లుణ్ణి అడగనేమిటి" అన్నాడు.

"అల్లుడు మనింటికి వచ్చాడు. మీకు కూతుర్ని పుట్టింటికి తీసుకురావాలనిపిస్తే హైదరాబాద్ వెళ్ళి మొదట మా వియ్యంకు డినీ ఆ తర్వాత అబ్బాయినీ అడగండి. అది మర్యాద"

"అలా అంటావా, సారీ"

"సారీ నాకుకాదు అల్లుడికి చెప్పండి" అంది నవ్వుతూనే.

"ఝాన్సీ తనూ నాతో వస్తానందండీ... మనిషి నీర్సంగా ఉందని నేనే వద్దన్నాను" అంటూ సత్యమూర్తి తువ్వాలు భుజాన వేసుకుని బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. పదిని ముషాల తర్వాత లుంగీ, బనీనూ వేసుకుని మామగారితోపాటు భోజనం చేశాడు. అప్ప టికే పన్నెండుగంటలయింది.

"నేను వెడతానండి. రెండు గంటలకు నేను గుంటూరులో ఉండాలి"

"గుంటూరులో పని అయిపోతే తిరిగి ఇక్కడికి వచ్చెయ్. ఒకరోజు మా ఇంట్లో ఉండి వెడుదువుగాని. బహుశా రేపు బోసు కూడా తిరిగిరావచ్చు" అన్నారు తిలక్‌గారు.

సత్యమూర్తి బట్టలు వేసుకుని తయా రయి, "నేను వెడతాను, మామయ్యా నా సూట్ కేస్ ఇక్కడే వుంచుతాను. ఆ ఊళ్లో దానితో పనిలేదు. వీలైతే రాత్రికి తిరిగి వస్తాను"

"నువ్వు మొహమాటపడి, ఆ గుంటూ రులో వుండిపోకు నాయనా. వచ్చెయ్"

"అలానే" అని సత్యమూర్తి వీధి గుమ్మం వైపు నడిచాడు. తిలక్ అల్లుడి వెనకే రోడ్డు దాకా వెళ్ళి- అతణ్ణి ఆటో ఎక్కించాడు.

వీధి గుమ్మందగ్గర నిలబడ్డ జయమ్మ లోపలికి వెడుతూ వాకిట్లో ఓ పక్కగా వున్న అల్లుడి సూట్ కేస్ పడగ్గదిలో పెట్టింది. అప్పుడే తిలక్ లోపలికి వచ్చాడు.

"అతను వెళ్ళాడా?"

"ఆ ఆటో ఎక్కించాను"

జయమ్మ ఓసారి భర్త మొహంలోకి చూసి, "మిమ్మల్ని చూస్తే నాకు భయం వేసిందండీ- ఎక్కడ ఝాన్సీ రాసిన ఉత్తరం గురించి అల్లుణ్ణి నిలేస్తారోనని"

"అలా ఎందుకు అనుకున్నావ్?"

"మీనైజం తెలుసు కదా?"

"అవును- అడిగేవాణ్ణే. పనిమీద వెడుతు న్నాడని ఆగిపోయాను. కానీ అతను చేసే పన్లు మంచి వంటావా? మనల్ని మనం అదుపులో పెట్టుకోవాలి కదా. చదువు వుంది, సంస్కారం వుంది. ప్రజల డబ్బు దోచుకుతినడం తప్పని తెలిసి రొంపిలో పడుతోన్నప్పుడు-భార్యా లేకపోతే అయిన వాళ్లు బాధపడి, ఒకటిరెండు హితవాక్యాలు- అదీ పరోక్షంగా చెబితే తప్పా. ఇదేపని మన బోసు చేసివుంటే- వాడ్ని మెడపట్టుకుని వీధిలోకి గెంటేవాణ్ణి. ఝాన్సీ రాసింది చద వగానే నా గుండెలు కుతకుతా ఉడికిపో యాయి తెలుసా?"

"కొందరు గట్టి దెబ్బ తగిల్తేగానీ - వెనక్కి తిరిగి చూసుకోరు. ఏంచేస్తాం మీకు చేతన యితే నెమ్మదిగా మూడోకంటికి తెలియ కుండా, మీ వియ్యంకుడు గాంధీగారి చెవిన వేయండి. అంతకన్నా మనం చేయగల్గింది ఏంలేదు"

"అలా అంటావా?"

"ఇంతకన్నా నాకు మార్గం వుందని తోచ టంలేదు"

★ ★ ★

చైతన్య, భైరవిల కొత్తకాపురం చైత్ర మాసం నాటి సాయంకాలంలా, వర్షాకాలపు




నీరెండలా, శరత్ కాలపు వెన్నెలలా, శిశిరపు చలి సందడిలా చక్కగా సాగిపోతోంది. ఇద్దరూ ఉదయమే లేచి స్నానాలు చేస్తారు. వెంటనే మెడిటేషన్ చేస్తారు. టిఫిన్లు, కాఫీ, ఆపైన వంటపనులూ జంటగా చేసుకుంటారు. ఆనందంగా ఒకే కంచంలో భోంచేస్తూ, రుచులకు తోడుగా చిన్నచిన్న కబుర్లనే నవరసాలు గుప్పించుకుంటారు. ఆ పైన స్కూటర్‌మీద చూసేవారికి మేడఫర్ ఈచ్ అదర్‌లా కన్పిస్తూ కళ్ళు కుట్టేటట్టుగా ముందుకు దూసుకుపోతారు. చైతన్య డ్యూటీమీద బయట ఊళ్లకి వెడితే భైరవి కాలక్షేపంకోసం రాణిగారి వాటాలోకి వెడుతుంది. రాణీ కూడా భైరవితో కలుపుగోలుతనంతో ఉంటుంది. అలా రెండు నెలలు గడిచిపోయాయి.

ఆరోజు ఆదివారం. భైరవీ, చైతన్య ఇంట్లోనే ఉన్నారు. భైరవి టిఫిన్ చేసింది. ఇల్లంతా శుభ్రంచేసింది. తలంటుకుంది. చైతన్యకూ తలంటింది. ఆదివారం అలవాటుగా ఓ ఇంగ్లీషో, తెలుగు నవలో పట్టుకుని కొంత దూరం వరకూ ఒకరూ, ఆ తరువాత మరొకరూ చదువుతారు. నవల్లోని పాత్రలు ప్రాణంపోసుకుని కదిలినట్టు అన్పిస్తుంటే ఆశ్చర్యంగా ఉంటుంది. వివిధ పాత్రల మధ్య ఆప్యాయతలు, ఆనందాలూ నవ్వు తెప్పించినా లేక అవి తమ బాధల్నీ కన్నీటిని ఛాయా మాత్రంగా చూపించినా మరో లోకంలోకి వెళ్ళి వచ్చినట్టుగా ఉంటుంది. లోతుగా వెళ్ళి చర్చించుకుంటారు!

"షెల్ఫ్‌లో ఉన్న ప్రతి పుస్తకం, యోగనిద్రలో ఉన్న రుషుల్లా అన్పిస్తాయి. ఆశ్చర్యం ఏమిటంటే తెరవగానే పాఠకుని హృదయంలోకి సుభాషితాలు, జీవితసత్యాలూ కూడా ఎంతో సౌమ్యంగా విన్పిస్తాయి"

"ఈ విశ్వసాహిత్య సృష్టియే అయివుండకపోతే మనుషులు ఏమయిపోయి ఉండేవారో? " అంది భైరవి ఆలోచిస్తూ.

"ఏమవుతారు? మనిషి పురోగమించడం మానేసి, దశలవారీగా వెనక్కి వెళ్లి, తిరిగి పశుదశకు, కీటకదశకు చేరుకునేవాడేమో..."

"అలా ఎందుకు అనుకోవాలి? ఎదుటిమనిషినుంచి నేర్చుకునేవాడుగా"

"అవతలివాడికి నేర్పాలంటే చెప్పేవాడికి బ్యాక్‌గ్రౌండ్ ఎక్కడినుంచి వస్తుంది? మౌఖిక సాహిత్యం అనేమాట మనం విన్నదే. తన నోటివెంట కథలు చెప్పేవాడు, చెవితో వినేవాడూ జమ అయినప్పుడే పరిణామానికి విత్తు పడుతుందని చాలామంది అంటారు"

"అవును, అవును" అంది భారంగా ఊపిరివదుల్తూ, నవ్వుతూ భైరవి. అంతలో కాలింగ్‌బెల్ మోగింది. భైరవి వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా తల్లి... వదిన కన్పించారు.

"అమ్మా" అంది భైరవి ఆనందాన్నీ, ఆశ్చర్యాన్ని పట్టలేక.

"రా వదినా, రామ్మా" అంటూ చైతన్య వైపు తిరిగింది. అప్పటికే చైతన్య సోఫాలోంచి లేచి చిరునవ్వుతో వారిని చూస్తూ, "రండి మా ఇల్లు ఈరోజు పావనం అయ్యింది" అనేశాడు.

"ఎలా ఉన్నారు తమ్ముడుగారూ... ఎలా ఉన్నావు భైరవీ" అంటూ ఝాన్సీ భైరవి పక్కన కూర్చుంది. ఆమె పక్కన కాంతమ్మగారు కూర్చుంటూ.

"ఈవేళటికిగానీ కుదరలేదు మీ ఇంటికి రావడం ఏమీ అనుకోకు బాబూ" అంది.

"ఫర్వాలేదండి. మీరు పెద్దవారు. అసలు మేమే మీ ఇంటికి రావాలనుకున్నాం. కానీ వచ్చి సత్యమూర్తి బావగారి మనసు కలత పెడతామేమోనని ఆగిపోయాం"

"లేదు... తమ్ముడూ. నెమ్మదిగా ఆయనకి తను తొందరపడ్డానని తెలిసి వస్తోంది. అప్పుడప్పుడు మీ గురించి అడుగుతారు"

"నిజమా వదినా? "

"రక్తసంబంధం ఆపేక్షా అంటే అదే

నమ్మా"

"నాన్నగారు వాడితో ముభావంగా ఉండడంతో వాడికీ అర్థమయింది"

భైరవి లోపలికి వెళ్ళి నాలుగు కాఫీలు తెచ్చింది. నలుగురూ తాగారు.

"మాలాగే మీ అన్నయ్య కూడా ఏదో రోజు మీ ఇంటికి రావచ్చు. ఆయనకీ లోపల మీ పెళ్ళి మన ఇంట్లో జరగకుండా చేయడం మీరు వచ్చిన సమయానికి ఇంట్లో ఉండకపోవడం తన తప్పని అన్పిస్తోంది. నిజం తమ్ముడూ"

"పోనీలెండి... మనుషులమధ్య స్పర్థలు పోయి, దూరం అనేది తగ్గడం మంచిదే"

భైరవి లేచి కిచెన్‌లోకి వెళ్ళి అక్కడ ఉన్న డబ్బాలు ఒకటిరెండు తెరిచి టిఫిన్ చేయడానికి సన్నాహాలు మొదలుపెట్టింది. ఝాన్సీ కూడా కిచెన్‌లోకివెళ్ళి,

"ఇప్పుడు టిఫిన్ దేనికి, మనం కబుర్లు చెప్పుకుందాం... ఈ తతంగం ఆపుచేయి" అంది.

"నువ్వు మాట్లాడుతూ ఉండు. నేను పూరీ-కూరా తయారుచేస్తాను. నా చెవేమో నీకు, నా చెయ్యి స్టౌమీద బాణలికీ కేటాయిస్తాను" అంటూ నవ్వేసింది.

కాంతమ్మగారు తనతో తీసుకువచ్చిన పళ్ళు ఓ ట్రేలో పెట్టింది.

"భైరవీ! మీరు ముగ్గురూ ఇక్కడ కుస్తీ పడుతున్నారుకదా, నేనోసారి రోడ్డుదాకా వెళ్ళి వస్తా" అన్నాడు.

"దేనికట?"

చైతన్య భైరవికి కళ్ళతో సంజ్ఞచేసి ఆమెను బాల్కనీలోకి తీసుకువెళ్ళి,

"మొదటిసారి మీ అమ్మగారు, వదినా వచ్చారుగా... వాళ్ళను ఒట్టి చేతుల్తో పంపించకూడదుకదా... రెండు చీరలు తెస్తాను" అన్నాడు.

"ఓ... నీ బుర్ర షార్ప్... నాకా ఆలోచన రానేలేదు. సరే... లాకర్‌లో డబ్బుంది, తీసుకువెళ్ళు"

చైతన్య ఏమీ ఎరగనట్టు మెట్లు దిగి స్కూటర్ తీసుకుని బయలుదేరాడు. పది నిముషాల్లో భైరవి టిఫిన్ చేసింది.

"అతను ఎక్కడికి వెళ్ళాడే?"

"ఇప్పుడే వచ్చేస్తారు. నువ్వూ, వదినా టిఫిన్ తినండి"

"అతను వచ్చిన తరువాత తిందాం"

భైరవి ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా, "వదినా... చిన్నబావ నిన్నటినుంచీ ఒకసారి కూడా ఫోన్ చేయలేదు. ఏం చేస్తున్నట్టు? మీతో రాలేదేం?" అని అడిగింది.

"నిన్న మా నాన్నగారు ఫోన్ చేశారు. అందుకే విజయవాడవెళ్ళాడు"

"అలానా... నాకు తెలుసు వదినా... బోసుబావ అంత త్వరగా విజయవాడ ఎందుకు పరిగెట్టిందీ. ఇక్కడ ఉద్యోగం దొరికింది. అక్కడ పెళ్ళి సంబంధం స్థిరపడపోతోందేమో... అదృష్టవంతుడు"

ఇంట్లో బ్రహ్మచారులూ, బ్రహ్మచారిణులూ ఉండడం మంచిదికాదు. వాడి పెళ్ళి కూడా అయిపోతే మా అమ్మకు తోడుగా ఉంటుంది. వాళ్ళనీ నేను ఈ ఊరు వచ్చేయమంటున్నాను. ఎలా ఉందంటావ్... నా ప్రపోజల్"

"బ్రహ్మాండంగా ఉంటుంది"

కిచెన్‌లో పన్లు పూర్తి చేసుకుని భైరవీ ఝాన్సీలు ముందు గదిలోకి వచ్చారు.

"భైరవీ... మీ ఇల్లు అయితే బాగానే ఉంది. కానీ ఆఫీసుకు దూరం. ఇంతకీ ఈ ఇల్లు ఎవరిది? ఇంటివాళ్ళు నీతో మంచిగా ఉంటారా?" అడిగింది ఝాన్సీ.

"ఇంటివాళ్ళు కాదు ఇంటామె. ఆమెగారి పేరు రాణి. నీ వయసే ఉంటుంది. వాళ్ళకి పిల్లలు లేరు. ఇద్దరే ఉంటారు. మాలాగే వాళ్ళిద్దరూ కూడా ఉద్యోగస్థులు. ఆయనకు ఈమధ్యనే విజయవాడ ట్రాన్స్‌ఫర్ అయ్యిందిట" అని,

"నేను మా ఇంటి యజమానురాలిని పరిచయం చేస్తాను. వెళ్దాం రండి" అంది.





"ఆమె ఏమన్నా అనుకుంటుందేమో? "

"ఏమీ అనుకోదమ్మా" అని భైరవి తల్లినీ, వదిననీ తీసుకుని కింద వాటా తలుపుకు ఉన్న కాలింగ్‌బెల్ నొక్కింది. తలుపులు తెరుచుకుని రాణి బయటకు వచ్చింది.

"పిలవని పేరంటానికి వచ్చాం రాణీ గారూ" అంటూ భైరవి నవ్వేసింది.

"ఇంకా నయం... లోపలకి రా" అంటూ కాంతమ్మగారివైపూ, ఝాన్సీవైపూ చూసింది. భైరవి తల్లినీ, వదిననూ పరిచయం చేసింది.

"మీ ఇంటావిడ అంటే ఇంకా నా వయసు ఉంటుందనుకున్నాను. నువ్వా చిన్నపిల్లవే..." అంటూ కాంతమ్మగారు రాణిని ఆమె పుట్టింటివారి గురించీ, అత్తింటివారి గురించీ అడిగింది.

"అమ్మా, నీ చాదస్తం పోనిచ్చుకున్నావ్ కాదు... రాణీగారు ఏమైనా అనుకుంటే కష్టం"

"పెద్దవాళ్ళు మన క్షేమం గురించే అలా అడుగుతారు. ఫరవాలేదు" అని నవ్వేసి,

"మా ఇల్లు చూద్దురుగాని రండి" అంటూ అంతా చూపించింది. దొడ్లోకి తీసుకువెళ్ళింది. తిరిగి ముగ్గురూ డ్రాయింగ్‌రూమ్‌లోకి వచ్చి కూర్చున్నారు. రాణీ ఫ్రిజ్ తెరిచి నాలుగు గ్లాసుల్లో కోకకోలా పోసి ఇచ్చింది.

"ఇంతింట్లో మీరిద్దరూ ఉంటారా? "

భైరవి నవ్వేసి అంది, "అమ్మా బావగారికి ఈమధ్యనే విజయవాడ ట్రాన్స్‌ఫర్ అయింది. వారం వారం వస్తారు. అక్క ఒకర్తే ధైర్యంగా ఉంటోంది"

"అవును... భయపడితే ఎలా? "

"వాచ్‌మన్‌ని పెట్టుకున్నాం. పై పోర్షన్‌లో వీళ్ళు వచ్చారు. నాకు కాలక్షేపం అవుతోంది భైరవితో..." అంది రాణి.

"వెడదాం పద భైరవీ, మళ్ళీ అతను వస్తాడేమో"

రాణి "ఉండండి..." అని బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది. ఝాన్సీ ఆ డ్రాయింగ్‌రూమ్ గోడలకున్న పెయింటింగ్స్ చూస్తూ ఓ పక్కగా ఉన్న ఫ్రిజ్ దాకా వెళ్ళి ఫ్రిజ్‌మీద ఉన్న ఫొటోచూసి ఒక్కసారిగా కళ్ళు పెద్దవిచేసి మాటలురాక అలాగే ఉండిపోయింది. గుండెనెవరో సుతిమెత్తని ఆయుధంతో పొడిచినట్లు, కళ్ళు తిరిగినట్టూ అయ్యింది.

"ఏమిటి అలా పరకాయించి చూస్తున్నావు వదినా? " అంటూ భైరవి కూడా ఝాన్సీ వెనక్కి వెళ్ళి ఫ్రిజ్‌మీద ఫొటో చూసింది. అందులో ఉన్న రాణీ, రాణి పక్కన ఉన్న అన్న సత్యమూర్తినీ చూసి, "ఇదేమిటీ" అనేసింది. అప్రయత్నంగానే ఫొటోని తన చేతుల్లోకి తీసుకుంది.

"ఏమిటి అక్కడేం చేస్తున్నారు? " అంటూ కాంతమ్మగారు అటుగా వెళ్ళి భైరవి చేతిలోని ఫొటో చూసింది.

అప్పుడే బెడ్‌రూమ్‌లోంచి రాణి అక్కడికి వచ్చింది. ఆమె చేతుల్లోని ట్రేలో రెండు జాకెట్ గుడ్డలూ, పువ్వులు, పళ్ళు ఉన్నాయి. "ఏమిటి చూస్తున్నారు? " అని భైరవి చేతిలోని ఫొటోని అందుకుని, "నేనూ, మావారూ" అంటూ చిన్నగా నవ్వుతూ తిరిగి దాన్ని ఫ్రిజ్‌మీద పెట్టింది.

"వెళతాం అమ్మా" అంది కాంతమ్మ తల వంచుకుని రాణీతో.

రాణి అక్కడే ఉన్న కుంకుమ భరిణి తీసుకుని ముగ్గురికీ బొట్లుపెట్టింది. జాకెట్ గుడ్డలు పెట్టింది.

"ఎందుకమ్మా? " అంది కాంతమ్మ.

"వెళతాం" అంటూ రెండు క్షణాల్లో ముగ్గురూ పై వాటాలోకి వెళ్ళారు. సోఫాలో కూర్చున్నారు. కానీ ఎవరు ఎవరితో ఏం మాట్లాడాలో, ఏం మాట్లాడితే గుండెలోపలి బాధ బైటపడి వాతావరణాన్ని కలుషితం చేస్తుందోనన్న భయంతో నిశ్శబ్దంగా ఉండిపోయారు. అప్పుడే చైతన్య వచ్చి తన చేతుల్లో పేకెట్టు భైరవికి ఇచ్చాడు.

కాంతమ్మగారు ఓసారి కోడలి మొహం

లోకి చూసి, "మనం వెడదాం, ఝాన్సీ" అంది నెమ్మదిగా.

ఝాన్సీ తల ఊపి, "భైరవీ... మేం వెడతాం" అని చిన్నగా కేకేసింది.

చైతన్య గదిలోంచి బయటకు వచ్చి "అప్పుడేనా... టిఫిన్ తినాలికదా. భైరవి టిఫిన్ తెస్తోంది" అని ఝాన్సీ మొహం చూసి,

"మీరేమిటి అలా ఉన్నారు? " అన్నాడు.

"ఏంలేదు"

భైరవి లోపలినుంచి కొత్తచీరలు తెచ్చి, "అమ్మా చైతన్య మీకోసం చీరలు తెచ్చాడు. తీసుకోండమ్మా" అంటూ ఇద్ద రికీ బొట్లుపెట్టి వాటిని ఇచ్చింది. అలాగే టిఫిన్ పెట్టింది. పది నిముషాల్లో అందరూ టిఫిన్లు తిన్నారు.

"నువ్వు వెళ్ళి ఆటో తీసుకురా" అంది భైరవి చైతన్యను చూసి.

చైతన్య తిరిగి బైటకు వెళ్ళాడు.

"అమ్మా నువ్వు మనసు పాడుచేసు కోకు. చూసింది మర్చిపో" అని వదినగారి దగ్గరకు వెళ్ళి, "మా ఇంటికి మొదటిసారి వచ్చావు వదినా ఇలా ఇక్కడ నీకు ఈ దారుణమైన దృశ్యం చూడవల్సివచ్చింది. మీరు నా ఇంటికి రాకుండా ఉన్నా ఈ బాధ తప్పేదేమో"

ఝాన్సీ మాట్లాడలేదు. భైరవి తల్లి దగ్గ రకు వెళ్ళి, "అమ్మా, నువ్వు మనసు పాడు చేసుకోకు. ఎలా జరగాలని ఉంటే అలా జరుగుతుంది. తొందరపడి అన్నయ్యను నువ్వేమీ అడగొద్దు. మనింట్లో అశాంతికి చోటివ్వొద్దు. నాన్నగారికి తెలిస్తే బాధపడ తారు. ఒకరితో ఒకరు ఘర్షణలు పడ్డం వల్ల కలిసొచ్చేది ఏం ఉండదు. సరేనా" అంది. అలాగే వదినగారి దగ్గరకు వెళ్ళి "నిన్ను ఏమని ఓదార్చాలో నాకు తెలియ డంలేదు. చూద్దాం. ఇలాంటివాటికి పరి ష్కారం పైవాడు చూపవల్సిందే. మన చేతుల్లో ఏం ఉండదు"

ఝాన్సీ జవాబు చెప్పలేదు. కళ్ళెత్తి భైరవి కళ్ళల్లోకి చూసింది.

చైతన్య ఆటో తీసుకువచ్చాడు. కాంత మ్మగారూ, ఝాన్సీ మెట్లు దిగి కిందికి వెళ్ళారు. గేటు తెరిచింది భైరవి. గేటు చప్పుడుకు రాణీ బయటకు వచ్చి తను కూడా బయటకు వెళ్ళింది.

"వస్తాం భైరవీ... వస్తాం అమ్మా" అని కాంతమ్మ రాణిని చూసి చెప్పింది.

ఇద్దర్నీ ఎక్కించుకుని ఆటో బయలుదే రేముందు ఝాన్సీ రాణివైపు చూసింది. అందంగా ఉన్న రాణి కన్పించింది. 'ఆమె కళ్ళు తిప్పుకోలేని అందగత్తెకాదు, ఆమె గుండెలు, నడుం, పొడగరితనం, కళ్ళు, ముక్కు... ఏ అవయవం తన శరీరభాగా లతో పోటీపడలేవు' అని అన్పించింది ఝాన్సీకి. కానీ అలాగని భర్తకు తనలో కన్పించని ఆకర్షణ, తను అందివ్వలేని ఆనందం ఏదో రాణి సాంగత్యంలో అందు బాటులోకి ఉండి ఉంటాయని సరిపెట్టుకో వాలన్నా మనసు ఒప్పుకోలేదు. తనలో అనుకోకుండా బాధకు అంకురార్పణ చేసిన రాణీని చూస్తే మొదట ఈర్ష్య, ఆపైన కోపం పుట్టాయి. మరో స్త్రీని చేరదీసి పరో క్షంగా కట్టుకున్న భార్యకు అవమానం కానుకగా ఇచ్చే చాలామంది మగవాళ్ళ జాబితాలో చేరిన భర్త గుర్తురాగానే ఆమె వళ్ళు దహించుకుపోతున్నట్టు అన్పిం చింది.

"చూడు ఝాన్సీ... మన ఇద్దరికీ తెలి యకూడని నిజమే తెలిసిందమ్మా. నువ్వు ఆవేశపడకు. వాడు ఇటువంటి పన్లు చేయడం తప్పు. మనం ఓపిక పట్టి తెలి విగా వాడ్ని అటునుంచి మళ్ళించాలి. నేను ఆయనతో మాట్లాడతాను. నీ బాధ నాకు తెలుసు" అంది దారిలో కాంతమ్మగారు




కోడలితో... ఝాన్సీ ఏం మాట్లాడలేదు. తల వంచుకునే ఉంది.



కాలింగ్ బెల్ మోగితే రాణి వ్యూయర్ లోంచి సత్యమూర్తిని చూసి తలుపు తెరిచింది.

"ఏమిటీ నిద్రపోతున్నావా?"

"తిన్నాను, నిద్రపోతున్నాను. అంతకన్నా ఏం చెయ్యాలి. అవునూ నువ్వు వారంగా కేంప్‌లోనే ఉన్నావా? నీ గురించి ఫోన్ చేసి చేసీ విసిగిపోయాను"

"నేను చెప్పానుకదా, విశాఖపట్టణం వెళుతున్నానని"

"అక్కడినుంచి ఫోన్ చేయచ్చుగా. రాత్రుళ్ళు కూడా తీరికలేకుండా ఉన్నావా?"

"ఎవరో పార్టీలు రావడంతో అక్కడినుంచి విజయవాడ, గుంటూరు వెళ్ళాం" అంటూ వారంగా తనూ, విశ్వనాథంగారూ ఎక్కడెక్కడికి వెళ్ళవలసి వచ్చిందీ చెప్పాడు.

రాణీ అతను చెప్పిందంతా విని, "ఓ మాట చెప్పనా మూర్తీ" అంది.

"చెప్పు"

"చూడు... మనల్నీ, మనం చేసే పన్లనీ ఎవరూ గమనించడంలేదని అనుకోవద్దు. డబ్బును చూస్తే అది అయాచితంగా వస్తూంటే వద్దనడం ఇబ్బందికరమే. కానీ అనుకోనిది జరిగితే ఏమవుతుందో ఆలోచించు. మన పరువూ, మర్యాదా పోవడమే కాకుండా అయినవాళ్ళముందు కూడా తల వంచుకోవల్సిన పరిస్థితి వస్తుంది. అలాంటి పరిస్థితుల్లో ఎవరూ కాపాడ్డానికి రాక మనం ఏకాకులమయ్యామని తెలిసినా చేయగలిగిందేమీ ఉండదు"

"అంత తెలివి తక్కువగా నేనే పనీ చేయనులే. తగు జాగ్రత్తలు తీసుకుంటున్నాను. నువ్వు భయపడకు"

"ఏమో... ఏదో మంచిరోజు చూసి లెంపలు వేసుకుని, నువ్వు ఇలాంటి పన్లకి మంగళహారతి పాడ్డం మంచిది"

"మా ఆవిడైనా నీలా నాకు ఎప్పుడూ హితబోధ చేయలేదు తెలుసా?"

"తాళి కట్టించుకున్న మనిషి కాబట్టి మీ ఆవిడ ఇలాంటివి నీకు చెప్పడానికి భయపడి ఉంటుంది. నాకేం భయం. నీ దగ్గర ఆవిడ తీసుకోలేని చనువు నేను తీసుకోగలను. కాదంటావా?"

"లేదు. నీ మాటలు... అవి ఏవైనా నా చెవుల్లోంచి సరాసరి హృదయానికి చేరతాయి. నేను పరాకుగా ఉన్నా అప్పుడప్పుడు గుసగుసలుగా, హెచ్చరికలుగా నన్ను పీక్కుతింటాయి. నిజం..."

"పేరేమో సత్యమూర్తి. చెప్పేవన్నీ అబద్ధాలు. నాకు తెలుసు" అంటూ కిలకిలా నవ్వేసింది రాణి. సత్యమూర్తి రాణీ నవ్వులోని కన్పించని రాగాలకు వివశుడై సోఫాలోంచి లేచి, ఆమె పక్కన జేరి ఓసారి గట్టిగా వాటేసుకున్నాడు.

"దూరంగా జరుగు. ఈవేళ శనివారం నాకు"

"నువ్వు శనివారాలు చెయ్యవు. గురువారాలు చేస్తావు. నీదీ అబద్ధమే"

"నా అబద్ధం వెనక ఓ అర్థం ఉంది. కోరికుంది"

"ఏమిటీ?"

"అదే, చాలారోజుల క్రితమే చెప్పానుగా"
"నాకు గుర్తులేదు"
"మన పెళ్ళిమాట"
"మళ్ళీ మొదలుపెట్టావా? "
"అవును... పెళ్ళిపాటే పాడతాను. నువ్వు సరే అనేవరకూ"
"ఓ మాట చెప్పనా? "
"చెప్పు"
"ఇంకో రెండేళ్ళు ప్రభుత్వ ఉద్యోగం చేసి ఆ తరువాత రిజైన్ చేసిపారేద్దామని నేనూ, మా బాస్ విశ్వనాథంగారూ ఓ గట్టి నిర్ణయానికి వచ్చాం. ఇప్పుడు మన దేశంలోకి ఎంతోమంది మల్టీ నేషనల్స్ వస్తున్నారు. వాళ్ళ ఆర్గనైజేషన్‌లోకి వచ్చి సర్వే చేయమని అడుగుతున్నారు"
"అలానా? " అంది.
"మరి నువ్వేమంటావ్? "
"అంతవరకూ మన పెళ్ళి వాయిదా వేయవద్దంటాను"
"రెండేళ్ళలో పుట్టి మునిగిపోదుగా... మనం వయసులో ఉన్నాం. నీకీ కంగారు ఎందుకో నాకు అర్థంకాదు"
రాణి ఓసారి సత్యమూర్తి మొహంలోకి చూసి అతని పక్కనుంచి లేచివెళ్ళి సింగిల్ సోఫాలో కూర్చుంది.
"పై పోర్షన్ అద్దెకు ఇచ్చానన్నావ్‌గా... ఇంతకీ అందులోకి దిగింది ఎవరో చెప్పలేదు. వాళ్ళు ఎవరట? " అనడిగాడు మాట మార్చడంకోసం.
"మనలాంటి మనుషులే. కొత్తగా పెళ్ళి చేసుకున్నారు. ఇద్దరూ ఉద్యోగస్థులు" అంది.
"అయితే నీకు కాలక్షేపానికి లోటు లేదనుకుంటాను"
"ఈ సాయంకాలం ఆ అమ్మాయి అమ్మగారూ, వదినా వచ్చారు. మనింటికి కూడా తీసుకువచ్చింది" అని చెప్తోంది.
ఇంతలో కాలింగ్‌బెల్ మోగడంతో రాణి తలుపు తెరిచి "రా భైరవీ, 'రండి చైతన్య గారూ" అంటూ ఇద్దర్నీ లోపలికి ఆహ్వానించింది. లోపలకి వస్తూన్న భైరవీ, చైతన్యా సత్యమూర్తిని చూశారు. సత్యమూర్తీ చెల్లెల్నీ, చైతన్యనీ చూశాడు. అప్పుడు ఆ ముగ్గరికీ కూడా ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో తెలియలేదు. గుండె గొంతుకలోకి వచ్చినట్లయింది.
"మేం వెళతాం. మీరుపనిలో ఉన్నారనుకుంటాను. రేపు నేనూ, భైరవీ తిరుపతి వెడదాం అనుకుంటున్నాం. ఆ మాట చెప్పడానికి వచ్చాను"
"అది సరే... మావారు విజయవాడ నుంచి శలవుపెట్టి అరగంట క్రితమే వచ్చారు. వారిని మీకు పరిచయం చేస్తాను" అని రాణి, ఈమె భైరవి, ఆయనపేరు చైతన్య... వీరేనండీ మావారు. పేరు సత్యమూర్తి. డిఫెన్స్ ఫ్యాక్టరీలో అసిస్టెంట్ సెక్రటరీగా ఉంటున్నారు. చైతన్యా, భైరవీ మౌనంగా సత్యమూర్తికి నమస్కరించారు. సత్యమూర్తి తనకు తానుగా కుదించుకుపోతూ తల దించుకున్నాడు.
"వెళతాం రాణీగారూ" అంటూ భైరవి తలుపువైపు అడుగులేసింది. చైతన్య ఆమెవెనకే వెళ్ళాడు.
"అదేమిటీ వాళ్ళు పలకరిస్తూ ఉంటే అలా బెల్లంకొట్టిన రాయిలా ఉండిపోయావు. ఏమయ్యింది, నీకు" అంది రాణి సత్యమూర్తిని చూస్తూ నెమ్మదిగా.
"వాళ్ళు నాకు తెలుసు"
"తెలుసా? ఎలా తెలుసు... ఎక్కడ పరిచయం? "
"అది ఎవరనుకుంటున్నావు. అది నా చెల్లెలు, అతగాడు దాన్ని ప్రేమించి పెళ్ళి చేసుకున్నవాడు... నువ్వు నా కొంప ముంచావు రాణీ... నువ్వు పైవాటా అద్దెకిచ్చేముందు నాతో చెప్పద్దా... నేను పెద్ద ప్రమాదంలో పడ్డాను. మన విషయం ఇక దాగదు. మా ఇంట్లో తెలుస్తుంది"
"అలానా... మధ్యాహ్నం వచ్చింది మీ




అమ్మగారూ, నీ భార్యానా... మీ అమ్మగారి పేరు కాంతమ్మగారు. నీ వైఫ్ పేరు ఝాన్సీ... ఓహ్!" అనేసింది రాణి.

"నేను ఇంటికి వెడితే అందరూ నన్ను నిలేస్తారు"

రాణి మాట్లాడలేదు.

"నాన్నకీ, అమ్మకీ, ఝాన్సీకీ నేనంటే అపనమ్మకం ఏర్పడుతుంది"

రాణి తిరిగి మాట్లాడలేదు.

"ఎంత రిస్క్‌లో పడేశావు నన్ను" అంటూ సోఫాలోంచి లేచాడు సత్యమూర్తి.

"ఇప్పుడు ఎక్కడికి వెళతావు? వెళ్ళి ఏం చేయాలని? కాస్త మనసు కుదుటపర్చుకో, కంగారుపడకు కూర్చో" అని అతని చెయ్యిపట్టుకుని సోఫాలో కూర్చోపెట్టింది.

"బాగా చేశావు. పైగా కంగారుపడొద్దని అంటున్నావ్... నీకేం? "

రాణి అతని పక్కన కూర్చుని అతని చేతులు తనచేతుల్లోకి తీసుకుని "ఆడపిల్లలా ఏమిటది? ఊరుకో... నిజాన్ని దాచిపెట్టడం మనవల్ల అయ్యేపనికాదు. ఈవేళ కాకపోతే రేపైనా మన గురించి మీ వాళ్ళకు తెలిసేదే. పరిష్కారం ఆలోచించాలిగానీ బాధపడితే ఏలాభం? "

"అంటే నన్నేం చేయమంటావ్? ఇంటికి వెళ్ళి అందరిముందూ నిలబడి నిన్ను నేను ఉంచుకున్నాననీ, మనిద్దరిమధ్యా వ్యవహారం నడుస్తోందని చెప్పమంటావా? " గద్దిస్తూ అడిగాడు సత్యమూర్తి.

"అవసరం అయితే చెప్పవల్సివస్తుంది మూర్తీ. నీ దృష్టిలో, నీ హృదయంలో నాకే స్థానం ఇస్తున్నావో అదే వాళ్ళకి అర్థం అయ్యేటట్టు చెప్పు"

"నా భార్య ఒట్టి మనిషికాదు. ఆమె ఏదైనా అఘాయిత్యం చేసుకుంటే నేనెక్కడ ఉంటాను. నా బతుకు ఏమవుతుంది? "

రాణి తల వంచుకుని బొమ్మలా ఉండిపోయింది. ఆమెకు చటుక్కున తనకళ్ళు చెమ్మగిల్లిన విషయం అర్థమయ్యింది. అలాగే చిన్నపిల్ల కానిమూలంగా ఆమెకు సత్యమూర్తి మాటలూ, ఆ మాటల్లోని ఆంతర్యం, అర్థం అవుతున్నాయి. పరాయి మనిషిని తన ఆనందంకోసం, అక్కరకోసం చేరదీసిన మొగాడు పరిస్థితులు ఎదురు తిరిగినప్పుడు తను ఎటువైపు మొగ్గుతాడో చెప్పకనే చెప్తోంది సత్యమూర్తి కంఠం. సంఘంలో తన స్థానం, తన గౌరవం బెడిసిపోతాయని తెలియగానే ఆత్మరక్షణకోసం ఏ స్థితికి దిగజారగలడో చెప్తోంది సత్యమూర్తి ఆంతర్యం.

కానీ తనకు ఏమీ మిగలని క్షణాలు ఎదురవుతాయనీ, తనకు చేయి అందించినవాడు ఆ చేయిని విదిలించుకుపోతాడనీ రాణీ ఊహించలేదు. చిన్నపిల్లలా జీవిత పరమార్థం ఏమిటని తనని తను ప్రశ్నించుకున్న రాణీకి జవాబుగా తన జీవితం తనకు విషాదాన్ని చేత ఉంచుతుందని అనుకోనూలేదు.

తలుపువరకూ వెళ్ళి "నే వెడుతున్నాను. తలుపు వేసుకో" అన్న సత్యమూర్తి మాటలు విని కూడా రాణీ సోఫాలోంచి లేవలేకపోయింది.

సత్యమూర్తి గేటు తెరుచుకుని స్కూటర్ పోర్టికోనుంచి రోడ్డుమీదకి దింపి అది ఎక్కి స్టార్ట్ చేయబోయాడు.

"బావగారూ నేను చైతన్యను. నాకు మెయిన్‌రోడ్ దాకా లిఫ్ట్ ఇస్తారా? మీ చెల్లాయికి తల నొప్పి మాత్రలు కావల్సివచ్చాయి. కొనవలసివుంది. నా బండి నడవడంలేదు. ప్లీజ్" అన్నాడు.

సత్యమూర్తికి ఏమనాలో తెలియలేదు. అప్పటికే చైతన్య బండి వెనకసీటు ఎక్కడానికి సిద్ధం అవుతున్నాడు. ఎవరికీ వినబడనంత నెమ్మదిగా 'సరే' అన్నాడు- ఆ మాటలో అయిష్టం, ఉక్రోషం కనబడనీయకుండా!

"మీరు బండి కొంచెం నెమ్మదిగా నడిపితే నేను మాట్లాడేది మీకు వినిపిస్తుంది. లేక

పోతే ఏ ఇరానీ కేఫ్ దగ్గరయినా ఆపండి. చాయ్ తాగుదాం"

"నేను అర్జంటుగా ఇంటికి వెళ్ళాలి"

"ప్లీజ్... లెఫ్ట్ సైడ్‌కి టర్న్ చేయండి... తాజ్ రెస్టారెంట్ కన్పిస్తుంది"

సత్యమూర్తికి రెస్టారెంట్ దగ్గర బండి ఆపక తప్పలేదు. చైతన్య ముందూ వెనక సత్యమూర్తీ రెస్టారెంట్‌లోకి వెళ్లి ఓ మూలగా కూర్చున్నారు.

"నాకు తెలుసు. మీలాంటి ఆఫీసర్లు ఇటు వంటి ఇరానీ కేఫ్‌ల్లోకి రారని. మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నాను. కానీ ఓ విషయం, ఇక్కడ మనల్ని ఎవరూ పోల్చుకోరు. మధ్య తరగతి ప్రజానీకమే అనుకుంటారు"

"అసలు విషయం చెప్పండి" అని సత్య మూర్తి చేతి వాచీ చూసుకున్నాడు.

"ఏంలేదు, అత్తయ్యగారూ అక్కయ్యగారూ ఇందాకా మా ఇంటికి వచ్చినప్పుడు మీకు మామీద కోపం పోయిందనీ, నన్నూ భైర వినీ క్షమించారనీ చెప్పారు. మీరు సహృద యంతో మమ్మల్ని అర్థం చేసుకున్నారు కాబట్టి మనం అయినవాళ్లుగా ఇంకా ఇంకా మంచి స్నేహితులుగా ఉండవచ్చునని నేను ఆశపడుతున్నాను"

"నిజమే- ఓ గంటక్రితంవరకూ నా అభి ప్రాయం అదే. కానీ నేను పొరబడ్డానని ఇప్పుడు అర్థమయింది"

"అంటే? !" నెమ్మదిగా అడిగాడు చైతన్య.

"చైతన్యా... నువ్వు చాలా తెలివయినవా డివి. నీకు నేను చెప్పాలా? వెనకనుంచి పొడవడం నీకు జన్మతః అలవాటో లేక నీ ఉద్యోగం నీకీ బుద్ధులు నేర్పిందో నాకు అర్థం కావడంలేదు"

"ఎదుటివారి సంగతి మీకు తెలిసిన ప్పుడు... మీ సంగతి కూడా ఎదుటివారికి తెలుస్తుందేమోనని మీరు గ్రహించిఉండాలి"

"నేనెవరనుకుంటున్నావ్? నాకు నీతులు చెప్పొద్దు. నాకు అన్నీ తెలుసు. నువ్వు తెలిసి కావాలనే రాణీ ఇంటిలోకి అద్దెకు దిగావ్. నన్ను నా వాళ్ళు అపార్థం చేసుకుం దుకే మా అమ్మనీ, నా భార్యనీ, నా చెల్లెల్నీ రాణీ వాటాలోకి పంపావ్..."

"సారీ బావగారూ"

"నువ్వు... నువ్వు" అని ఆగిపోయాడు క్షణం. తిరిగి అన్నాడు. "రాణి నాకు కావల్సిన మనిషి... పెళ్ళికిముందే మేం ప్రేమించుకున్నాం. కానీ ఆమెకు మరొక రితో పెళ్ళి అవడం- ఆమె కాపురం భగ్నం అవడం జరిగింది. ఆమె చితికిన బతుకు చూసి జాలితో ఆమెకు నేను అండగా, దిక్కుగా నిలబడ్డాను. ఆమె నన్ను భర్తగా పరిచయం చేసినంతమాత్రాన నేను ఆమె భర్తని అవను. అది గుర్తువుంచుకో"

"ఆమె ఎవరూ, మీరు ఎవరూ అని నేను అడగలేదు. మీరే అనవసరంగా కంగారుప డుతున్నారు"

"కంగారుపడాల్సిన అవసరం నాకేంలేదు. నన్ను భయపెట్టాలని ప్రయత్నించకు... నీలాగే నేనూ నీ గతచరిత్ర తవ్వగలను. నీకూ రాణీకి మధ్య ఏ చుట్టరికం ఉందో అదీ బయటకు లాగగలను. అలాగే అన్నీ చెప్పి భైరవినీ నమ్మించగలను. అందుకే చెపుతున్నాను. ఏ ఉద్దేశంతో నువ్వు రాణీ ఇంట్లో అద్దెకు దిగావో నాకు తెలుసు. నువ్వు నిజాయితీపరుడివయితే ముందు ఆ ఇల్లు ఖాళీ చేయి. అంతే" అని హోటల్ నుంచి విసవిసా బయటకు వచ్చి బండి ఎక్కి దాన్ని స్టార్ట్ చేశాడు.

చైతన్య సత్యమూర్తి వెళ్ళినవైపు చూశాడు. అతనికి క్షణం ఆశ్చర్యం వేసింది. ఆ తరు వాత ఆలోచిస్తే మనుషుల్లో అవకాశవా దులు సమయాన్ని బట్టి అవతారాలు ఎలా మార్చగలరో, ఎలా మారుస్తారో అర్థమ యింది. ఇంకా ఆలోచిస్తే మనుషుల్లో తమ గుణగణాలకు విలువ ఇవ్వడం మానేసి, ఇంకా వాటిని కించపరుస్తూ, అవి దిగువస్థా యికి దిగజారే ప్రయత్నాలు చేయడానికి వెరవనివారు కూడా ఉంటారనీ సత్యమూర్తి





ఆ కోప మనిషనీ చైతన్యకి అర్థమయింది. నెమ్మదిగా హోటల్ బయటకు వచ్చి ఇంటి వైపు నడక సాగించాడు.

★ ★ ★

సత్యమూర్తి తన ఇంటి గుమ్మం ఎక్కుతూంటే అతనికి కాళ్లు తడబడ్డాయి. గొంతు తడి ఆరింది. దగ్గరగా వేసి ఉన్న తలుపులు తోసుకుని లోపలికి వెళ్ళాడు. డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చుని ఏదో ఆధ్యాత్మిక పుస్తకం చదువుకుంటూన్న తల్లి కనబడింది. తండ్రి గదిలో లైటు వెలుగుతోంది. అతను మౌనంగా తన గదిలోకి వెళ్ళాడు. మంచం మీద ఓ వైపుకు వత్తిగిలి పడుకున్న ఝాన్సీ అలికిడికి తలతిప్పి చూసింది. సత్యమూర్తి తువ్వాలు భుజంమీద వేసుకుని బాత్‌రూమ్‌లోకి వెళ్ళి స్నానంచేసి లుంగీ కట్టుకుని తిరిగి హాల్లోకి వెళ్ళి "అమ్మా మనం భోజనం చేద్దామా? " అని అడిగాడు.

"నాకూ, నాన్నగారికి ఈవేళ ఆదివారం. నువ్వూ ఝాన్సీ తినండి" అంది.

సత్యమూర్తి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి, "అన్న తిందాం లే ఝాన్సీ... నాకు ఆకలిగా ఉంది" అన్నాడు.

"నాకు పెద్దగా ఆకలి అనిపించకపోతే ఇడ్లీ తిని అరటిపళ్లు తిన్నాను. మీరు తినెయ్యండి"

సత్యమూర్తి తిరిగి హాల్లోకి వెళ్ళి డైనింగ్ టేబిల్ ముందు కూర్చుని అక్కడే ఉన్న కంచం పెట్టుకుని అన్నం తినడం మొదలుపెట్టాడు.

"నేనూ ఝాన్సీ కలిపి భైరవీ వాళ్ళింటికి వెళ్ళి దాన్ని చూసివచ్చాం. ఇద్దరూ బాగానే ఉన్నారు. అల్లుడు కూడా ఏ భేషజాలూ లేకుండా చక్కగా మాట్లాడాడు"

"మంచిదే"

"భైరవి ఇంటి యజమానురాలుట. ఆ అమ్మాయి కూడా మంచిదానిలాగే కనబడింది. మన భైరవితో కలివిడిగానే ఉంటుంది"

"బావుంది"

"ఆ అమ్మాయి కూడా పెద్దదేం కాదు. ఓ ముప్పైఏళ్లు ఉంటాయేమో మంచి ఉద్యోగం చేస్తోందిట"

సత్యమూర్తి జవాబు చెప్పకుండా అన్నం తినడం పూర్తిచేసి డైనింగ్‌టేబిల్‌మీద వస్తువులు సర్ది, కంచం సింక్‌లో పడేసి, చేయి కడుక్కుని హాల్లోకి వచ్చి టేబిల్‌మీద ఉన్న ఒక ఫైలు తీసుకుని తిరిగి తన గదిలోకి వెళ్ళాడు. ఝాన్సీ డబుల్‌కాట్‌మీద ఓ కొనకు పడుకునే ఉంది. కాసేపు అలాగే నిలబడి ఆమెవైపు చూశాడు. నెమ్మదిగా వెళ్ళి ఆమె పక్కన పడుకుని, "అప్పుడే నిద్ర వస్తోందా? " అన్నాడు గోముగా. ఝాన్సీ మాట్లాడలేదు. అయినా అతను ఝాన్సీని తనకు దగ్గరగా లాక్కుని ముద్దులతో ముంచెత్తబోయాడు. ఝాన్సీ నాజుగ్గా ప్రతిఘటించి మరోపక్కకి తిరిగింది.

"వంట్లో బాగుండలేదా? ఎప్పుడూ లేనిది ఈవేళ ఇలా బిహేవ్ చేస్తున్నావేమిటి? " అంటూ సత్యమూర్తి తిరిగి ఝాన్సీని తనలోకి లాక్కోవాలని చూశాడు.

"ప్లీజ్ నన్ను ముట్టుకోవద్దు"

ఝాన్సీ నోటినుంచి వచ్చిన ఆ మాట సత్యమూర్తికి గట్టిగానే తగిలింది. అది అతని అహానికే తాకింది. అయినా సత్యమూర్తి తనని తను సంభాళించుకున్నాడు. ఒక్కక్షణం ఎక్కడో ఆలోచించి వెకిలిగా నవ్వేసి, "నీకు కోపం ఎందుకు వచ్చిందో నాకు తెలిసిందిలే. పువ్వులు తేలేదనికదూ... ఓ...ఓ" అనేశాడు.

ఝాన్సీ మాట్లాడలేదు.

"పోనీ నీ అలకకు కారణం ఏమిటో నువ్వే చెప్పరాదా. పెడమొహం దేనికి? "

"మీకు నచ్చినట్టుగా మీరు ఉంటోన్నప్పుడు నేను ఎడమొహంగా ఉండడంలో తప్పేం ఉంది"

"నాకు అర్థమయిందిలే"

"అయితే మంచిదే"

"అన్నం తింటోన్నంతసేపూ అమ్మ నాకు

సహస్రనామపూజ చేసింది. ఆ రాణీ అదే ఆ టక్కులాడి ఇంట్లో నాదీ ఆమెదీ ఫొటో మీరు చూశారు. అదేమో మీతో నేను తన మొగుణ్ణని చెప్పింది, మీరు నమ్మారు"

"ఆ ఫొటోలో ఉన్నది మీరిద్దరే. ఎంత తెగించిందైనా అంతలా అబద్ధం ఆడుతుందా? "

"నిజమే మన పెళ్ళి కానప్పుడు ఆమెతో నేను తిరిగాను. అంతవరకే..."

"ఇంకా ఎందుకు అబద్ధాలు ఆడతారు? ఎవర్ని నమ్మించాలని? ఒకవేళ ఆమే మీకు కావల్సిన మనిషి అయితే మీరు నాతో ఈ మాట చెప్పవల్సింది. కానీ మీరు అలా చేయలేదు. రహస్యంగా ఆమెతో సంసారం చేస్తున్నారు. రోజూ ఈ లోకంలో వేల పెళ్ళిళ్ల జరుగుతున్నాయి. వందలమంది విడిపోతున్నారు. మనమూ ఆ కోవలోకే వెళ్ళేవాళ్లం. అంతేగాని నమ్మిన మనిషి ముందు కొత్త మొహం తగిలించుకుని నిత్యం నటించకూడదండీ"

"నన్ను అమ్మ నమ్మలేదు. నువ్వూ నమ్మవా? "

"మీ అమ్మగారే కాదు. మీ నాన్నగారు కూడా మిమ్మల్ని నమ్మరు. ఇదంతా మీరు చేసుకున్నారు. అదీ కావాలని..."

సత్యమూర్తికి ఉడుకు మోత్తనం వచ్చింది. మంచంమీద లేచి కూర్చున్నాడు. ఝాన్సీ కూడా సర్దుకుని మంచం బేక్‌ను ఆనుకుని కూర్చుంది.

"ఏమోనండీ. మీ మాటలకు, చేతలకు పొంతన లేకుండాపోతోంది. డబ్బుమీద వెర్రి మమకారం, బాగా ఉన్నవాడిలా, నేల మీద కాకుండా నింగిని నడవాలనుకోవడం ఎవరికీ మేలు చేయదు"

"నేను అత్యాశాపరుణ్ణా? "

"ఒకళ్లు చెప్పేదేమిటి. మన ప్రవర్తనే మనం ఎవరమో చెప్తుంది. అందుకు ఒకరి మీద ఆధారపడనవసరంలేదు. మనస్సాక్షి అనేది ఉంది. ఉంటుంది"

"పోనీ నేను ట్రాన్స్‌ఫర్‌కు ప్రయత్నిస్తాను. మనం ఈ ఊరునుంచి ఎక్కడికైనా వెళ్ళిపోదాం"

"ఊరుకాదు. ముందు మన తీరు మారాలి"

"అంటే? "

"నేను ఆమధ్య చెప్పాను మీకు. గుర్తు తెచ్చుకోండి. స్త్రీ వ్యసనం, డబ్బుమీద ఆకాంక్షా మితిమీరితే ప్రమాదం. అవి మనిషి పతనానికి కారణమవుతాయి. మర్చిపోవద్దు" అంది.

ఇంతలో బయటనుంచి ఎవరో కాలింగ్ బెల్ నొక్కడంతో ఆ ధ్వని లోపల ప్రతిధ్వనించింది.

"ఎవరో ఇప్పుడు వచ్చింది" అనుకుంటూ సత్యమూర్తి వెళ్ళి తలుపు తెరిచాడు. ఎదురుగా బోసుబాబు- రెండు చేతుల్లో రెండు సూట్‌కేసులతో నిలబడి ఉన్నాడు.

"క్షమించాలి బావగారూ... వేళగానివేళ రావల్సివచ్చింది"

సత్యమూర్తి నవ్వేస్తూ, "అలా అనుకుంటే ఎలా? యూ ఆర్ ఆల్‌వేస్ వెల్‌కమ్ ప్లీజ్ కమిన్" అన్నాడు క్రీగంటితో అతని చేతుల్లోని సూట్‌కేసులు చూస్తూ.

బోసుబాబు తనతో తెచ్చిన రెండు సూట్‌కేసులూ ఓ పక్కన పెట్టాడు. అప్పుడే లోపలినుంచి ఝాన్సీ వచ్చి తమ్ముడ్ని చూసి ఆశ్చర్యపోయింది.

"ఆఫీసు పనిమీద విజయవాడ వెళ్ళవల్సి వచ్చింది. ఆ పని పూర్తిచేసుకుని కంపెనీ వేన్‌లో తిరిగివచ్చాం. మధ్యలోనే ఖాళీ చేసుకుని మనింటికి వెళ్ళాను"

"అమ్మా, నాన్నా ఎలా ఉన్నారు? బావున్నారా? "

"బాగానే ఉన్నారు. మిమ్మల్నందర్నీ అడిగినట్టు చెప్పమన్నారు" అని తిరిగి సత్యమూర్తితో, "మీరు మీ సూట్‌కేసు మా ఇంట్లో మర్చిపోయార్ట. దీన్ని జాగ్రత్తగా తీసుకువచ్చాను. మీకు అప్పగిస్తున్నాను"




అన్నాడు.

"లేచి కాళ్ళు కడుక్కో బోసూ. భోజనం చేద్దువుగాని" అన్నాడు సత్యమూర్తి.

"నాతోపాటు ఇంకా స్నేహితులు కూడా వచ్చారు. అందరం కలిసి సూర్యాపేటలో తినేశాం" అంటూ సూట్‌కేస్ తెరిచి లుంగీ పంచి తీసుకున్నాడు. పక్కన వున్న మరో సూట్‌కేసు చూసి, "బావగారూ... ఈ సూట్‌కేసు మీరు మా ఇంట్లో వదిలేసి వెళ్లారట. జాగ్రత్తగా తీసుకువచ్చాను" అంటూ దాన్ని సత్యమూర్తికి అందించాడు.

"ఇదెవరిదీ? " అంది ఝాన్సీ.

"మొన్న విశాఖపట్నంలో విశ్వనాథం గారు- దీన్ని నాకు అంటగట్టి తను కలకత్తా వెళ్లిపోయాడు. ఆయన ఊరునుంచి రాగానే ఇచ్చెయ్యాలి. లోపల పెట్టు" అని అదోలా దాన్ని ఝాన్సీకి అందించాడు.

"మీ నిద్ర పాడుచేశానేమో మీరు పడుకోండి"

"మేం పడుకోలేదులే. మెలుకువగానే ఉన్నాం"

"అవును. మీ చెల్లాయీ బావగారు ఎలా ఉన్నారు. కులాసానా కొత్త సంసారం ఎలా ఉంది? "

"బాగానే ఉన్నారు"

ఝాన్సీ లోపలినుంచి ఓ బెడ్‌షీటూ, తలగడా తెచ్చి హాలుని ఆనుకుని ఉన్న మూడో బెడ్‌రూమ్‌లోకి వెళ్లి అక్కడ బోసుబాబుకు పక్క ఏర్పాటు చేసింది. బోసుబాబు ఆ గదిలోకి వెళ్లబోయాడు.

"బోసూ! నువ్వు పార్టీ ఎప్పుడు ఇస్తావో చెప్పు. నీ నోటినుంచి ఆమాట ఎప్పుడు విందామా అని చూస్తున్నాను. నువ్వు ఇవ్వకపోతే అక్క దగ్గర తీసుకుంటాను"

"ఇస్తాను బావగారూ! మిమ్మల్ని ఆనందపరచడమే నాకు ఆనందం"

"థాంక్యూ. ఉద్యోగస్థుడివయ్యావు. ఇంక ఆలస్యం చేయకుండా పెళ్లి చేసుకోవాలి. నా ఎరుకలో ఓ మంచి సంబంధం ఉంది..."

"వాడికి పెళ్లి కుదిరినట్టేనని మధ్యాహ్నం మా అమ్మా నాన్నా ఫోన్‌చేసి చెప్పారు. హడావిడిలో మీకా విషయం చెప్పడం మర్చిపోయాను" అంది ఝాన్సీ.

"అలానా" అంటూ ఆశ్చర్యపోయాడు సత్యమూర్తి.

"దీనికి మీరు వాడికి కంగ్రాట్స్ చెప్పాలి. పార్టీ అడగాలి. మర్చిపోతే ఎలా? " అంది ఝాన్సీ.

"నేను చెప్పిన సంబంధం కాదనడం ఇది రెండోసారి. వీళ్లూ మంచివాళ్లు. బోసుకు ఎంత కావాలన్నా ఇచ్చేవారు"

"నేను కట్నం గురించి చూడలేదు బావగారూ! మీరు మరోలా అనుకోవద్దు. అన్నీ రేపు చెబుతాను" అంటూ బోసుబాబు తన గదిలోకి వెళ్లాడు, నెమ్మదిగా. తనకు ఏర్పాటు చేసిన మంచంమీద పడుకున్నాడు. అప్పటికే పదకొండు గంటలయ్యింది. నిద్ర రాకపోవడంతో తను కూడా తెచ్చుకున్న పుస్తకం చదవడం మొదలుపెట్టాడు. చేతి వాచీ చూసుకున్నాడు. పన్నెండు గంటలయింది. పుస్తకం గుండెల మీద పెట్టుకుని పైకి చూస్తున్నాడు. చటుక్కున విజయప్రకాష్‌గారు గుర్తుకొచ్చారు. బయలుదేరేముందు ఆయన దగ్గరకెళ్లి ఆశీర్వాదాలకోసం వచ్చానని వంగి ఆయన పాదాలు తాకాడు. అప్పుడు ఆయనతో పాటు ఆయన అన్నగారు గోవిందరావు గారూ ఉన్నారు. విజయప్రకాష్ తన అన్నగార్ని బోసుకు పరిచయం చేశాడు.

"మొత్తంమీద నీ స్వయంశక్తి మీదే ఉద్యోగం సంపాదించుకున్నావ్ కదూ! లేకపోతే హైదరాబాద్ వెళ్లి లక్షలు పారేసి కొనుక్కున్నావా? " వేళాకోళం చేస్తున్నట్టుగా నవ్వేశాడు విజయప్రకాష్.

"నిజం. నన్ను నమ్మండి. రిటెన్ టెస్ట్‌కు ఏడాది కష్టపడి చదివాను నేను. రోజుకు ట్యూషన్ కాకుండా పదిగంటలు చదివాను. అలాగే ఇంటర్వ్యూకీ ప్రిపేరయ్యాను. ఈ



తెరవెనుక భాగోతం కనుక చేయగల్గితే రెండేళ్లక్రితమే నేను ఉద్యోగస్థుణ్ని అయ్యే వాణ్ణి" అన్నాడు ఎంతో నమ్రతగా.

"నీ సంగతి, మీ నాన్నగారి సంగతి తెలుసు. రేపు ఉద్యోగస్థుడివయినా నిజాయి తీగానే వుండు. నువ్వు నిజాయితీపరుడిగా ఉండడానికి ఒక్కొక్కసారి నువ్వు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవాల్సి ఉంటుంది. భయపడకు"

"అలాగే సార్"

విజయప్రకాశ్‌గారు కాసేపు ఆలోచించి, "నువ్వు హైదరాబాద్‌లో సెటిల్ అయిన తర్వాత నాకో ఉపకారం చేయాలని ఇదివ రకోసారి నీతో చెప్పాను మా అన్నయ్య కూతురి గురించి" అన్నాడు.

"అవును గుర్తుంది సార్"

"చూస్తే- అదిప్పుడు మరిన్ని కొత్త చిక్కుల్లో పడిందని చూచాయగా తెలిసింది"

"అంటే?"

"దాని బతుకు మేం ఎవరం ఊహించ నంత దారుణమైన మలుపు తీసేకుంది. పెళ్లి అయినా ఒంటరిగా అది ఉద్యోగం చేస్తూ బతుకుతూంటే మరెవరో దాన్ని పెళ్లి చేసుకుంటానని మభ్యపెట్టి తనదాన్ని చేసు కున్నాడు. మాకు తెలిసినదాని ప్రకారం అతనికి పెళ్ళి అయ్యింది. గవర్నమెంటులో మంచి ఉద్యోగం చేస్తున్నాడు. నాకు వచ్చిన సమాచారం బట్టి అతను దాన్ని సిరిసంప దల్లో ఓలలాడిస్తున్నాడు. కానీ" అని ఆగిపో యాడు విజయప్రకాశ్‌గారు.

"కొత్తగా ఉద్యోగంలో జేరిన హడావిడిలో మీరు చెప్పినపని చేయలేకపోయాను" అని బోసు క్షణం ఆగి, "మా జి.యమ్.కు ఓ పెర్సనల్ సెక్రటరీ ఉన్నారు. ఆవిడ పేరు, సంధ్యారాణి... బహుశా మీ అన్నయ్యగారి అమ్మాయి పూర్తిపేరు ఇదేనాండి"

"అవును. ఆమెను కలిసి, నువ్వు ఎవరో చెప్పి మాట్లాడు. అతగాడి గురించి కూడా వాకబు చేయి. ఒకవేళ ఆమె ఏ చిక్కుల్లో నయినా పడుతోందని అనుమానం వస్తే ఆమెను నువ్వు ఆదుకోవాలి, బోసూ"

"నా మాట కూడా అదే నాయనా. పెద్ద వాడినయ్యాను. దాని బతుకు ఏమవుతుందో మీలాంటి అప్తులే దాన్ని రక్షించాలి" అన్నాడు నెమ్మదిగా గోవిందరావుగారు.

"మీరు చెప్పాలా సార్. తప్పకుండా నేను" అని ఆగిపోయాడు.

బోసుబాబు నెమ్మదిగా తన ఆలోచనల నుంచి తిరిగి లోకంలో పడ్డాడు. కళ్లు మూసుకుని, నిశ్శబ్దంగా ఉండిపోయాడు. ఆ తర్వాత మంచంమీదనుంచి లేచి టేబిల్ మీద ఉన్న మంచినీళ్ళగ్లాసు తీసుకుని తాగాడు. అప్పుడే తలుపు తోసుకుని గాంధీ గారు లోపలికి వచ్చారు. బోసు ఆయన్ని ఆశ్చర్యంగా చూసి,

"మీరా మామయ్యగారు... నిద్ర పోలేదా... కూర్చోండి" అన్నాడు.

"నిద్రపట్టలేదయ్యా"

"కొద్దిసేపు భగవద్గీత చదవమంటారా?"

"ఇప్పటిదాకా అదే చదివాను. శ్రీకృష్ణుడు ఏ పని చేసినా నిరాపేక్షతో చేయాలన్న మాట మరోసారి మనసుకు తగిలితే ఇలా లేచివచ్చాను"

"అదేమిటి సార్?"

"ఏపని చేసినా మన స్వార్థం మన లాభమే చూసుకోకూడదు. అలాగే ఎదుటి వారికి అపకారం, అన్యాయం జరిగినా చూస్తూ ఊరుకోనూకూడదు. అవునా?"

బోసుబాబు తల ఊపాడు.

"రక్తసంబంధీకులకు ఓ న్యాయం, పరా యివాళ్ళకు మరో న్యాయం అంటూ ఉండదు. అవునా?"

బోసుబాబు మరోసారి అవునన్నట్టు తల ఊపాడు.

"అయితే విను. ఓ కథ చెప్తాను" అంటూ గాంధీగారు తన కొడుకు సత్య మూర్తి గురించి, అతగాడి అవినీతి పనుల గురించి చెప్పి ఆఖరిగా ఓ వివాహిత స్త్రీతో





అతనికున్న పరిచయం... అన్నీ వివరిం చాడు.

"మనిషిలో ఏ రూపంలోనయినా విచ్చల విడితనం మొదలయ్యిందంటే అది అంత టితో ఆగదు. ఒకవైపునుంచి ప్రమాద సంకే తాలు మనసునుంచి అందుతున్నా దాన్ని లెఖ్ఖచేయకుండా మరింత నిర్భయంగా బుద్ధి విచ్చలవిడితనానికి ప్రోత్సహిస్తుంది. మీ బావ విషయంలో ఇది నిజమయ్యింది"

బోసుబాబు వింటున్నాడు.

"వాడు తన గొయ్యి తనే తవ్వుకోవడం కాకుండా ఆ గోతిలోకి అయినవాళ్ళను కూడా లాగుతాడని నేను భయపడుతూనే ఉన్నాను. సంపాదించే అర్హతపోయి కొడుకు దగ్గర బతకడం, మా ఇద్దరిమీద వయసు రోజురోజుకూ ఉరుకుతూ ఉండడం వీటివల్ల నేను కాస్తంత వెనకడుగు వేసినమాట నిజం. కానీ ముక్కు మొహం తెలియని ఓ ఆడదాన్ని వీడు తన అవసరానికే చేరదీ శాడు. ఇది ఎంత దూరం పోతుందో తెలి యదు. మీ అక్క ధైర్యస్తురాలే. కానీ ఇలాంటి విషయాల్లో మనింటి ఆడపిల్లలు ధైర్యంగా భర్తల్ని నిలదీయలేరు. వీళ్లకి ఎంతసేపూ తనకి అన్యాయం జరిగిందని లోలోపల బాధపడడం అలవాటుగా ఉంటుందిగానీ భర్త తప్పుని వేలెత్తి చూప డానికి హెజిటేట్ చేస్తారు. దాంతోనే సత్య మూర్తిలాంటివాళ్లు దాన్ని అలుసుగా తీసు కుంటారు. అందుకే నీకు చెప్తున్నాను. నీకు చైతన్యా, మా భైరవీ తెలుసు. వీళ్ళు ఉంటు న్నది ఆ అభాగ్యురాలి ఇంట్లోనే. అందుకే మీరు ముగ్గురూ ఆలోచించి తెలివిగానూ, ఆ తరువాత ఎవరి హృదయాలు గాయప డకుండానూ చూడాలి" అని ఆగి బోసుబా బువైపు చూసి, "ఈ ప్రయత్నంలో సత్య మూర్తి మనసు నొప్పించాలన్నా మీరు వెన కంజవేయద్దు. ఝాన్సీ, ఆ అమ్మాయీ హృదయాలు గాయపడకుండా ఉంటే చాలు. సరేనా? "

బోసుబాబు ఆశ్చర్యంగా గాంధీగారి మొహంవైపు చూశాడు.

"నేను చెప్పేదాంట్లో అతిశయోక్తి ఏంలేదు. నా కొడుకు-తండ్రీ కొడుకుల బాంధవ్యాన్నీ తల్లీ కొడుకుల ఆత్మీయతనూ, భార్యాభర్తల అనురాగాన్నే కాదు, మాన వీయ విలువలనే అపహాస్యం చేస్తున్నాడు. ఒక్కొక్కసారి ఇవన్నీ చూస్తూ నేనిక్కడ ఎలా ఉండగల్గుతున్నానా అనిపిస్తోంది. ఊళ్లో నాకు ఇల్లు ఉంది. కొద్దిగా పొలం ఉంది. మేం ఇద్దరం బతకడానికి అవి చాలు. అన్యాయాన్నీ, అక్రమాలనీ చూసి ఏనాడూ మౌనంగా ఉండని, సహించలేని నా మనసు రాయి ఎందుకయ్యిందా అని ఎంతగా ఆలోచించినా జవాబు దొరకడం లేదు. ఇది దైవనిర్ణయం కాబోలు. నా దుర దృష్టం నన్ను వెంటాడుతోందనిపిస్తోంది"

"మీరు బాధపడొద్దు అంకుల్. అన్ని విష యాలు నేను ఎంక్వయిరీ చేస్తాను. దారిత ప్పిన వాళ్ళకు ఓ మంచిదారి వేరే వుందని పరోక్షంగానైనా చెప్పడానికి ప్రయత్నిస్తాను"

"మంచిది బాబూ"

"ఇంతకీ ఆ అమ్మాయి ఎవరు. ఎంత వయసు ఉంటుంది. పేరు తెలుసా? " అని అడిగాడు బోసుబాబు.

"ఆ అమ్మాయి పేరు రాణీ అని తెలి సింది"

"రాణీనా? " అన్నాడు ఆశ్చర్యంగా బోసు బాబు.

"నీకు ఈమె తెలుసా? "

"లేదండి... ఎక్కడో విన్న పేరులా ఉంటే అడిగాను"

"సరే నేవెడతాను. తెల్లవారితే నువ్వు హడావిడిలో ఉంటానని ఇది చెప్పడానికి వచ్చాను. నిద్రపో ఇప్పటికే చాలా రాత్రి అయ్యింది" అంటూ గాంధీగారు ఆ గది లోంచి వెళ్ళిపోయారు. బోసుబాబు తన మంచం పక్కన ఉన్న సూట్‌కేసు తెరిచి విజయప్రకాశ్‌గారు ఇచ్చిన చీటీ తెరిచి

చూశాడు. అందులో "సంధ్యారాణి. పి.ఎస్. టు జనరల్ మేనేజర్" అంటూ వివరాలు ఉన్నాయి. బోసుబాబు ఆ అడ్రసును ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాడు!!

★ ★ ★

రాణి తన రూమ్‌లో కూర్చుని వుంది. కంపెనీ మేనేజర్ బెంగుళూర్ క్యాంప్‌కు వెళ్ళాడు. దాంతో ఆమె చాలామటుకు తీరిగ్గానే ఉంది. కార్పొరేట్ ఆఫీసునుంచి వచ్చిన ఉత్తరాలు చదివి ఏ పేపర్ ఎవరికి వెళ్ళాలో మార్కు చేసింది. పని అయినట్టే అన్పించింది. కాసేపు డ్రాయర్లో ఉంచిన మేగ్‌జైన్ తీసి పేజీలు తిరగవేసింది. కానీ మనసు పెట్టి చదవలేకపోయింది. చటుక్కున రెండు రోజులనాడు ఇంట్లో సత్యమూర్తితో వేసుకున్న భేటీ గుర్తొచ్చింది. దాంతో మనసులో అలజడి మొదలయ్యింది. దాన్ని వెన్నంటి భయం కూడా మొదలయ్యింది కాసేపు.

అవును- అనుకోకుండా సత్యమూర్తి తన చెల్లెలూ, ఆమె భర్తా కంటపడ్డాడు. తను మామూలుగానే అతనికి వాళ్ళను పరిచయం చేసింది. కానీ దాంతో సత్యమూర్తి నీరుగారిపోయి భయంగా బయటకు వెళ్ళిపోయాడు. ఇలా జరుగుతుందని తను ఊహించలేదు. నిజమే సత్యమూర్తి వెళ్లిన తర్వాత తనకూ అదోలా అన్పించింది. భైరవి అతని చెల్లెలు... అంటే చాలారోజులనాడు తనింటికి వచ్చిన ఝాన్సీ సత్యమూర్తి భార్య, కాంతమ్మగారు అతని తల్లి... అవును... వాళ్ళిద్దరూ తనూ సత్యమూర్తీ ఉన్న ఫొటో చూశారు. తను సత్యమూర్తిని తన భర్తగా చెప్పింది. కానీ పైకి మాట్లాడకపోయినా వాళ్ళ దృష్టిలో తను సత్యమూర్తికి ఏమీ కాదు. ఏ చుట్టరికమూ లేదు. తనని సత్యమూర్తి ఉంపుడుకత్తెగానే లెఖ్ఖ కట్టి ఉంటారు. అంతకు తప్ప ఏ విలువా ఇవ్వరు.

ఇలా ఎలా జరిగింది? ఎందుకు జరిగింది? ఇది ఎంతదూరం వెడుతుంది? తన గురించి ఇంట్లో వాళ్ళందరికీ ఓ కొత్త నిజం తెలిసి, వాళ్ళు నిలేస్తే సత్యమూర్తి ఏం చేస్తాడు? అందర్నీ కాదని తనకి అండగా నిలబడతాడా? లేక తనకి కాకుండా పోతాడా? అలా రాణి ఎంత ఆలోచించినా తను ఏంచేయాలో తోచలేదు. నిస్సహాయంగానే ఉండిపోయింది. దాంతో ఆమె కళ్లు చెమ్మగిల్లసాగాయి. హేండ్‌బేగ్‌లోంచి జేబురుమాలు తీసి కళ్లు వత్తుకుంది.

సరిగ్గా అప్పుడే, "మే ఐ కమిన్" అన్న కంఠం విన్పించి రాణి కళ్లెత్తి చూసి, "కమిన్ ప్లీజ్" అంది కేబిన్ గ్లాస్‌లోంచి కనిపిస్తున్న మనిషిని చూసి,

"నా పేరు బోసుబాబు. నేను రెండు మూడు నెలలుగా ఈ కంపెనీలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేస్తున్నాను. కానీ క్యాంప్సుమీద, దేశంమీద పడి తిరుగుతూఉంటాను"

"అవును మిమ్మల్ని ఒకటి రెండుసార్లు మేనేజర్‌గారితో చూశాను. చెప్పండి. నాతో ఏదైనా పనిపడిందా? ఇన్‌ఫర్మేషన్ ఏమైనా కావల్సివుందా?"

"మీకు విజయప్రకాశ్‌గారు చిన్నాన్నగారు అవుతారని నాకీమధ్యే తెలిసింది. ఆయనదీ, మా నాన్నగారిదీ గురుశిష్యుల అనుబంధం. వారు తరచు మా ఇంటికి వస్తుంటారు. నన్ను ఆయన ఆప్తుడిగా చూస్తారు. పైగా జనహిత సంస్థలో నేనూ మెంబర్ని. వారి కార్యక్రమాల్లో పాలుపంచుకుంటూ ఉంటాను"

"అలానా..." అంది రాణి.

"నేను ఈమధ్య విజయవాడ వెళ్ళాను. అప్పుడు విజయప్రకాశ్‌గారిని కలవడం జరిగింది. నేను నా గురించీ నా కొత్త ఉద్యోగం గురించీ చెప్పగానే ఆయన మీ గురించి చెప్పారు. అందుకే మిమ్మల్ని ఓసారి కలుసుకుందామని వచ్చాను. మీరు





చాలాకాలంగా ఇక్కడ పనిచేస్తున్నారుట కదూ..."

"అవును"

"మీరు ఎక్కడ ఉంటారు?"

"ముషీరాబాద్‌లో"

"నేను పొరబడకపోతే మీ ఇంట్లోనే నా స్నేహితుడు చైతన్య ఫ్యామిలీతో అద్దెకు ఉంటున్నాడు. అవునుకదా" అన్నాడు బోసు బాబు.

"అవును" అంది ఆశ్చర్యంగా.

"ఇంకా చెప్పాలంటే చైతన్య భార్య భైరవి మా అక్కకు ఆడబడుచు అవుతుంది. నాకు ఆ భార్యాభర్తలిద్దరూ కావల్సినవాళ్లే"

రాణీ ఆశ్చర్యంగా బోసుబాబు చెప్పే మాటలు వింటోంది.

"ఇక అసలు విషయానికి వస్తాను. నన్ను మీరు మీ అన్నగారిలా భావించి నేను చేసే రిక్వెస్ట్‌ను మన్నిస్తారని ఆశిస్తు న్నాను. మీతో ఓ విషయం మాట్లాడాలి" అన్నాడు.

"మనం ఒక సంస్థలో పనిచేస్తున్నాం. అందుకే ఒకరితో మరొకరికి పనిపడడం సహజం. మీకేం కావాలి. నిర్మొహమా టంగా చెప్పండి"

"ఆఫీసుకు సంబంధించింది కాదు"

"మరేమిటి?"

"మీతో పెర్సనల్‌గా మాట్లాడాలి. ఎక్కు వసేపు మాట్లాడ్డం ఇక్కడ బావుండదు" అని కాసేపు ఆగి "మిమ్మల్ని ఏకాంతంగా కలవాలి. అందుకు మీరు సమ్మతిస్తారా? కాదంటారా? అదంతా మీ ఇష్టం. నేను ఫైఫ్లోర్లో ఉంటాను. నా ఫోన్ నెంబరు ఇస్తాను. మీరు ఆలోచించి నాకు రింగ్ చేస్తే చాలు. ఐదుగంటలలోపు ఎప్పుడైనా సరే. ఈవేళ నేను సీటులోనే ఉంటాను"

రాణి మరోసారి ఆశ్చర్యంగా బోసుబాబు మొహంలోకి చూసింది.

"బహుశా నేను మాట్లాడే మాటలన్నీ విజయ్‌ప్రకాశ్‌గారి హృదయంనుంచి నా గుండెల్లోకి జొరబడి కూర్చున్నవే. అంటే నేను ఆయన గొంతుకనే ఎరువు తెచ్చుకుని మీతో మాట్లాడతాను"

రాణీ, బోసుబాబు మాటలు విని, అదోలా అతనివైపు చూస్తూ "బాబయ్యి మిమ్మల్ని నా దగ్గరకు పంపించాడన్నమాట. అవును కదూ" అడిగింది.

"అవును నేను చేసేది రాయబారం లాంటిది"

రాణి క్షణం ఆలోచించి, "ఎలాగూ రేపు ఆదివారం. మనకు సెలవు. రేపు ఉదయం ఏదో టైములో మా ఇంటికి రండి. వీలైతే మీ భార్యను కూడా తీసుకురండి. సరేనా" అంది.

"నాకు పెళ్లి కాలేదు"

"సారీ"

"నేను వెడతానండీ. థ్యాంక్స్. రేపు కలుద్దాం" అంటూ బోసుబాబు కుర్చీలోంచి లేచి బయటకు వెళ్ళాడు. రాణి కాసేపు అతను వెళ్ళినవైపు చూసింది. అతను మాట్లాడిన మాటలే మననం చేసుకుంది. బాబయ్యి ఈ మనిషిని తనతో ఏం మాట్లా డమని పంపించి ఉంటాడా అని రకరకా లుగా ఆలోచించింది. అయినా ఆమెకు ఏ మీ అంతుపట్టలేదు.

అప్పుడే పక్కనున్న ఫోన్ మోగింది. రాణి ఫోనెత్తింది.

"నేను రాణీ, సత్యమూర్తిని మాట్లాడుతు న్నాను"

"అవును అర్థమయింది"

"ఎలా ఉన్నావ్?"

"నేను ఎలా ఉంటానో నీకు తెలియదా?" సత్యమూర్తి చాలాసేపు మాట్లాడాడు. ఇంది రాపార్కుకి రమ్మన్నాడు.

"ఇంటి దగ్గర మాట్లాడుకోవచ్చుగా. ఇంది రాపార్కుకు వెళ్ళి మాట్లాడ్డానికి ఏముంది?"

అవతలినుంచి తిరిగి సత్యమూర్తి ఏదో చెప్పాడు.

"సరే నేను బయలుదేరుతున్నాను.

నువ్వు పార్కుకు వచ్చేయ్. నేను శ్రీ శంక రాచార్య గుడి దగ్గర ఉంటాను" అని రాణి ఫోన్ పెట్టేసింది. సీటులోంచి లేచి లిఫ్ట్‌లో గ్రౌండ్‌ఫ్లోర్‌కు వచ్చింది. రిసెప్షనిస్ట్ దగ్గరకు వెళ్ళి తన చేతిలో ఉన్న పర్మిషన్ లెటర్ ఆమె చేతిలో పెట్టి "నేను వెళ్ళాలి. బాస్ వస్తే ఈ లెటర్ ఇవ్వు" అంది. రిసెప్షనిస్ట్ తల ఊపింది.

రాణి స్కూటర్ స్టాండ్‌లోకి వెళ్ళి తన కెనటిక్ హోండా తీసుకుంది. అప్పటికే నాలుగు గంటలయ్యింది. ఆమె అరగం టలో ఇందిరాపార్కుకు చేరుకుంది. గేటు దగ్గరకు వెళ్ళేసరికి అక్కడే నిలబడి ఉన్న సత్యమూర్తి కన్పించాడు. ఇద్దరూ పార్కు లోకి వెళ్ళి ఓ ఖాళీ ప్రదేశంలో కూర్చు న్నారు. సత్యమూర్తి ఓసారి రాణి మొహం లోకి చూశాడు. "క్షమించు రాణీ... జరిగిన దాంట్లో నీ తప్పేంలేదు"

"సరేలే"

"మా ఇంట్లో చాలా గొడవయ్యింది. నేనే జాగ్రత్తగా ఉండవల్సింది. ఇంట్లో అమ్మా, నాన్నా ఆఖరికి ఝాన్సీ కూడా నాతో ముభావంగా ఉంటున్నారు. తల తిరిగిపో తోంది. ఏం చెయ్యాలో తోచడంలేదు"

రాణి మాట్లాడలేదు.

"ఆలోచిస్తే దీనికి ఒకటే పరిష్కారం కన్పి స్తోంది. ఇక నువ్వు ఆ ఇంట్లో ఉండడం మంచిది కాదు. ఆ ఇల్లు ఖాళీ చేసేద్దాం. అద్దెకు ఓ ఇల్లు చూశాను. అదీ అందరికీ దూరంగా"

రాణి సత్యమూర్తి కళ్ళల్లోకి చూస్తూ, "నిజమే... నువ్వు నన్ను మరో ఇంట్లోకి మారుస్తావు. అక్కడికీ వస్తావు. ఈ విషయం కూడా ఏదోరోజు మీ వాళ్ళందరికీ తెలుస్తుంది. అప్పుడు నన్ను మరో ఇంటికి షిఫ్ట్ చేస్తావు. నా బతుకు ప్రయోజనం ఇల్లు మారడాలతోనే సరిపోతుంది అవునా? "




"మరేం చెయ్యాలి. ఇక్కడుంటే భైరవీ వాళ్ళ కంట పడతాం. నేనూ నిన్ను కల్సు కుందుకు ధైర్యంగా రాలేను"

"సరే... ఇల్లు మారతాను. తర్వాత ఏమిటి? "

"అంటే"

"నీకు తెలియదా... ఎంతకాలం ఇలా దొంగబతుకు నాకు? "

"రాణీ నేను ఇదివరకోసారి చెప్పాను. నేను ఈ గవర్నమెంట్ ఉద్యోగం చేస్తూ నీ మెళ్లో తాళికట్టే ప్రసక్తేలేదు"

"అయితే నేను నీకు దొంగపెళ్లాంగానే బతకాలంటావ్, అవునా? "

"రాణీ, నా మాట విను. ఈ విషయంలో మనిద్దరి మధ్యా మనస్పర్థలూ, వాదోపవా దాలూ రేగడం మంచిది కాదు. ఒకవేళ నా నిర్ణయం నీకు నచ్చలేదనుకో. నీకు ఏది మంచిదనిపిస్తే అది చెయ్యి"

రాణికి ఏం మాట్లాడాలో తెలియలేదు.

"ఇది చెబుదామనే నిన్ను ఇక్కడికి రమ్మ న్నాను" అని సత్యమూర్తి రాణి కళ్లల్లోకి చూస్తూ, "నేను మరోసారి చెబుతున్నాను. నువ్వంటే నాకు ప్రాణం. నీ కోసం ఏదైనా చెయ్యాలని ఉంటుంది"

"ఈ మాటలు ఏళ్లుగా నీ నోట వింటు న్నవే మూర్తీ. ముందు ఆ అద్దె ఇల్లు ఏదో చూపించు చాలు"

"మా భైరవివాళ్లూ అడిగితే ఏం చేస్తావ్? "

"ఈ సలహా నువ్వే ఇచ్చావని చెబుతాను"

"ఏయ్" అన్నాడు బెదిరిస్తోన్నట్టుగా సత్య మూర్తి.

"సరేలే నాకు పొద్దున్నుంచీ ఒంట్లో బాగో లేదు. నేను ఇంటికి వెళ్ళాలి. మనం ఇక్కడ చేసే పనేం వుంది? లే, వెడదాం"

"అలా అంటే ఎలా? మనిద్దరం కలిసి ఏ హోటల్‌లో వెళ్ళి ఈ రాత్రి అక్కడ గడు పుదాం. నాకూ తిక్కతిక్కగా ఉంది. ప్లీజ్"

రాణి మాట్లాడలేదు.

"నాకు తెలుసు. నీకు కోపంగా ఉంది.

పార్కు అని ఊరుకున్నావ్‌గానీ లేకపోతే నన్ను నమిలి మింగేసేదానివికదూ"

"అంతటి నేర్పు నాకున్నా బాగుండేది"

"ప్లీజ్ నా మాట విను. హోటల్‌కు వెడదాం. కాదనుకు రాణీ"

"సారీ మూర్తీ... నీ తరఫునుంచి నీకు బోల్డు ఆంక్షలు, హద్దులు, ఇంకా ఇంకా భయాలు ఉన్నప్పుడు అలాంటివి నాకుండ కూడదా? నేనేం చిన్నపిల్లను కాదే? టీనేజ్ అమ్మాయిలా, దొంగతనంగా నచ్చిన ప్రియుడితో హోటల్లో గడిపితే ఏం బావుంటుంది? "

"నీకు కోపం వచ్చిందని మొరాయిస్తున్నావనీ తెలుసు"

"నా నిస్సహాయత మీదే నా కోపం"

"అలా అనొద్దు రాణీ. మనకు పరిస్థితులు కాస్తంత ఎదురుతిరుగుతున్నాయి. అందుకే మనం జాగ్రత్తలు తీసుకోవాలి. ఆ ఉద్దేశంతోనే చెప్పాను. పద. గుడికి వెడదాం"

రాణీ లేచింది. ఇద్దరూ గుడిదాకా అడుగులు వేశారు. సత్యమూర్తి గేటుదాకా వెళ్ళి స్కూటర్ తెరిచి అందులో వుంచిన కొబ్బరికాయ, పువ్వుల పొట్లాం ఇతర పూజాసామాగ్రి బయటకు తీశాడు. పదినిమిషాల్లో గుడిలో పూజ జరిపించి, తిరిగి ఇద్దరూ బయటకు వచ్చారు.

"బయలుదేరదాం" అంది రాణీ.

"నేను ఇల్లు చూసి నీకు ఫోన్ చేస్తాను. ఆ తర్వాత సామాన్లు ప్యాక్ చేయడానికి మనుషుల్ని పంపిస్తాను. ఈ వారంలో ఇల్లు మారడం జరగాలి"

"నీ ఇష్టం" అని రాణి చేయి ఊపి తన బండి ఎక్కింది. సత్యమూర్తి కొంతదూరంవరకూ ఆమెతో ఫాలో అయి అక్కడినుంచి చిక్కడపల్లివైపు తిరిగాడు. రాణీ ముషీరాబాద్‌వైపు మళ్లింది. అరగంటలో ఇల్లు చేరింది. తలుపులు తెరిచి హాల్లోని సోఫాలో కూర్చుంది. ఏం చేయాలో తోచలేదు. నిజమే వంట చేసుకోవాలి. తినాలి. ఆపైన టి.వి. చూడాలి. నిద్రపోవాలి. లేకపోతే ఇల్లంతా తిరగాలి. నిద్రపట్టకపోతే బాల్కనీలో కుర్చీ వేసుకుని ఆకాశంవైపు చూడాలి. నక్షత్రాలు, మేఘాలు వాటిమధ్య దోబూచులాడే చందమామని చూడాలి. లేకపోతే సత్యమూర్తి ఇంటికి వచ్చిన రోజును గుర్తుచేసుకుంటూ ఒంటరితనాన్ని మర్చిపోవాలి.

రాణి అయిష్టంగానే పేపరు కాసేపు తిరగేసింది. ఓచోట జనహిత సంస్థ వారి పెద్ద ప్రకటన కనబడింది. ప్రకటన దిగువున విజయప్రకాశ్ చిన్నాన్న ఫొటో. ఆ మరునాడు జరగబోయే చర్చినీయాంశం. "మారుతున్న సమాజంలో స్త్రీ పాత్ర" అనేది! ఒకటి రెండు నిమిషాలు ఆలోచించి ఫోన్ ఎత్తి ఆర్గనైజర్స్ నెంబరుకు ఫోన్‌చేసి తనెవరో చెప్పి తన నెంబరు ఇచ్చి అది విజయప్రకాశ్‌గారికి అందివ్వమని చెప్పింది.



"ఆరోజు ఆదివారం. అప్పుడు ఉదయం పదిగంటలయ్యింది. రాణి రోజులా కాకుండా పెందరాళే లేచి స్నానం చేసింది. పదిగంటలకు తనింటికి వస్తానని చెప్పిన అతిథి బోసుబాబు కోసం టిఫిన్ చేసి

హాట్‌ప్యాక్‌లో పెట్టింది. కాఫీ ఫ్లాస్క్‌లో పోసింది. అలవాటుగా ఆనాటి పేపరు చదివింది. టి.వి. చూసింది. అయినా కాలం గడవనట్టుగానే ఉంది. ఓసారి వీధిగుమ్మం దాటి వెళ్ళి పైవాటావైపు చూసింది. ఏ అలికిడీ లేదు. రాణికి తను భైరవినీ చైతన్యనూ చూసి నాల్గురోజులయినట్టు గుర్తొచ్చింది. ఇదీ అని చెప్పలేని గిల్టీ కాన్షన్‌తో ఓ అడుగు వెనక్కి వేస్తోన్నట్టు ఆమెకు తెలుస్తూనే ఉంది.

సరిగ్గా అప్పుడే కాలింగ్‌బెల్ మోగింది. రాణి ఓసారి జుట్టూ, పమిటికొంగూ సరిచేసుకుని తలుపు తెరిచింది. ఆమె కళ్లు ఆశ్చర్యంతో పెద్దవి అయ్యాయి. గుమ్మం బయటనుంచున్న మనిషిని చూసి సంతోషపడి "నువ్వా చిన్నాన్నా, ఎంతకాలానికి నిన్ను చూశాను. లోపలికిరా" అంటూ విజయప్రకాశ్‌గారిని లోపలకు ఆహ్వానించింది.

"ఇప్పటికి కుదిరింది రాణీ, ఇటు రావడానికి" అంటూ విజయప్రకాశ్ సోఫాలో కూర్చున్నాడు.

రాణి, 'ఇప్పుడే వస్తాను' అంటూ లోపలికి వెళ్ళింది. ఆయన కూర్చుంటూనే హాలంతా పరకాయించి చూశాడు. పైకి చూశాడు. రాణి లోపలినుంచి టిఫిన్, కాఫీ తెచ్చింది. ఆయన ముందు పెట్టింది.

"ఎలా ఉన్నావ్ రాణీ. నేను ఒకటి రెండు సార్లు ఈ నగరం వచ్చాను. పనులు తొందరవల్ల నిన్ను కల్సుకోలేకపోయాను"

"అవును. నువ్వు ఈ ఊరు రావడం, పేపర్లలో నీ వ్యాసాలు నేను చూస్తూనే ఉంటాను"

"అలానా?" విజయప్రకాశ్‌గారు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"నేను పొగడ్త కోసం చెప్తున్నాను అనుకోకపోతే ఒకనాటి బెంగాలీ, ఆంధ్రాలోని సంఘసంస్కర్తల్ని నువ్వు గుర్తు చేస్తున్నావ్ చిన్నాన్నా. దేశంలో నీకు చాలామంది అభిమానులు ఉన్నారు. మాటల్లో వాళ్ళు నిన్ను పొగుడుతూ ఉన్నా నేను మన చుట్టరికం గురించి చెప్పను" అంటూ రాణి చిన్నపిల్లలా నవ్వేసి తిరిగి, "ఎందుకో తెలుసా... ముందు నన్ను చూసి ఈర్ష్యపడతారనీ, ఆ తరువాత నీ గురించి నిష్కర్షగా నా ముందు మాట్లాడరనీ" అంది.

విజయప్రకాశ్‌గారు కూడా నవ్వేసి, "నిజమేనేమో రాణీ... నాకు కావల్సింది అభిమానులు కాదు, మా జనహిత కార్యక్రమాల్లో మనసు పెట్టి పనిచేసేవాళ్లు" అన్నాడు.

"నిజమే అనుకో"

విజయప్రకాశ్ ఓ క్షణం ఆగి, "మీ నాన్న చెప్తూ ఉంటాడు. నువ్వు నెలనెలా వారికి డబ్బు పంపిస్తున్నావని"

"వాళ్ళకు నేనూ అక్కా తప్ప మరెవరున్నారు చిన్నాన్నా?"

"నీకు జీతం బాగానే వస్తుందనుకుంటాను. ఆ సంగతి ఇల్లే చెప్తోంది"

"ఈ ఇల్లు... ఈ సామాన్లూ" అంటూ రాణి ఆగిపోయింది.

"అది సరేనమ్మా. మీ నాన్నకి డబ్బు పంపిస్తున్నావ్. వీలు చూసుకుని వాళ్ళను చూసి వస్తుండాలి కదమ్మా"

"నేను అమ్మనూ నాన్ననూ ఇక్కడికి వచ్చి నా దగ్గర ఉండమన్నాను. వాళ్ళు వినరు. కారణం" రాణి మాటలు ఆపేసింది.

"నీకూ అని ఓ సంసారం లేకుండా పోయిందనేది వాళ్ళ బాధ"

రాణి మాట్లాడలేదు.

"అడుగుతున్నానని ఏమీ అనుకోకు. నువ్వూ, మీ ఆయన విడిపోయి చాలా రోజులయ్యింది. నీ భర్తతో నువ్వు విడాకులు ఎప్పుడో తీసుకుని ఉండవల్సింది. చట్టం ముందు మనం ఎప్పుడూ తలవంచుకుని నిలబడే పరిస్థితులు కల్పించుకోకూడదు"

"ఆ పెద్ద మనిషిని ఎన్నోసార్లు అడిగాను. ఉత్తరాలు రాశాను. జవాబు లేదు. అసలు అతను ఎక్కడ ఉన్నదీ తెలియకుండా పోయింది"





"అతను మా ఊళ్లోనే ఉన్నాడు. అనుకోకుండా కలిశాం. నేను ఈ విషయం అతనితో మాట్లాడాను. కోర్టు ద్వారా విడాకులు ఇవ్వడానికి ఒప్పుకున్నాడు. ఆ పని పూర్తి అయితేగాని నీకు..." అంటూ విజయ్‌ప్రకాశ్‌గారు మాటలు ఆపేశాడు.

రాణి తిరిగి మాట్లాడలేదు.

"జరిగిందేదో జరిగిపోయింది. వాటిని తవ్వుకుని ప్రయోజనం లేదు. తెలివైనవాళ్లు జరిగిన తప్పులు మననం చేసుకోరు. ముందు జీవితాన్ని సరికొత్తగా మల్చుకుంటారు"

"నిజమే చిన్నాన్నా" అంది తలవంచుకుని రాణి.

"నీకు వయసు మించిపోలేదు. నువ్వు నచ్చినవాణ్ణి, నీకు నచ్చినవాణ్ణి చూసి పెళ్ళి చేసుకుంటే బావుంటుంది. మనకి తోడు ఉండాలి. ఆడవాళ్ళకు ఈ తోడు మరీ అవసరం. ఆడపిల్లలు ఎంతటి ధైర్యస్తులయినా ఒంటరి పోరాటం చేయగల పరిస్థితులు మనదేశంలో ఇంకా లేవు"

"నిజమే చిన్నాన్నా. నేను ఏకాకిగా ఉంటూ చాలా అవమానాల్ని ఎదుర్కోవల్సి వచ్చింది. నన్ను చూసి గేలిచేసేవాళ్ళే ఎక్కువమంది నాకు ఎదురయ్యారు. అందుకే అనుకోకుండా..." రాణి ఆగిపోయింది.

విజయ్‌ప్రకాశ్, రాణివైపు చూసి, "ఓమాట... నేను చిన్నాన్నగా, కావాల్సినవాడిగా నీతో మాట్లాడ్డానికి రాలేదు. నీతో ఓ స్నేహితుడు, ఓ పెద్దమనిషి మాట్లాడుతున్నాడని అనుకో"

"నీ గురించి నాకు తెలుసు. నీ మాటలూ చేతలూ ఎలాంటివో నాకు తెలుసు"

"నీకు తెలిసి జరిగిందో, తెలియక జరిగిందోగానీ నువ్వు మరో వ్యక్తితో కలిసి ఉంటున్నావని నాకు తెలిసింది. అతనూ నువ్వూ పెళ్లి చేసుకున్నారా? అతను మంచివాడేనా? "

"లేదు చిన్నాన్నా" రాణి మాటలు ఆపేసింది. తలవాల్చుకుంది. ఆమె కళ్లు చెమర్చాయి. నెమ్మదిగా సత్యమూర్తితో తన పరిచయం, అతను తనకు పెళ్లికాలేదని చెప్పడం, అతనికి దగ్గరయి కలిసి జీవిస్తూ వుండడం అన్నీ చెప్పింది.

విజయప్రకాశ్ రాణి వైపు చూసి, "ఒక్క మాటలో చెప్పాలంటే, అతను నిన్ను మాయమాటలతో మోసగించాడు"

రాణి మాట్లాడలేదు.

"నేను అతని గురించి వాకబు చేశాను. చాలా విషయాలు తెలిశాయి. పైగా నీతిని యమాలపట్ల అతనికి ఏ గౌరవంలేదు"

"అవును. నాకూ ఇవన్నీ తెలుసు. ఇంకా మా ఇద్దరి సంబంధం గురించి వాళ్లింట్లో కూడా తెలిసింది. పైగా అతని చెల్లెలూ భర్తా ఈ ఇంటి పై పోర్షన్‌లో ఉంటారు. వాళ్లకూ తెలుసు. నేనేం చేయాలో నాకు తెలియడంలేదు చిన్నాన్నా"

"బాధపడకు"

"బాధపడి ప్రయోజనం ఉండదని తెలిసినా, ఈ కన్నీళ్లు ఆగవుకదా చిన్నాన్నా"

విజయప్రకాశ్‌గారు తన సోఫాలోంచి లేచి రాణి పక్కన కూర్చుని ఆమె తల నిమిరాడు.

"చూడు రాణీ. ఒక్కొక్కసారి విధి మనతో ఆడుతుంది. మనం ధైర్యంగా ఉండాలి. నీరుగారిపోకూడదు. అవును ఈ సత్యమూర్తి భార్య ఝాన్సీ ఎవరో నీకు తెలుసా? "

"తెలియదుగానీ ఆమెను అనుకోకుండా చూశాను ఈ ఇంట్లోనే"

"విజయ్‌ప్రకాష్‌గారు, ఝాన్సీ ఎవరో, ఆమె తల్లిదండ్రుల గురించీ, వారితో తనకున్న పరిచయం, అన్నీ చెప్పి "మీ ఇన్‌ఫోసిస్‌లో పనిచేసే బోసుబాబు ఝాన్సీ తమ్ముడే" అన్నాడు.

రాణి ఆశ్చర్యపోయింది.

"అతనూ, చైతన్యా, భైరవి మన జనహితలో సభ్యులు. ఈవేళటి సమాజాన్ని తీర్చి



దిద్దడానికి మాతోపాటు పనిచేస్తున్న యువతరానికి ప్రతినిధులు"

"అవును, నాకు తెలుసు ఈ భార్యాభర్తల గురించి"

"రాణీ! ఇప్పటికే ఆలస్యం అయింది. నువ్వు మీ నాన్నకోసం, నా కోసం కాదు, ఆలోచించవల్సింది. నీ గురించి. నువ్వు ఏదోవిధంగా సత్యమూర్తితో తెగతెంపులు చేసుకో. ఈ ఊళ్లో ఉద్యోగం మానేయ్. మా జనహితలో నీకు ఉద్యోగం ఇస్తాను. విజయవాడ వచ్చెయ్"

రాణి మౌనంగా వింటోంది.

"నేను ఈ మాటలు నీతో చెప్పాలనే ఇక్కడికి వచ్చాను. ముందు అయితే ఈ విషయాలన్నీ నీతో చర్చించమని బోసుబాబుతో చెప్పాను. ఆలోచించిన తర్వాత చిన్న వాడికి పెద్ద బాధ్యతలు ఇస్తున్నానేమో అన్పించింది. పైగా ఝాన్సీ అతనికి అక్క గారు. ఇటు నువ్వేమో నాకు కావల్సినదానివి. ఎటూ మాట్లాడలేకపోవచ్చు బహుశా అతను ఇక్కడికి రావొచ్చు. వస్తే నేను వచ్చి వెళ్లానని చెప్పు. అర్థం చేసుకుంటాడు"

రాణి తల ఊపింది.

"మరి నేను వెడతాను. నువ్వు మరోసారి ఆలోచించు" అని ఓ క్షణం ఆగి,

"ఈ సత్యమూర్తి గురించి నీకూ తెలుసుననే అనుకుంటున్నాను. అతను మోస్ట్ కరెప్టెడ్ మేన్, నెంబర్ వన్ అని నాకు చాలా మంది చెప్పారు.

ప్రభుత్వాన్ని మోసంచేస్తూ నాలుగు చేతులా గడిస్తున్నాడు. ఈ అవినీతి పరులతో చిక్కేమిటంటే, వీళ్ళకు అయినవాళ్ళు అనీ పరాయివాళ్ళనీ బేధం ఉండదు. తమ లబ్ధికోసం ఏ పని అయినా చేస్తారు. జాగ్రత్త సుమా" అని ఓక్షణం ఆగి "ఈ ఇల్లు చూస్తే చాలా మోడ్రన్‌గా కన్పిస్తోంది. యివన్నీ కూడా లేవిష్‌గానే ఉన్నాయి. ఇది ఎవరిది? "

రాణి క్షణం తలవంచుకుని, "ఇది నాకోసం, నా పేరుమీద సత్యమూర్తి కొన్నాడు. అప్పట్లో నాకు తెలియదు. నేను అతని మోజులో యివేవీ ఆలోచించలేదు" అనేసింది.

"అలానా" అని తిరిగి "ఎందుకైనా మంచిది. ఈ ఇంట్లో నువ్వు ఉండొద్దు. ఏవైనా గొడవలు వస్తే నువ్వు మాత్రం అబద్ధం చెప్పకు. నిజమే చెప్పు. మర్చిపోవద్దు"

రాణి తల ఊపింది.

"నేను వెళతాను"

రాణి గేటుదాకా వెళ్ళింది. విజయ్‌ప్రకాశ్ గారు బయటకు రావడం చూసి కారులో కూర్చున్న డ్రైవర్ కారు దిగాడు. ఆయన కారు ఎక్కగానే అది బయలుదేరింది. ఆ కారు ఓ కిలోమీటర్ దూరం వెళ్ళి అక్కడే ఉన్న పార్కుముందు ఆగింది. విజయ్‌ప్రకాశ్‌గారు కారు దిగి పార్కులోకి వెళ్ళాడు. అంతలోనే ఆయన్ని చూసి అక్కడే ఓ బెంచిమీద కూర్చున్న చైతన్య, భైరవి, బోసుబాబు లేచి ఆయనకు ఎదురుగా వెళ్ళారు.





నలుగురూ ఓ లాన్‌లో కూర్చున్నారు. విజయ్‌ప్రకాశ్ తనకు ఎదురుగా ఉన్న ముగ్గుర్నీ చూసి రాణితో తను ఏం మాట్లాడిందీ, తనతో ఆమె మాట్లాడిన విషయాలు చెప్పి, నెమ్మదిగా అన్నాడు, "రాణి అమాయకురాలు... దురదృష్టవంతురాలు"

"అవును అంకుల్... ఆమెలాంటి వారికి ఇలాంటి కష్టాలు కలగజేసిన దేవుణ్ని అనాలి"

"నేనూ, భైరవీ ఆమెతో మాట్లాడదాం అనుకున్నాం అంకుల్. ఆమె మమ్మల్ని చూసి చిన్నబుచ్చుకుంటుందని అనుమానం వేసింది. మేం నీ వెనక ఉంటాం అని ధైర్యం చెప్పాలనీ అన్పించింది. కానీ ఆవిడ మమ్మల్ని అపార్థం చేసుకుంటుందేమోనని భయంవేసింది. చూస్తే మేం అందరం ఏదో చెప్పుకోలేని గిల్టీ కాన్షస్ వాతపడ్డాం. ఒకరిమొహాలు మరొకరు చూసుకోలేకపోతున్నాం"

విజయ్‌ప్రకాశ్ చైతన్య మాటలు విని, చిన్నగా నవ్వి, "తాము నిజాయితీపరుల మనీ తప్పుచేయని వాళ్ళమనీ అనుకునే వాళ్ళ మనసుల్లో కూడా కాస్త పాటి 'ఇగో' ఉంటుందిట. దాంతో పొరబాటు చేసిన వాళ్ళు కన్పించగానే వాళ్ళవైపు వెక్కిరింపుగా చూస్తారు. ఈ నైజం చదువుకున్న వాళ్లలో ఎక్కువగా కన్పిస్తుంది. తమకు తెలియకుండా కాలుజారిన వారు, అమాయకత్వంతో భంగపడినవారు... తమకు దారి చూపించేవాళ్లు, మంచి సలహాలు యిచ్చే వాళ్ళు ఎదురుపడినా వెనకడుగు వేస్తారు. ఇందు మూలంగా నష్టపోయేది మొత్తం సమాజం"

"నిజమే గురువుగారూ" అన్నాడు చైతన్య.

"వెంటనే మీరు ముగ్గురూ రాణిని కలిసి మాట్లాడండి. అదే కాదు ముందు భైరవి మాట్లాడితే బావుంటుంది. ఆ తర్వాత మీరిద్దరూ ఆమెను కలిసి ధైర్యం చెప్పండి. ముందు మా రాణీ ఆశ్చర్యపోతుంది. బాధపడుతుంది. కన్నీరు కూడా పెట్టుకోవచ్చు

కానీ ఓదార్చండి. సరేనా? "

"అలానే అంకుల్" అంది భైరవి.

"నేను వెళతానమ్మా" అంటూ విజయ్‌ప్రకాశ్‌గారు తన కారు ఎక్కారు.

★ ★ ★

ఊరుకు దూరంగా, అన్ని సదుపాయాలతో, ఆకర్షణీయంగా ప్రశాంతమైన వాతావరణం మధ్యన ఇరవై, ముప్పై కాటేజీలతో ఉన్న ఆ రిసార్ట్ పేరు స్ప్రింగ్‌లేండ్. అందులో పార్కులు, స్విమ్మింగ్‌పూల్స్, కృత్రిమ జలపాతాలు, పిల్లలకోసం ప్రత్యేకంగా పెద్దపెద్ద ఆర్టిఫిషియల్ జంతువుల ఆకారాలు ఎన్నో ఉన్నాయి. అప్పుడు ఓ కాటేజీలో లైట్లు వెలుగుతున్నాయి. ఆ చిన్న కాటేజ్‌లో డ్రాయింగ్‌రూమ్, బెడ్‌రూమ్, పై అంతస్తూ కూడా ఉన్నాయి. బయట ఖాళీ ప్రదేశం. అదీ ఎత్తుపల్లాలతో. ఆపైన కచ్చా రోడ్డు. దారికి ఇరువైపులా గాజుగుత్తుల ఆకారంలో లైట్లు.

అప్పుడు ఆ దారిన నడుచుకుంటూ, ముగ్గురు వ్యక్తులు కాటేజ్ దగ్గరకు వచ్చి తలుపులు తీసుకుని లోపలకు వెళ్ళి, హాల్లో ఉన్న సోఫాలో కూర్చున్నారు. అందులో ఒకతను తెల్లతోలుతో విదేశస్తుడిలా కన్పిస్తున్నాడు. అతను ఓసారి తక్కిన వారివైపు చూసి, టీపాయ్‌మీద ఉన్న 'హోల్డ్‌మాంక్' బాటిల్‌లోని విస్కీని మూడుగ్లాసుల్లో పోసి, "విశ్వనాథంగారూ, సత్యమూర్తిజీ హేవ్ యిట్. మీకు అర్జంటుగా కావల్సిన మిలటరీ స్పేర్స్ సప్లయ్‌చేసే ఈ డీల్ మా కంపెనీకి రాకుండా పోతుందని, దాని మూలంగా మేం రెండువందల కోట్లరూపాయల ఆర్డర్ చేయిజారిపోతుందనీ భయపడ్డాం. మొత్తంమీద మీరు మాకు పరోక్షంగా హెల్ప్ చేశారు. మా కంపెనీ తరపున మీకు కృతజ్ఞతలు చెబుతున్నాను" అన్నాడు ఇంగ్లీషులో.

"అన్నీ మేం కోరుకున్న స్పెసిఫికేషన్స్ ప్రకారం సరిపోయాయి. కానీ ఇంకా అతి కొద్ది అఫీషియల్ హర్డిల్స్ మిగిలిపోయాయి. ఫైలుమీద ఇద్దరు మిలటరీ పెద్దలు సంతకాలు చేయాలి. అదొక్కటే మిగిలింది స్టీఫెన్‌గారూ. అంతే"

"అవి మా కంపెనీ యం.డీగారు స్వయానా మీ హైయర్ అప్స్‌తో డీల్‌చేస్తారు. మొత్తానికి మాకు మీరు సహాయపడ్డారు. లెటజ్ స్టార్ట్ ది ప్రిలిమినరీ రౌండ్. చీర్స్" అంటూ స్టీఫెన్ తన గ్లాసును విశ్వనాథం, సత్యమూర్తి గ్లాసులకు సున్నితంగా తగిలించాడు. ముగ్గురి నోళ్లూ చప్పరింపులకు శ్రుతికల్పాయి.

స్టీఫెన్ గ్లాసును చూస్తూ, చిన్న చప్పుడయితే అటూ ఇటూ చూసి, "పైన, ఎక్కడో చప్పుడవుతోంది. ఎవరైనా ఉన్నారా ఈ కాటేజీలో" అని అడిగాడు.

"మాతోపాటు ఓ కుక్కనూ, సర్వర్‌ను తీసుకువచ్చాం. మనకు వాళ్ళు ఫుడ్ తయారుచేస్తున్నారు"

"వాళ్లు నమ్మకస్తులే కదూ"

"బాగా తెలిసినవాళ్లు. ఇలాంటి ఫంక్షన్స్ జరిగినప్పుడు వతనగా వాళ్లనే పిలుస్తాం"

"సరే అయితే" అని స్టీఫెన్ క్షణం ఆగి, ఆపైన తన కుర్చీ పక్కన పెట్టుకున్న సూట్‌కేసును ఒళ్లోకి తీసుకుని, దాన్ని తెరిచి "ఇవిగో, ఇవి ఐదులక్షలు. నోట్లు మొత్తం వందరూపాయల డినామినేషన్స్‌వే. మొత్తం ఫిఫ్టీ బండిల్స్ చూసుకోండి" అంటూ తెరిచిన సూట్‌కేసును అలానే విశ్వనాథానికి అందించాడు.

"శుభం" అంటూ విశ్వనాథం ఆ సూట్‌కేసును తనకీ, సత్యమూర్తికీ మధ్యన పెట్టాడు.

"నోట్లు చెక్‌చేసుకోండి సార్"

విశ్వనాథం, సత్యమూర్తీ నాలుగైదు బండిల్స్ తీసుకుని వాటిమీద ఉన్న బ్యాంక్ స్లిప్స్‌ను చదివి ఓసారి చిన్నగా వాటిని పరీక్షించారు. రెండుమూడు నిముషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి. అప్పుడే పైనున్న

ఫస్ట్‌ఫ్లోర్‌నుంచి కుక్కూ, సర్వరూ దిగివస్తూ, "సార్, డిన్నర్ పైన ఏర్పాటు చేయమంటారా, లేకపోతే కిందకు తీసుకురమ్మంటారా" అంటూ అడిగారు.

సత్యమూర్తిహఠాత్తుగా వాళ్ళు పలకరించే సరికి కొద్దిగా డిస్టర్బ్ అయి, "మీరు పైనే ఉండండి. డిన్నర్‌కు మేం పైకే వస్తాం. మేం పనిలో ఉన్నాం. కనిపించడంలేదా? " అన్నాడు విసుగ్గా.

అయితే కుక్కూ, సర్వరూ అతని మాటల్ని లెఖ్ఖచేయకుండా హాలు మధ్యకు వచ్చి, స్టీఫెన్‌ని చూసి చిన్నగా నవ్వి, ఆపైన విశ్వనాథాన్నీ, సత్యమూర్తినీ చూస్తూ, "సారీ సర్స్... ఉయార్ ఫ్రమ్ ఎ.సి.బి., అయామ్ పద్మనాభం, డి.ఎస్.పి., హీ ఈజ్ సుకుమార్-ఇన్‌స్పెక్టర్ అంటూ జేబులోంచి తన ఐడెంటిటీ కార్డు తీసి విశ్వనాథానికీ, సత్యమూర్తికీ చూపించి తిరిగి దాన్ని జేబులో పెట్టుకున్నాడు. సుకుమార్ కూడా అదే పని చేశాడు.

అంతే విశ్వనాథం, సత్యమూర్తీ అవాక్కు అయిపోయారు. స్టీఫెన్ తన సోఫాలోంచి లేచి పద్మనాభం పక్కగా నుంచున్నాడు. అప్పుడే బయటనుంచి ఓ ఎ.సి.బి. కానిస్టేబుల్, అతని వెనకే రిసార్ట్ మేనేజరూ, ఆయన అసిస్టెంట్ ఆ హాల్లోకి వచ్చి నిలబడ్డారు. పద్మనాభం ఓ అడుగు ముందుకు వేసి తన బేగ్ తెరిచి రెండు వారెంట్లు బయటకు తీసి వాటిని విశ్వనాథానికీ, సత్యమూర్తికీ ఇచ్చి వారివైపు కేజువల్‌గా చూస్తూ, "మీరు ఆ డబ్బు ఐదులక్షలూ లంచంగా తీసుకున్నారు. మిమ్మల్ని ట్రాప్ చేయడంకోసం ఆ డబ్బు మేమే ఎరేంజ్ చేశాం. దయుంచి మీరు వెంటనే లేచి ఆ వాష్‌బేసిన్‌లో మీ చేతులు కడుక్కోండి. అప్పుడు మీకు అంతా అర్థమవుతుంది. క్విక్, ప్లీజ్" అన్నాడు.

"ఇదేమిటి" అన్నాడు అయోమయంగా సత్యమూర్తి.

"ఏంలేదు... మీరు స్పర్శించిన ఆ నోట్లు మామూలువే అయినా మేం వాటిని నేఫ్తలిన్ పౌడర్‌తో వాష్‌చేశాం. దాంతో చేతులు కడుక్కున్న తర్వాత మీ చేతి రంగు మారుతుంది. ఈ తతంగానికి విట్‌నెస్‌గా ఈ రిసార్ట్ యజమానులను పిలిచాం"

విశ్వనాథం, సత్యమూర్తీ తలలు వంచుకుని వాష్‌బేసిన్ దగ్గరకు వెళ్ళి చేతులు కడుక్కున్నారు. వెంటనే ఇద్దరి చేతులూ ఎర్రబడ్డాయి. అవి చూసి వాళ్ళిద్దరి మొహాలు మొదట ఎర్రనయి, ఆ తర్వాత పాలిపోయాయి"

"మీరిద్దరూ లంచం పుచ్చుకుంటూ మాకు దొరికిపోయారు. అందుకని మేం మిమ్మల్ని మా కస్టడీలోకి తీసుకుంటున్నాం" అన్నాడు పద్మనాభం.

అప్పుడే మరో ఇద్దరు కానిస్టేబుల్స్ లోపలికి వచ్చి పద్మనాభానికి, సుకుమార్‌కు సెల్యూట్ చేశారు.

"మీరు ఆ స్టేట్‌మెంట్స్ ఇద్దరికీ ఇచ్చి వాళ్ళ దగ్గర సంతకాలు తీసుకునే పని పూర్తి చెయ్యండి" అన్నాడు పద్మనాభం తన పక్కనే ఉన్న సుకుమార్‌తో.

విశ్వనాథానికి అంతా అర్థమయింది. దాంతో కోపం, ఉక్రోషం వచ్చాయి. పద్మనాభంవైపు కొరకొరా చూసి, "ఓ మనిషి ద్వారా మమ్మల్ని ప్రలోభపెట్టి, అతని ద్వారా మీకు లంచం ఎరగా చూపడం న్యాయంకాదు. దీన్ని 'స్టింగ్' అంటారని మీకు తెలిసే ఉంటుంది. ఇలా ప్రలోభపెట్టడం తప్పని అమెరికాలోని న్యాయస్థానాలు కూడా ఎలుగెత్తి చెబుతున్నాయి. ఇది అన్యాయం, అక్రమం" అనేశాడు.

పద్మనాభం ఓసారి చిన్నగా నవ్వి, ఆపైన నెమ్మదిగా అన్నాడు. "చూడండి విశ్వనాథం గారూ... ఎవరైనా మీ వ్యక్తిగత జీవితంలోని ప్రవర్తనతో బయట వాళ్ళు ప్రమేయం పెట్టుకుంటే అది మీరు నిష్కర్షగా వారిని ప్రశ్నించదగ్గ అంశమే అవుతుంది. కానీ




ప్రజాజీవనంతో ముడిపడిన మీ ప్రవర్తనలో లొసుగులు ఉన్నప్పుడు- మీరు ఈ దేశంలోని ప్రజలకు మాలాంటి అవినీతి నిరోధక శాఖకు, న్యాయస్థానానికి జవాబు దారిగానే ఉండవల్సి ఉంటుంది! ఇంకా చెప్పాలంటే ఓ మనిషి ఇతరులకు ఇబ్బంది కల్గజేయకుండా, తను ఎలా ప్రవర్తించినా అతన్ని ఎవరూ అదుపుచేయనవసరంలేదు. కానీ చట్టాన్ని ఉల్లంఘించినా అతని ఆ చర్యలు సమాజానికి నష్టం కలగజేయకపోతే కొంతవరకూ సహించవచ్చు. కానీ ఈ అవినీతి వుందే. ఇది మనిషి వ్యక్తిగత నడవడికి సంబంధించిన అంశం కాదు! ఇప్పుడు అవినీతి మన సమాజాన్ని అతలాకుతలం చేస్తోంది. దీనివల్ల సమాజం మొత్తం నష్టపోతోంది. అందుకే మా ఎ.సి.బి. అనే వ్యవస్థ ఉన్నది"

విశ్వనాథం, సత్యమూర్తీ తలలు వంచుకున్నారు. ఇన్‌స్పెక్టర్ సుకుమార్ తన చేతిలోని స్టేట్‌మెంట్స్ మరోసారి సరిచూసుకుని వాటిని పద్మనాభానికి చూపించి, ఆయన తల ఊపగానే, వాటిమీద స్ప్రింగ్ లాండ్ రిసార్ట్ మేనేజర్‌ది, ఆయన అసిస్టెంట్‌ది సాక్షి సంతకాలు తీసుకుని కృతజ్ఞతలు చెప్పి వారిని పంపించేశాడు. పద్మనాభం మరోసారి విశ్వనాథాన్ని, సత్యమూర్తినీ చూసి, "మీరు నేరస్థులయినా మీరు మీ వాదం విన్పించుకునే అవకాశం మీకుంది. దాన్ని మేం కల్పిస్తాం. ఆ విషయం మీకూ తెల్సుననే అనుకుంటున్నాను. అందుకే మీకు ఇష్టమయితే మీరు బెయిల్‌కోసం అప్లయ్‌చేస్తే దానిని నేను మంజూరు చేయగలను" అన్నాడు.

"మేం బెయిల్ తీసుకుంటాం. ఇప్పుడు, ఇక్కడ మాకు తీరని అన్యాయం జరిగింది. మీరు మమ్మల్ని ట్రాప్ చేశారు. ఈ విషయంలో మేం మా లాయర్‌ను సంప్రదిస్తాం" అన్నాడు ఉక్రోషంగా విశ్వనాథం.

"యాజ్ యు ప్లీజ్" అంటూ సుకుమార్ తన దగ్గర ఉన్న బెయిల్ ఫారమ్స్ ఇద్దరికీ అందించాడు. వాళ్ళిద్దరూ గబగబా బెయిల్ ఫారమ్స్ పూర్తిచేసి, తిరిగి సుకుమార్‌కు యిచ్చారు.

సరిగ్గా అప్పుడే సత్యమూర్తి జేబులో ఉన్న సెల్‌ఫోన్ మోగింది. సత్యమూర్తి సోఫాలోంచి లేచి, ఓ పక్కగా వెళ్ళి, 'సత్యమూర్తి స్పీకింగ్' అన్నాడు. అతనికి అవతలివైపు నుంచి మాటలు విన్పిస్తున్నాయి.

"నాన్నగారూ, నేనే. సత్యమూర్తిని, ఏమిటీ? " అన్నాడు.

అవతలినుంచి తిరిగి గాంధీగారి మాటలు విన్పిస్తున్నాయి. సత్యమూర్తి మొహం ఒక్కసారి పాలిపోయింది. అక్కడే ఉన్న స్టూల్ మీద కూర్చుండిపోయి, "ఆ...ఏమిటీ... మనింటిమీద రైడింగ్ జరిగిందా" అన్నాడు నీర్సంగా, అతి చిన్నగా. ఆ పైన హీనస్వరంతోనే "నేను వస్తున్నాను" అని ఫోన్ ఆఫ్ చేశాడు.

"మేం వెళుతున్నాం" అంటూ పద్మనాభం, అతని స్టాఫ్ మెంబర్లూ, ఇంకా స్టీఫెన్ ఒక్కొక్కరే బయటకు వెళ్ళారు.

అప్పటికే విశ్వనాథానికి తాగిన మత్తు పూర్తిగా దిగింది. అందుకే దిగులు మొహం వేసుకుని బొమ్మలా సత్యమూర్తివైపు చూశాడు గానీ ఒక్కమాటా మాట్లాడలేకపోయాడు. సత్యమూర్తికి అప్పటికే కళ్లవెంట నీరు ధారాపాతంగా కారుతోంది. గుండె దడదడా కొట్టుకుంటూనే ఉంది. కాసేపు ఆగి కళ్ళు తుడుచుకుని, "నేను ఇంటికి వెళ్ళాలి. మా ఇంటిమీద కూడా ఎ.సి.బి.వాళ్ళు రైడ్ చేశారుట. ఏం చెయ్యాలి" అనేశాడు.

"మీ ఇంటిమీదా" అన్నాడు అదోలా విశ్వనాథ్.

"అవును... నేను పూర్తిగా మునిగినట్టే" అంటూ బావురుమన్నాడు సత్యమూర్తి.

అప్పుడే తిరిగి సత్యమూర్తి జేబులోని సెల్‌ఫోన్ మరోసారి మోగింది. "నేను ఝాన్సీని మాట్లాడుతున్నానండీ. ఇక్కడ

ఏం జరిగిందో తెలుసా? ఇంటినిండా అదే బెడ్‌రూమ్ గోడల్లో మీరు దాచిపెట్టిన డబ్బు ఎ.సి.బి. వాళ్ళ మనుష్యులు గునపాలతో తవ్వి బయట పడేశారు" అంటూ చెప్పసాగింది. సత్యమూర్తి నోరు అప్పటికి మూసుకుపోయింది!!



అప్పుడు తమ ఇంట జరుగుతున్న తతంగాన్ని చూసి గాంధీగారు నీరుకారిపోయాడు. రెండు గంటలనుంచి ఎ.సి.బి. వాళ్ళు ఇల్లు సెర్చి చేశారు. వాళ్ళు వారెంట్ జారీచేశారు. పక్కింటినుంచి ఇద్దర్ని విట్‌నెస్‌గా తీసుకువచ్చారు. ఇంటి గురించి, సత్యమూర్తి గురించి, ఇంటి యజమానురాలి గురించీ ఒక్కొక్క వివరణా అడుగుతూంటే నిజం దాచలేక అలాగే అబద్ధాలు ఎలా ఆడాలో తెలియక ఆయన కిందామీదా అయ్యాడు. ఇంట్లో మొత్తం ఫర్నిచర్, అధునాతనమైన వస్తువులు, నగలు ఒక్కొక్కటీ లెఖ్ఖలు వేస్తుంటే కళ్ళు అప్పగించి చూస్తూ ఉండిపోయాడు. ఆఖరిగా వాళ్ళు ఇంట్లో గోడల్ని పరీక్షిస్తూ స్టోర్‌రూమ్‌లో ఓ వాల్‌ని పగలగొట్టి అందులో ఉన్న ఉడెన్ బాక్స్ బయటకు తీశారు. అందులో బంగారపు నగలు... బ్యాంక్ డిపాజిట్స్ తాలూకు పేపర్లు, షేర్లూ దొరికాయి. పది లక్షల రూపాయలు కన్పించాయి.

ఎ.సి.బి. స్టాఫ్ మొత్తం వాటి వివరాలు రాసుకున్నారు. గాంధీగారిని వివరాలు అడిగారు. గాంధీగారు తలవంచుకుని నెమ్మదిగా అన్నాడు.

"ఈ ఇల్లు నా కొడుకు సత్యమూర్తిది. ఇందులో నాకు సంబంధించినవి ఏవీలేవు. నేనుగానీ నా భార్యగానీ ఇచ్చిన నగలుగానీ కేష్‌గానీ లేవు" అని ఉయ్యూరులో తన పేర ఉన్న ఇల్లు- రెండెకరాల పొలంగురించి చెప్పాడు. అలాగే ఝాన్సీని ప్రశ్నించారు. ఆమె కూడా వాటిగురించి తనకు తెలియదని చెప్పింది.

అప్పుడే సత్యమూర్తి ఇంటికి వచ్చాడు. ఇంట్లో జరిగినదంతా అతనికి డ్రాయింగ్‌రూమ్‌లో పరిచిన వస్తువులే చెప్పాయి.

"మీరేకదా సత్యమూర్తిగారు?" అంటూ ఎ.సి.బి. స్క్వాడ్‌లో ఒకాయన అడిగి తనని ఎ.సి.బి. మనిషిగా పరిచయం చేసుకున్నాడు.

"అవును" అన్నాడు.

"ఇవన్నీ చూస్తే మీరు మీ ఆదాయానికి మించిన ఆస్తులు కలిగి ఉన్నారని తెలుస్తోంది. మీ సోర్సెస్ ఆఫ్ ఇన్‌కమ్‌కీ వీటికీ పొంతనలేదు. మీరు దయుంచి మీ స్టేట్‌మెంట్ యివ్వాలి. మేం మిమ్మల్ని అరెస్ట్ చేయవల్సివుంది" అన్నాడు.

సత్యమూర్తి తలదించుకున్నాడు. పేపరూ కలం తీసుకున్నాడు. అతనికి తెలుసు. తన ని-తండ్రి, తల్లి, భార్యా చీటర్‌గా గుర్తించడం జరిగిందని, అందుకే తల ఎత్తి వాళ్ళవైపు చూడలేదు.



సత్యమూర్తి ఇంటిమీద ఎ.సి.బి. వాళ్ల రైడింగ్ చేయడం, అలాగే అతనూ విశ్వనాథం స్ప్రింగ్‌లాండ్ రిసార్ట్‌లో పట్టుబడడం ఆ వివరాలన్నీ పేపర్లో వచ్చాయి.





వాళ్ళు పనిచేసే డిఫెన్స్ ఆఫీసులో కూడా ఇదే విషయం అందరికీ చర్చనీయాంశమైంది. ఆఫీసులో జనరల్ మేనేజర్ 'పెండింగ్ ఇన్వెస్టిగేషన్ ఆఫ్ ది కేస్' మీద వాళ్ళను డ్యూటీనుంచి సస్పెండ్ చేశాడు.

దాంతో సత్యమూర్తి ఇంట్లోనే ఉండిపోవాల్సివచ్చింది. ఒంటరిగా తన గదిలో కూర్చునేవాడు. ఝాన్సీ భోజనం తెచ్చి అతని టేబిల్‌మీద సర్ది ఏం మాట్లాడకుండా వెళ్ళిపోయేది. అటు గాంధీగారు కూడా కొడుకు కళ్ళముందు తిరిగితే తల వంచుకుని ఉండిపోయాడు, తప్ప మాటమాత్రంగా పలకరించలేదు. తల్లికూడా భర్త మాదిరే చేసింది.

అయితే బోసుబాబు మాత్రం ఓరోజు బావగార్ని పలకరించడానికి సత్యమూర్తి ఇంటికి వచ్చాడు. బావగార్ని ఎలా పలకరించాలో తెలియక ఝాన్సీ కోసం చూశాడు. ఝాన్సీ మామూలుగా తన గదిలో కాకుండా వేరేగదిలో మంచంమీద పడుకుని ఉంది. బోసును చూసి, కన్నీళ్ళు పెట్టుకుంది గానీ ఒక్క మాటా మాట్లాడలేదు. తిరిగి డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చేసరికి వాకిట్లో దూరదూరంగా గాంధీగారూ, సత్యమూర్తీ కూర్చుని కన్పించారు.

"నన్ను మా మేనేజ్‌మెంట్ సస్పెండ్ చేసింది బోసూ. నువ్వు నన్ను కన్సోల్ చేయడానికి వచ్చావనుకుంటాను. చాలా థాంక్స్" అన్నాడు. ఆ మాటలకు బోసు ఆశ్చర్యపోయాడు.

"అవును బోసూ... చూశావా, మా ఇల్లూ, మా వాళ్ళూ నాతో ఎంత ముభావంగా ఉంటున్నారో... అందరూ, ఈ దేశంలో నేనొక్కణ్ణే అవినీతి పరుడనుకుంటున్నారు. కానీ చాలామంది ఇళ్లలో ఈ భాగోతం నిత్యం నడుస్తూనే ఉంటుంది. పైగా ఈ ఇంట్లో అందరూ నన్నో పురుగును చూసినట్టు చూస్తున్నారు. ఆఖరికి ఝాన్సీకి కూడా నేను పనికిరానివాణ్ణి అయ్యాను. నాకు తెలుసు. ఇదంతా ఎవరు చేశారో. ఇది చేసింది నా చెల్లెలి మొగుడు, చైతన్యే"

బోసుబాబు నెమ్మదిగా అన్నాడు.

"మీరు ఆవేశపడొద్దు. బాధపడొద్దు. అయినా ఇలాంటప్పుడు ఎవర్ని నిందించి లాభం ఏముంటుంది? ఇప్పుడు మీరు చేయవల్సింది ఒకటే... మీరుగా మీరు నిర్దోషులయితే అది నిరూపించుకుందుకు ప్రయత్నించడమే. మరో విషయం. యివన్నీ కావాలని మీ బావగారు చేయించారని అనుకోవద్దు. అతను నెలక్రితమే పోలీసు ఎకాడమీకు ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళిపోయాడు"

సత్యమూర్తి అదోలా బోసుబాబును చూసి, "నీకు అతను స్నేహితుడు. నాకన్నా ఎక్కువ. నువ్వు అతన్ని వెనకేసుకురావడం సహజం" అన్నాడు.

"నేను ఏం చెప్పినా మీరు నమ్మకపోవచ్చు మీరిద్దరూ నాకు కావల్సినవాళ్ళే. పేపర్లో చూసి నేను చాలా కంగారుపడి ఇలా వచ్చాను. కొంత కాలం మీరూ, ఝాన్సీ వెళ్ళి మా ఊళ్లో ఉంటే బావుంటుంది. ఇద్దరికీ మనశ్శాంతిగా ఉంటుంది. దానికీ రెస్ట్ అవసరం"

"నాకు ఎటూ పోవాలని లేదు. ఇష్టమయితే ఝాన్సీని మీ ఊరు నువ్వే తీసుకువెళ్లు. ఎటూ మామధ్య సయోధ్యలేదుగా"

సరిగ్గా అప్పుడే బయటనుంచి ఎవరో, "సత్యమూర్తీ" అని పిలిచారు. సత్యమూర్తి గుమ్మందాకా వెళ్ళి, బయట నిలబడ్డ వ్యక్తిని చూసి, "రా, జయంత్" అంటూ ఆహ్వానించాడు. సోఫా చూపించి తండ్రినీ, బావమరిదిని పరిచయం చేసి, తండ్రివైపు తిరిగి, "నాన్నగారూ... ఇతను నా లాయర్ ఫ్రెండ్. నా కేసు ఇతను డిఫెండ్ చేస్తున్నారు" అన్నాడు. జయంత్ ఓసారి సత్యమూర్తినీ, మిగిలిన ఇద్దర్నీ చూశాడు.

"సత్యమూర్తీ... ఇందులో నువ్వు భయపడవల్సింది ఏం లేదు. ఎ.సి.బి. పెట్టిన చాలా కేసులు కోర్టులో వీగిపోవడం నాకు తెలుసు. కానైతే అపనింద అంటావా.

కొంతకాలం జనం మాట్లాడుకుంటారు. ఆ తర్వాత మర్చిపోతారు"

"దాని గురించే నాకన్నా ఎక్కువగా మా ఇంట్లోవాళ్ళు బాధపడుతున్నారు"

"మన ప్రజ దోషుల్నీ, నిర్దోషుల్నీ ఒకే గాట కట్టి మాట్లాడుతుంది. దేశాన్ని ఏలుతున్న వాళ్ళకే ఈ తిప్పలు తప్పడంలేదు. టేక్ ఇట్ ఈజీ" అని జయంత్ గాంధీగారి వైపుచూసి,

"సార్... మీ అబ్బాయి మీద ఒక కేసు [illegible]డం, వీగిపోవడం యివి రెండూ మీమీదా, మీ సాక్ష్యాలమీదా, ముఖ్యంగా ఇతని భార్య సాక్ష్యం మీదా ఆధారపడి ఉన్నాయ్. అంటే పెద్దవారు, మీకు తెలిసే ఉంటుంది"

గాంధీగారు ఆశ్చర్యంగా లాయర్‌వైపు చూశాడు.

"మీ ఇంటిమీద రైడింగ్ జరిగింది. ఏవేవో నగలు, డబ్బు బయటపడ్డాయి. మీరు ఎ.సి.బి. వాళ్ళకు స్టేట్‌మెంట్స్ రాసి యిచ్చారు. కానీ ఇప్పుడు ఆ స్టేట్‌మెంట్స్‌ను కాంట్రడిక్ట్ చేయాలి. మీరు రైడింగ్ చూసి భయపడి, పేనిక్ అయి- ఎ.సి.బి. వాళ్ళు ప్రెషర్ చేస్తే స్టేట్‌మెంట్స్ యిచ్చామని చెప్పాలి. ఇక మరో విషయం. ముఖ్యంగా పట్టుబడ్డ నగల్లో చాలామటుకు మీకు రెండుమూడు తరాలుగా వస్తున్నవనీ- మీరు వాటిని ప్రేమతో మీ కోడలికి యిచ్చామనీ చెప్పాలి. అలాగే ఇక డబ్బు విషయం.

బయటపడ్డ డబ్బులో చాలాభాగం మీ పొలంమీద వచ్చిన ఆదాయం తాలూకుదనీ, దొంగలభయం చేత దాచిపెట్టాం అనీ చెప్పాలి. దాంతో మీ అబ్బాయి కొంత తెరిపిన పడతాడు"

గాంధీగారు ఖిన్నవదనంతో లాయర్‌వైపు చూశాడు.

జయంత్ తిరిగి సత్యమూర్తిని చూసి, "మీ భార్య కూడా చాలా నగలూ, బంగారం తన పుట్టింటివాళ్ళు స్త్రీ ధనంగా ఇచ్చారనీ, ఆ ప్రోపర్టీ ఒకటి, రెండుతరాలుగా వస్తోందనీ చెప్పాలి. అదే విషయం మీ మామగారూ, మీ బావమరిదీ కన్‌ఫర్మ్ చేస్తే చాలు" అన్నాడు.

సత్యమూర్తి లోపలికి చూస్తూ, "ఝాన్సీ కాఫీ కలుపుతున్నావా, మన లాయర్‌గారు వచ్చారు. ఓసారి ఆ గదిలోంచి బయటకు రా" అని పిలిచాడు.

"అమ్మాయి పడుకుందేమో... కాఫీ నేను కలుపుతాను. ఆమెను రెస్ట్ తీసుకోనీ. నిన్నటినుంచీ ఝాన్సీ నీరసంగా కన్పిస్తోంది" అని కాంతమ్మగారు కిచెన్‌లోకి వెళ్ళింది.

జయంత్ ఓసారి గాంధీగారివైపు చూసి, "మీరు పెద్దవారు. పైగా మీ తరం వేరు, అప్పటి మనుషులు వేరు. నేను మీకు ఈ సలహా చెప్పానంటే అది నా వృత్తి ధర్మాన్ని బట్టి చెప్పవల్సివచ్చింది. పైగా సత్యమూర్తి ఇప్పుడు ఇరుకుల్లో పడ్డాడు. అలాగని... అతణ్ణి అలా గాలికి వదిలేస్తే అతగాడి భవిష్యత్‌కు దెబ్బ తగులుతుంది. మీరూ ఆలోచించండి సార్. ఏ విషయం నాకు ఫోన్ చేసి చెబితే నేను చేయవల్సింది చేస్తాను" అన్నాడు జయంత్.

సత్యమూర్తి తండ్రివైపు చూసి, "ఏం చేద్దాం నాన్నగారూ... మీరేమంటారు?" అని నెమ్మదిగా అడిగాడు. ఆపైన బోసుబాబువైపు చూసి, "నువ్వేమంటావ్ బోసు బాబూ... నీ సలహా ఏమిటి? మా నాన్నగారికీ, మీ అక్కకూ నువ్వే నచ్చచెప్పాలి" అన్నాడు.

గాంధీగారూ, బోసుబాబు మౌనంగా ఉండిపోయారు. కాంతమ్మగారు లోపలినుంచి కాఫీలు తెచ్చింది. జయంత్ కాఫీ తాగి "వెడతాను. సత్యమూర్తీ" అని సోఫాలోంచి లేచాడు.

"నేనూ వస్తాను పద" అంటూ సత్యమూర్తి జయంత్‌తో బయటకు వెళ్ళాడు.

"నేనూ వెళతాను మామయ్యగారూ"

అంటూ బోసుబాబూ లేచాడు.

గాంధీగారు తల ఊపాడు. బోసుబాబు లోపలికి వెళ్ళి, "అక్కా! నేను వెళుతున్నాను. ఈ గొడవ ఓ పట్టాన తేలేది కాదు. నీ ఆరోగ్యం జాగ్రత్త. నా ఉద్దేశ్యంలో నువ్వు కొద్దిరోజులు మన ఊరు వెళ్ళివుంటే బావుం టుంది. ఆలోచించు... అవసరమయితే నాకు ఫోన్ చెయ్యి" అంటూ తిరిగి డ్రాయిం గ్‌రూమ్‌లోకి వచ్చి గాంధీగారితో, కాంతమ్మ గారితో చెప్పి బయటకు వెళ్లిపోయాడు.

అతను వెళ్లిన తర్వాత గాంధీగారూ, కాంతమ్మా చాలాసేపు మౌనంగానే కూర్చు న్నారు. సరిగ్గా అదే సమయంలో భైరవి లోపలికి వచ్చింది. వస్తూనే,

"ఎలా వున్నారు నాన్నగారూ... ఎలా ఉన్నావు అమ్మా" అంటూ పలకరించి తండ్రి పక్కన కూర్చుంది.

"చూస్తున్నావుకదా తల్లీ... నీకు తెలియం దేముంది?"

"అన్నయ్యా, వదినా ఇంట్లో లేరా?"

"వాడు బయటకు వెళ్ళాడు. ఝాన్సీ లోపల ఉంది"

"నాన్నగారూ... అన్నయ్య అత్యాసకు పోయి తనకు తనుగా ఉచ్చులో ఇరుక్కు న్నాడు. మీ ఇద్దరి దగ్గరా నేను ఎప్పుడూ పైకి అనలేదుగానీ నేనూ, చైతన్యా భయప డ్డట్టుగానే జరిగింది"

"నిజమే... ఇవన్నీ వాడు తెలిసీ, కావా లనీ చేసుకున్నాడు"

"మీరు ఈ వయసులో ఇలాంటివి కళ్ళతో చూడవల్సివచ్చింది. నిజమే... మీకూ బాధగానే ఉంటుంది. కానీ మీరు మీ ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకుని మనసు దిటవు చేసుకోండి"

"నేను కాదు భైరవీ... మీ అమ్మా, ఝాన్సీ చాలా డీలాపడ్డారు"

భైరవి ఓ క్షణం ఆగి, "అన్నయ్య ఏమం టున్నాడు? ఏం చేస్తాట్ట?" అంది.

"చూస్తే వాడికి ఏ కోశానా బాధా, అవ మానం ఉన్నట్టులేదు. ఈ కేసునుంచి ఎలా తప్పించుకోవాలా అని మార్గాలు వెదుకుతు న్నాడు. దానికోసం నన్నూ, అమ్మనూ, ఝాన్సీని అడ్డం పెట్టుకుని కేసు తేలికపర్చా లని చూస్తున్నాడు" అంటూ గాంధీగారు జరిగిందంతా భైరవికి చెప్పాడు.

"మీరేం చేద్దామనుకుంటున్నారు?"

"గంగిరెద్దులా వాడు చెప్పినట్టు తల ఊపడం నాకు ఇష్టంలేదమ్మా. కానీ వాడు అలా ఆలోచించడంలేదు. నాకూ, అమ్మకూ తనంటే ప్రేమ లేదన్నట్టుగా మాట్లాడుతు న్నాడు"

"ఇదంతా మా కర్మ తల్లీ. ఈ ఊరు రాకున్నా బావుండేదేమో..." అంది తల్లి.

"నేనూ, అమ్మా తిరిగి ఉయ్యూరు వెళ్ళి పోతే బావుంటుందనుకుంటున్నాం"

"అదేమిటి నాన్నగారూ?"

"వాడికి మేం ఉపయోగపడనప్పుడు వాడికి మామీద గౌరవం, ఆపేక్షా తగ్గు తాయి. అది సహజం. అది తెలిసీ మేం ఇక్కడ ఉండడం బావుండదు. అవునా?"

భైరవికి ఏం చెప్పాలో తెలియలేదు. కాసేపు ఆలోచించి, నెమ్మదిగా, "మీరు ఉయ్యూరు వెళ్ళొద్దు నాన్నగారూ... నా దగ్గర, మా ఇంట్లో ఉందురుగాని. మీరూ, అమ్మా వస్తే చైతన్య కూడా ఆనందిస్తాడు"

"బావుండదే భైరవీ... కొడుకుతో దెబ్బ లాడి కూతురి ఇంటికి వెళ్ళామనే మాట మాకు రాకూడదు"

"పోనీ అమ్మా! అన్నయ్యకు నేను చెప్పనా, వాడితో మాట్లాడనా?"

"ఏమని చెబుతావు? వాడికి నువ్వన్నా, నీ మొగుడన్నా కూడా కోపమే"

"మరేం చెయ్యాలి నాన్నగారూ?"

గాంధీగారు మాట్లాడలేదు. కళ్ళు మూసు కున్నాడు. "సత్యం ఎవరు చెప్పినా విన దమ్మా. వీడి నైజం చూస్తే, నాకు కురుక్షేత్ర యుద్ధం ముగిసిన తర్వాత, దుర్యోధనుడు పశ్చాత్తాపంతో 'ధర్మం ఏదో నాకు తెలుసు.





కానీ నా మనసు అటు మళ్ళదు. అలాగే అధర్మం ఏదో కూడా నాకు తెలుసు. కానీ దాన్నుంచీ నా మనసు మళ్ళదు' అంటూ కుమిలిపోతాడు. చూస్తే వీడి పరిస్థితీ అలానే ఉందనిపిస్తోంది" అన్నాడు నిర్లిప్తతతో.

కాంతమ్మ ఆ మాటలు విని బాధ ఆపుకోలేనిదానిలా బావురుమంది. గాంధీగారూ, భైరవీ తల్లి పరిస్థితి చూసి వాస్తవంలోకి వచ్చారు. గాంధీగారు లేచి భార్య దగ్గరకు వెళ్ళి, "ఊరుకో... బాధపడకు. ఏం చేస్తాం, మన కర్మ" అన్నాడు. భైరవి కూడా "ఊరుకో అమ్మా" అంటూ తల్లి వీపు నిమిరి, కళ్ళు తుడిచింది.

"ఊరుకుంటానే... నాదేం వుంది? పాపం మీ వదిన మనకన్నా ఎక్కువ ఇదవుతోంది. పైకి చెప్పదు. నువ్వెళ్ళి వదిన్ని..." అని ఆగిపోయింది కాంతమ్మ. భైరవి "అలానే" అని ఝాన్సీ గదిలోకివెళ్ళి, గోడవైపు తిరిగి పడుకున్న ఝాన్సీ పక్కన కూర్చుంది. "వదినా" అని నెమ్మదిగా వంటి మీద చెయ్యివేసి పిల్చింది.

ఝాన్సీ కళ్ళు తెరిచి, "నువ్వా భైరవీ" అంటూ లేచి కూర్చుంది.

"విషయం తెల్సిన వెంటనే నాకు మిమ్మల్నందరినీ చూడాలన్పించింది వదినా... కానీ ఆలస్యం అయింది. కారణం..." భైరవి ఆగిపోయింది.

"ఇక్కడకు రాకపోయినా నువ్వు ఈ ఇంటిగురించి బాధపడుతూనే ఉంటావని నాకు తెలుసు"

"అమ్మానాన్నా అన్నీ చెప్పారు. ఏది ఏమైనా నువ్వు మాత్రం దిగులు పెట్టుకోవద్దు. నేను ఇది చెప్పడానికే వచ్చాను"

"మీ అన్నయ్యా ఇక్కడ మా అందరి చేతులూ కట్టేశారు. మనం ఎవరం ఏం చేయలేం. ఎంత చెప్పినా ఈ విషయం ఆయనకు అర్థంకావడంలేదు. అత్తయ్యగారినీ, మామయ్యగారినీ చూసి అయినా..." ఝాన్సీ మాటలు ఆపేసింది.

"అన్నయ్యకు ఫోన్ చేసి బాగా తిట్టమంటావా వదినా. వాడు నన్ను ఏమన్నా నేను లెఖ్ఖ చేయను. నువ్వు చెప్పు ఏం చేయమంటావో? "

"ఎవరెన్ని తిట్టినా మీ అన్నయ్య మారరు. దీనికి ఒకటే పరిష్కారం ఉంది. కానీ ఆయన దానికి తల ఊపరు"

"అంతేనంటావా? "

అలా భైరవీ, ఝాన్సీ చాలాసేపు మాట్లాడుకుంటూనే ఉన్నారు. ఒకరినొకరు ఓదార్చుకుంటూనే ఉన్నారు. ఆపైన దీర్ఘంగా ఆలోచిస్తూ ఉన్నారు.



రాత్రి ఏడుగంటలయింది. సత్యమూర్తి తన ఇంట్లోంచి బయటకు వచ్చి సందు మొగదాకా నడిచి వెళ్ళాడు. అక్కడో ఆటో మాట్లాడుకుని సికింద్రాబాద్ స్టేషన్ వరకూ వెళ్ళాడు. అక్కడ మరో ఆటో ఎక్కి మలక్ పేట టి.వి. టవర్ దగ్గర దిగాడు. మలక్ పేట లోపలికి వెళ్ళే ఎత్తైన రోడ్ వెంబడి కొంతదూరం నడిచి ఓ ఇంటిముందు ఆగాడు. ఆ ఇంటిముందు ఓ షామియానా ఉంది. అందులో ఉన్న కుర్చీల్లో కూర్చుని

ఆడా మగా టిఫిన్లు తింటున్నారు. సత్య మూర్తి కాసేపు తటపటాయించి లోపలికి వెళుతున్న పదేళ్ల అమ్మాయిని "విశ్వనాథం అంకుల్ లోపల ఉంటే పిలుస్తావా? " అని నెమ్మదిగా అడిగాడు. ఐదునిముషాల్లో లోపలినుంచి విశ్వనాథం "రా సత్యమూర్తీ!' అంటూ అటుగా వస్తున్న తన బావమరిది రామబ్రహ్మానికి 'నా అసిస్టెంట్' అంటూ గుంభనంగా పరిచయం చేశాడు. రామ బ్రహ్మం అదోలా చూశాడు సత్యమూర్తిని. సత్యమూర్తి రామబ్రహ్మం చంకలో ఉన్న మూడేళ్ల పాపని చూసి తన జేబులోంచి గిఫ్ట్ కవర్ పైకి తీసి పాప చేతిలో పెట్టాడు. రామబ్రహ్మం నవ్వీనవ్వనట్టుగా సత్యమూర్తివైపు చూసి అక్కడినుంచి వెళ్లిపో యాడు. మరో చిన్నపిల్లాడు ఓ ప్లేటులో స్వీటూ, హాటూ తెచ్చి సత్యమూర్తికి అందించి వెళ్లిపోయాడు.

"తిను సత్యమూర్తీ! మనం ఇక్కడ కల్సు కుంటే బావుంటుందని నిన్ను రమ్మన్నాను. ఈ ఇల్లు మా బావమరిది రామబ్రహ్మానిది. టిఫిన్ కానీయ్. మనం డాబామీదకి వెళ్లి మాట్లాడుకుందాం" అన్నాడు విశ్వనాథం.

సత్యమూర్తి టిఫిన్ తిని, కాఫీ తాగగానే విశ్వనాథం రమ్మనట్టు సౌంజ్ఞ చేసి ముందుగా తను లోపలికి దారి తీశాడు. సత్యమూర్తి ఆయన వెనకే వెళ్లాడు. మెట్ల గుండా డాబా మీదకు వెళ్లి అక్కడ ఉన్న పేం కుర్చీల్లో కూర్చున్నారు.

"ఎలా ఉన్నావ్? "

సత్యమూర్తి జవాబు చెప్పకుండా ఒక్క సారి బావురుమని ఏడ్చాడు. విశ్వనాథం గారు సత్యమూర్తివైపు చూసి ఓ క్షణం ఆగి "ఇదేమిటీ ఏడుస్తున్నావా? ఊరుకో. ఊరు కోమంటూంటే..." అంటూ భుజం మీద రాశాడు.

"నాకు ఏం తోచడంలేదు గురువుగారూ! ఒంటరిగా కూర్చుంటే పాడు ఆలోచనలు వస్తున్నాయి. దాంతో ఏడుపు వస్తోంది. గట్టున పడ్డం ఎలానో తెలియడంలేదు"

"మీ ఇంట్లోవాళ్లు, అదే నీ భార్యా, తల్లీ బాగా బెంబేలుపడి ఉంటారు. మీ నాన్న గారు అన్నీ తెలిసి నీమీద అగ్నిహోత్రంగా మారి ఉండాలి. పైగా పేపర్లో వచ్చిందిగా!"

సత్యమూర్తి తలూపి "మా వీధిలో తెలి సున్నవాళ్లు నావైపు దొంగని చూసినట్టు చూస్తున్నారు"

"ఏం చేస్తాం? దురదృష్టం మనల్ని వెంటాడింది. ఎంత తెలివి తేటలుంటే ఏం లాభం? ఆ స్టీఫెన్‌గాడ్ని సరిగ్గా అంచనా వేయలేకపోయాను. వాడు ఏడాదిగా నా కూడా పడ్డాడు. నమ్మేశాను. వాడు ఏడా దిగా మనమీద కన్నువేసి ఉన్నాట్ట. పైగా వీడికి ఇక్కడి లోకల్ ఎ.సి.బి. వాళ్లు సహా యపడ్డారట..."

"ఇంకెవరు, నా బావ చైతన్యే అయ్యుం టాడు"

"వాడు కాదయ్యా. వాడు అయితే నాకు ఎప్పుడో ఉప్పు అందేది"

సత్యమూర్తి తల వంచుకునే ఉన్నాడు. "ఏమో సార్! మీమీద ఒకటే కేసు - బ్రైబ్ తీసుకున్నట్టు. కానీ నా పీకలమీద రెండు కేసులు..."

"మొదటిదానికి భయపడనవసరం లేదయ్యా. ఎ.సి.బి. లో ఓ హయ్యరప్ నాకు బాగా తెలుసు. మన కేసు వీక్ చేయాలంటే వాడికి బాగా చేయి తడపవ లసి ఉంటుంది. దీనికి రెండు లక్షలు చేత పట్టుకుంటే పని సౌలభ్యం అవుతుంది"

"రెండు లక్షలా గురువుగారూ? "

"అవును, ఇద్దరికీ చెరో లక్షా పడుతుంది. నువ్వేమంటావ్ చెప్పు"

సత్యమూర్తి మారు మాట్లాడకుండా సరే అన్నట్టుగా తల ఊపాడు.

"నువ్వు నీ లక్షా తొందరగా ఏర్పాటు చెయ్యి. ఆలశ్యం అవకూడదు"

"రేపే ఇస్తాను."

విశ్వనాథం ఆశ్చర్యంగా సత్యమూర్తి వైపు చూసి "ఇంట్లో బంగారం, డబ్బూ వాళ్లు




ఊడ్చుకుపోయారంటున్నావ్. మరి... ఎలా ఎరేంజ్ చేద్దామనీ...."

"కొద్దిగా రాణీ ఉంటూన్న ఇంట్లో ఆమె దగ్గర దాచి పెట్టాను. దాంతో పని అవుతుంది"

"అమ్మో, నీది పెద్ద బుర్రే"

"ఏమో సార్! తల్చుకుంటే నాకు కాళ్లూచేతులూ వణుకుతున్నాయి. మీతోపాటు నన్నూ గట్టున పడెయ్యండి సార్. ఇంటి మీద రైడింగ్ కేసుకు కూడా ఏదో దారి చూపించండి. నన్ను నిరాధారంగా వదిలేయద్దు. మీ కాళ్లు పట్టుకుంటాను" అంటూ సత్యమూర్తి తన కుర్చీ దిగి విశ్వనాథం కాళ్ల మీద పడ్డాడు.

కాళ్లమీదపడ్డ సత్యమూర్తిని జాలిగా చూసి "లే సత్యమూర్తీ! నేను అన్నివిధాలా ప్రయత్నిస్తాను. భయపడకు" అంటూ లేవదీశాడు విశ్వనాథం.

"నామీద ఉన్న కేసులు మాఫీ అయితే మీ మేలు మర్చిపోను. నన్ను మరోచోటుకు ట్రాన్స్‌ఫర్ చేస్తారు. నాకు సర్వీస్ ఉంది. మిమ్మల్ని మర్చిపోను గురువుగారూ"

"నీ సంగతి తెలియదా సత్యమూర్తీ! కానీ నీ రెండో కేసు గురించి ఇక్కడ కాదు. ఢిల్లీ వెళ్లి ప్రయత్నించాలి. ఓ మినిస్టర్ ద్వారా ఇది వీగిపోయేట్టు చేయాలి. ఇంకా ఈ కేసులో నీకు నీ తండ్రీ, భార్యా, మామగారూ సహకరించాలి. మన లాయర్ జయంత్ చెప్పే ఉండాలి. చాలా డబ్బు అవసరమవుతుంది"

"నా ఫ్రెండ్స్‌ని అడుగుతాను. అప్పుగా ఇమ్మంటాను. ఓ రెండు లక్షలు సరిపోతాయా గురువుగారూ? "

"సరిపోతాయిగానీ... వెర్రివాడా, ఇదంతా ఎలా తీరుస్తావయ్యా. అయినా ఈ డొంక తిరుగుడు దేనికి మీ నాన్నగారు నిన్ను ఆదుకోవచ్చుగా"

"ఆయన మొండిమనిషి. ఇప్పటికే ఆయన నామీద నిప్పులు కురిపిస్తున్నాడు"

"ఎంతయినా ఆయనకు నువ్వు కన్నబిడ్డవి. ఆపేక్ష ఎక్కడికి పోతుంది. అమ్మా నాన్నల ముందు అన్నీ మరిచి 'ఏక్షన్' చెయ్యాలయ్యా. నిన్ను దూరం చేసుకుంటారా? "

అన్నీ చెప్పి విశ్వనాథంగారు చేతి వాచీ చూసుకుని "ఇది చెప్పడానికే నిన్ను రమ్మన్నది. నువ్వు త్వరగా రాణీ ఇంట్లో ఉన్న డబ్బు తీసుకుని నాకు కబురు చెయ్యి. ఫోన్ చెయ్యద్దు.- మన ప్యూన్ రాజయ్యకు చెప్పు. ఆరోజు నీదారిన నువ్వు మనోహర్ టాకీస్‌కు రా. నేను ఇటునుంచి వస్తాను. ఆ హాల్లోకి ఎక్కువగా జనం రారు. మనిద్దరం ఎవరికంటా పడకుండా రెండు లక్షలూ ఆ హాల్లోనే ఎ.సి.బి. ఆసామికి ఇచ్చేద్దాం. ఓ దణ్ణం పెడదాం. విషానికి విరుగుడు ఏమిటో, మనం ఏంచెయ్యాలో అతనే చెబుతాడు" అని కాసేపు ఆగి,

"నువ్వు వచ్చిన దారినే బయటకు వెళ్లు. వెళ్లేముందు మా రామబ్రహ్మానికి చెప్పి వెళ్లు. మరెవరితోనూ మాట్లాడకు"

"సరే"

"మధ్యలో రాణీ ఇంటికి వెళ్లి ఆమెతో కులకడం అనే కార్యక్రమం పెట్టుకోకు. తెలిసిందా? బై" అన్నాడు విశ్వనాథం.

సత్యమూర్తి మెట్లవైపు దారి తీశాడు. విశ్వనాథం ఆకాశంవైపు చూస్తూ కూర్చున్నాడు. అప్పుడే ఆయన శ్రీమతి డాబా మీదకు వచ్చి భర్తవైపు చూసి,

"ఇక్కడేం చేస్తున్నారు? " అంది.

"మనసు బాగోలేదు. కూర్చున్నాను"

"ఇదిగో ఇదే మీకు చెప్పడం. ఇక్కడ మందు కొట్టడం పని పెట్టుకోవద్దు. మా తమ్ముడు చెప్పాడు. వాడితో ఓ బాటిల్ తెమ్మని అన్నారటగా. మీకు ఇంత జరిగినా సిగ్గులేదు. ఏం మనిషో! ఒకవంక నేను సిగ్గుపడి చస్తూంటే మీకు చీమ కుట్టినట్టుకూడా లేదు. మనింటికి పోదాం"

"మీ తమ్ముడు పార్టీకి పిలిస్తే సీసాలు కూడా సప్లయ్ చేస్తాడనుకున్నాను. నాకేం తెలుసు? "

"మీకు అన్నీ తెలుసు. కిందకు పదండి"

"నువ్వు వెళ్లు. నేను వస్తాను"

"మీమీద ఓ కన్నేసి ఉంచమని మన పిల్లలిద్దరూ ఫోన్ చేసి ఒకటే చెబుతున్నారు. ఏడుస్తున్నారు"

"అంటే? "

"మీరేమన్నా అఘాయిత్యం చేస్తారేమోనని వాళ్ల భయం. వాళ్లకు ఏం తెలుసు? వంద ఎలకల్ని తిన్న పిల్లి ఏ పాపం ఎరగనట్టు తీర్థ యాత్రకు బయలుదేరి వెళ్ళిన కథ" అంది వెటకారంగా. విశ్వనాథం నవ్వేశాడు.



"నేను రేపు ఉదయం లాయర్ జయంత్ దగ్గరకు వెడుతున్నాను. అక్కడినుంచి మీకు ఫోన్ చేస్తాను. బహుశా మీరూ, ఝాన్సీ ఆయన చెప్పినట్టు చేయవల్సి వుంటుంది నాన్నగారూ. ఎందుకంటే ఆయన నా తరపున కోర్టులో ఎఫిడవిట్ సబ్మిట్ చేయాల్సి ఉంటుంది" అన్నాడు సత్యమూర్తి తండ్రి పక్కన కూర్చుంటూ.

గాంధీగారు మాట్లాడలేదు.

"మీకే నాన్నగారూ చెబుతున్నది"

"ఎందుకురా ఇవన్నీ... నాకు తెలుసున్నంతవరకూ ఈ కేసు కోర్టులో నిలబడదు"

"అవన్నీ జయంత్ చూసుకుంటాడు. కేసులో బలాన్నిబట్టి కోర్టు తీర్పురాదు. మన బలాన్ని బట్టి ఏదైనా చేయవచ్చు" అన్నాడు గర్వంగా సత్యమూర్తి.

"చూడు సత్యం... నేనెటువంటివాణ్ణో నీకు తెలుసు. నేను నా సర్వీసు మొత్తంలో ఏనాడూ ఏ ఒక్క లంచగొండినీ సమర్థించలేదు. వాళ్ళకు కొమ్ము కాయలేదు. ఆఖరికి ఇదే విషయంలో భాస్కరంతో గొడవపడ్డాను. వాడు నన్ను నిందించినా బాధపడలేదు. నీకూ తెలుసు"

"కానీ ఆ రోజులు వేరు నాన్నగారూ"

"రోజులు కాదు మనుషులు వేరు అనీ, దిగజారారనీ అను బావుంటుంది"

"ఈ సమయంలో మీరే నన్ను ఆదుకోకపోతే నేను ఏమయిపోతాను. నాకు వేరే బలమైన సాక్ష్యం ఎక్కడ దొరుకుతుంది? ఒకవేళ నేను నేరస్థుడిగా రుజువయితే నా ఉద్యోగం పోతుంది. జైలుపాలు కూడా అవ్వాల్సివస్తుంది. అది మీకు ఆనందమా? "

"చూడు సత్యం... నేను నిన్ను ఎన్నోసార్లు హెచ్చరించాను. సలహాలు కూడా చెప్పాను. ఉద్యోగధర్మం ఒకటి ఉంటుందని. నువ్వు చెవిపెట్టలేదు. కన్నూమిన్నూ కానకుండా నీ హోదాని అడ్డుపెట్టుకుని ఇంత డబ్బు, బంగారం కూడబెట్టావు. వాటిని ఇంటిలోనే దాచావు. ఇది నేరం అని నీకు తెలియదా? నువ్వు జైలుపాలైతే నీ పెళ్ళాం పిల్లలు వీధినపడతారని తెలియదా? ఇప్పుడు ఈ తలవంపులు, అవమానం నీతోనే పోలేదుగా. గుమ్మందిగి దొంగలా బయటకెళ్ళే పరిస్థితి మాకూ, నీ భార్యకూ కూడా కలగచేశావే... ఎంత తప్పు? "

సత్యమూర్తికి నోట మాటరాలేదు.

"సారీరా... నేను నువ్వు చెప్పినట్టూ, మీ లాయరు చెప్పినట్టూ చేయలేనురా. అందుకు నా మనసు ఒప్పుకోదు"

"నాన్నా..." అన్నాడు సత్యమూర్తి షాక్ తిన్నవాడిలా.

"నేను చెప్పేది ఒకటే సత్యం. నువ్వు నిజాయితీగా నీ నేరాలు ఒప్పుకుని, ఏ శిక్ష పడినా అనుభవించడంకన్నా మరోదారి లేదు"

"అంటే... నేను వెళ్ళి జైల్లో కూర్చోవాలనా? ఇదేనా మీరిచ్చే సలహా? "

"కన్‌ఫెషన్ ఆఫ్ ట్రూత్ అని ఓ మాట ఉంది. ఆ మాట వెనుక దేవుడు దాగి ఉంటాడు. దానిమూలంగా నువ్వు తక్కువ శిక్షతో బయటపడొచ్చు" అన్నాడు గాంధీ నిబ్బరంగా.

అప్పుడే అక్కడికి కాంతమ్మగారు కూడా వచ్చింది.

సత్యమూర్తి తల్లి మొహంలోకి చూశాడు. అతనికి అప్పటికే కళ్ళవెంబడి నీళ్ళుకారడం మొదలయ్యింది. అందుకే తల్లిని చూసి, "చూడమ్మా, నాన్నగారు ఏమంటున్నారో... అసలే నా ప్రాణంమీదకు వచ్చిందా. అన్నీ తెలిసి నా చావు నన్ను చావమంటున్నారు. ఇది న్యాయంగా ఉందా? ఆయనకు నువ్వయినా చెప్పమ్మా"

"ముందు కళ్ళు తుడుచుకో సత్యం" అంది కాంతమ్మ.

"నాకు మీరు కాక ఎవరున్నారమ్మా... ఇలా నన్ను ఒంటరిగా వదిలేస్తారా? "

"ఇందాకా నువ్వే అన్నావుకదరా... ఈ దేశంలో బలం ఉన్నవాడిదే రాజ్యమని. నిన్ను గుడ్డిగా సమర్థించేవాళ్లూ, నిన్ను గట్టెక్కించేవాళ్ళూ నీకు దొరక్కపోరు... వాళ్ళ దగ్గరకే వెళ్ళు"

"నా వెనుక మీరందరూ ఉండి ఏం ప్రయోజనం. ఇదా కన్నతండ్రి కొడుక్కు చెప్పవలసిన సలహా... బావుంది" ఉడుక్కుంటూ అన్నాడు సత్యమూర్తి.

గాంధీగారు నెమ్మదిగా అన్నాడు. "నాకు తెలుసు. నేను నీకు సహాయపడనిరోజు మన తండ్రీకొడుకుల సంబంధం బీటలు పడుతుందని. నేను ఇక్కడికి వచ్చేముందే నీకు చెప్పాను. అలాగే నువ్వు ఆనాడు నాకిచ్చిన మాట మర్చిపోయి ఉంటావు. ఇక మేం ఈ ఇంట ఉండి ప్రయోజనం ఏంలేదు. నేనూ అమ్మా ఉయ్యూరు వెళ్ళిపోతాం. ఈ క్షణంతో మన మధ్య ఉన్న అనుబంధానికి మొదటి అవరోధం ఏర్పడింది. మనబంధాలు మరింతగా తెగకూడదు" అంటూ గాంధీగారు లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఆయన వెనకే కాంతమ్మగారూ వెళ్ళింది.

సత్యమూర్తి నలుదిక్కులా చూశాడు. లేచి తన గదిలోకి వెళ్ళాడు. అక్కడ ఝాన్సీ కనబడలేదు. చిరాగ్గా మంచంమీద వాలాడు. తిరిగి లేచి నెమ్మదిగా ఝాన్సీ పడుకున్న గదిలోకి వెళ్ళాడు. ఝాన్సీ మడతమంచం మీద పడుకుని ఉంది. ఝాన్సీవైపు చూశాడు. పమిటి చెదరి, జుట్టురేగి, జడలో పూలు నలిగి ఉన్నాయి. ఆమె తీసుకునే ఉచ్ఛ్వాసనిశ్వాసాలకు గుండె చిన్నగా లయ కలుపుతోంది. మనిషి డీలా పడ్డట్టు కన్పిస్తున్నా కొత్తగా చేసిన వళ్లు, నునుపుతేరి లావెక్కిన బుగ్గలు, కొద్దిగా పెరిగిన పొట్ట, అందమైన గుండెలు-అన్నీ సత్యమూర్తికి కొత్తగా కన్పించి ఊరించాయి. ఝాన్సీ ఏవేవో తీయని కలలు కంటూ వాటి బరువుతో నిద్రపోతున్న అప్సరసలా కన్పించింది. ఆ గదిలో ఉన్న కుర్చీ మంచానికి దగ్గరగా జరిపి, అందులో కూర్చుని నెమ్మదిగా ఆమె ముంగురులు సవరించాడు. పమిటను సరిచేశాడు. దాంతో ఝాన్సీ ఉలిక్కిపడిలేచి, భర్తను చూసింది. లేచి కూర్చుంది.

"నీ నిద్ర పాడుచేశాను. ఎందుకంటే ఆ గదిలో నాకు నిద్రపట్టలేదు"

"వెళ్లిపడుకోండి. అదే వస్తుంది నిద్ర..."

"నువ్విక్కడ ఇలా ఒక్కొత్తివీ పడుకోవడం బావుందా! ఎన్నిరోజులిలా? నీకింకా నెలలు నిండలేదు. నీకేమీకాదు..."

"నాకు వంట్లో నలతగా ఉంది. ఇద్దరం ఒకచోట పడుకుంటే నాకు ఇబ్బంది"

"నువ్వు అబద్ధం చెబుతున్నా. నాకు తెలుసు"

"నాకు..." అని మాటలు ఆపేసింది ఝాన్సీ.

"ఏమిటో చెప్పరాదా?"

"ఏంలేదు..."

"ఇందాక నేను మా నాన్నగారితో మాట్లాడాను. మీరందరూ మన లాయర్ చెప్పినట్టు చేస్తేనే నేనీ ఊబినుంచి బయటపడతాను" అంటూ తండ్రికీ తనకీ మధ్య నడిచింది మొత్తం చెప్పాడు.

"మీ నాన్నగారి తత్వం మీకు తెలుసుగా. అలాంటి మనిషిని, తప్పుడు స్టేట్‌మెంట్స్ ఇవ్వమని ఎందుకు అడిగారు?"

"ఆయన ఆదర్శవాది. నిజమే... మరీ ఇంత మొండిగా ఉంటాడనుకోలేదు"



ఝాన్సీ మాట్లాడలేదు

"ఝాన్సీ- ఎ.సి.బివాళ్లు ట్రాప్ చేసిన కేసునుంచి నేను ఎలాగో ఒకలా బయట పడగలను. నేనూ విశ్వనాథంగారూ ఆ ప్రయత్నాలు చేస్తున్నాం ఇక మిగిలింది- మన ఇంటిమీద రైడింగ్‌కి సంబంధించిన కేసు. దీన్నుంచి తప్పించుకోవాలి. అందుకు ఒకటే మార్గం వుంది. నువ్వూ, బోసుబాబు రంగంలోకి దిగాలి"

"అంటే? "

"ఇక్కడ జరిగిందంతా మీ నాన్నగారికి తెలిసేవుంటుంది" అని ఆగి, "ఆయనేం ఫోన్ చేయలేదా" అన్నాడు

"ఫోన్‌చేసి చాలా బాధపడ్డారు"

"అంతేనా? ఇంకేం అనలేదా? "

"ఇందులో ఆయనేం చెప్తారు? పైగా ఇలాచేయి, అలాచేయి అని చెప్పడానికి మీరు కొడుకుకాదు... అల్లుడాయే..."

"నేను ఆయన్ని మా నాన్నగారికంటే ఎక్కువగా గౌరవిస్తాను. ఆ విషయం నీకూ తెలుసు" అని సత్యమూర్తి క్షణం ఆగి, "మీ నాన్నగారికి పొలాలున్నాయి. స్థిర చరాస్తులు ఉన్నాయి. ఆయన ఇక్కడకువచ్చి ఈ నగలూ, డబ్బూ నీకూ నాకూ కానుకగా ఇచ్చానని చెబితే చాలు..."

ఝాన్సీ వింటోంది.

"ఝాన్సీ... ఆయన ఈ ఒక్కసారికి నాకు కొమ్ముకాస్తే చాలు ఇంకెప్పుడూ ఇటు వంటి పనులు చేయను. ఒట్టు. అమ్మా నాన్నా నిద్రపోతున్నారు. నీవోసారి మీ నాన్నగారికి ఫోన్‌చేసి అన్నీ వివరంగా చెప్పు"

ఝాన్సీ అడ్డంగా తలతిప్పి, "మా, నాన్నగారి సంగతి మీకు తెలియదు. ఇటువంటి విషయాల్లో ఆయన తలదూర్చరు. నన్ను తిడతారు..."

"నీకు మీ నాన్నగారి దగ్గర గారాబం ఉందని నాకు తెలుసులేవోయ్" గారంగా నవ్వుతూ అన్నాడు సత్యమూర్తి.

"ప్లీజ్... మీరు నన్ను వేధించవద్దు. ఆయన నామాట వినరు"

"నా గురించి, ఈ పనిచేయలేవా ఝాన్సీ"

"నావల్లకాదు. మీకు తెలుసున్నవాళ్లను పట్టుకోండి"

"అయితే నేను జైల్లో పడడం నీకు ఇష్టమా? "

"నేను ఎన్నోసార్లు మీకు చెప్పాను. కావాలని పీకల మీదకు తెచ్చుకున్నారు. ఇప్పుడు ఎవరేం చేయగలరు? "

"అంతేనా? "

"అంతే"

"పోనీ- నువ్వు స్టేట్‌మెంట్ యివ్వు- ఆ బంగారం మీ వాళ్ళు ఇచ్చారని నా తంటా లేవో నేను పడతాను"

"లేదు... నేనాపని చేయలేను. ప్లీజ్ లీవ్‌మీ ఎలోన్"

సత్యమూర్తికి ఝాన్సీ మాటలతో సహనంపోయి, పిచ్చికోపం వచ్చినవాడిలా ఊగిపోయాడు. అది ఆవేశంగా మారింది. వెంటనే, "ఛీ... నువ్వేం పెళ్ళానివి. నిన్ను ఎంతగా సుఖపెట్టాను. నీ వంటినిండా నగలు దిగేశాను. ఖరీదయిన చీరలు కొన్నాను. నిన్ను మహారాణిగా అనుకున్నాను. అప్పుడేమయ్యింది ఈ బుద్ధి. నేను చెడ్డవాణ్ణి, లంచగొండినని తెలిసి నాతో సంసారం ఎందుకు చేశావ్? అప్పుడే మీ పుట్టింటికి పోవల్సింది" అనేశాడు ఛీత్కారంతో. ఝాన్సీ- సత్యమూర్తి మాటలకు చలించలేదు. నెమ్మదిగా అంది, "మీరు కష్టపడి సంపాదించిన డబ్బుతో నన్ను సుఖపెడుతున్నానంటే కొంతకాలం అందరిలాగే నేను నమ్మాను. ఈ ఇల్లూ, ఈ వాతావరణం చూసి- నాకు అనుమానం వేసి మిమ్మల్ని ఎన్నోసార్లు హెచ్చరించాను. మీరు నా దగ్గర అబద్ధాలు చెప్తున్నారని నాకు తెలిసే నాటికి నాకు ఒకటే మార్గం కన్పించింది. మీరు చేయించిన నగలు నేను మెడనిండా దింపుకుని ఆనందించానని




అనుకోవద్దు. మీరు చేయించిన ప్రతి నగకూ నేను రోల్డ్‌గోల్డ్ నగలు చేయించుకుని అవే వేసుకునేదాన్ని. రేపు ఆ విషయం ఎంక్వయిరీలో బయటపడుతుంది. కానీ మీరు పడగ్గది గోడల్లో, గొందిల్లో బంగారం ముద్దలు దాచిపెట్టారు. అవే మీ పీకలమీదకు తెచ్చాయి. ఇంకా చెప్పాలంటే మీరు నన్ను కాదని ఆ రాణీని మరిగారని తెలిసినప్పటినుంచీ నా శరీర సుఖాన్ని కూడా నేను చంపుకున్నాను"

"ఇవన్నీ అబద్ధాలు"

"కావాలంటే భైరవిని అడగండి... ఆమెకు మీరు చేయించిన నగలు కూడా ఏనాడో ముట్టుకోవడం మానేసింది"

"అది చెల్లెలు... కానీ నువ్వు పెళ్ళానివి. ఇలా ఎదిరించి మాట్లాడతావా? "

"సారీ-మొన్న మనింటిమీద రైడింగ్‌తో మీమీద అంతరాంతరాల్లో ఉండే చిన్న గౌరవం కూడా పోయింది"

"నువ్వు నా పెళ్లానివి కాదు, రాక్షసివి. నీకు మొగుడు విలువ తెలియదు. నిన్ను చంపినా పాపంలేదు. నువ్వు" అంటూ సత్యమూర్తి ఝాన్సీ మీదకు చేయి ఎత్తాడు.

అప్పటికే కాంతమ్మగారు ఆ గది గుమ్మం దగ్గరకు వచ్చివుంది.

"ఏమిట్రా . సత్యం. ఇక్కడేం చేస్తున్నావురా. అమ్మాయికి వంట్లో బాగోలేదు ఆమెను నిద్రపోనివ్వవా నువ్వు" అంది.

సత్యమూర్తి తేలుకుట్టిన దొంగలా తలవాల్చుకున్నాడు. ఇంతలోనే గాంధీగారు అక్కడికి వచ్చి భార్యను చూసి "నీకు తెలియదు కాంతం. వీడికి మతిపోయింది. తను మనిషినని మర్చిపోయి కూడా ఝాన్సీని..." అని కాసేపు ఆగి, "వీడితో మాట్లాడీ ప్రయోజనం శూన్యం... పద... నేనంతా విన్నాను. నేను నీకన్నా ముందే లేచాను" అంటూ ఆయన తన గదివైపు నడిచాడు. కాంతమ్మ ఆయన వెనక నడిచింది.

సత్యమూర్తి విసురుగా తన గదిలోకి వెళ్ళి మంచంమీద అడ్డంగా పడుకున్నాడు. అతనిని అవమానం, ఉక్రోషం, ఇంకా ఇంకా పంతం, పగ చుట్టుముట్టాయి. అలాగే ఆలోచిస్తూ ఉండిపోయాడు. అతనికి లాస్ట్ రిసార్ట్‌గా కళ్ళముందు రాణీ కనబడింది.

"అవును... అవును... నన్ను రాణీ ఆదుకుంటుంది. రాణికి నేనంటే ప్రాణం" అంటూ తెలతెలవారుతున్న ఆ సమయంలో రాణీ నెంబర్‌కు ఫోన్ చేసి, "స్వీటీ... నేను మూర్తిని" అన్నాడు. అవతలినుంచి "నువ్వా" అనే జవాబు విన్పించింది.

"నేను నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి. నేను తొమ్మిది గంటల ప్రాంతంలో అక్కడ ఉంటాను. ఈరోజు నువ్వు ఆఫీసుకు వెళ్ళకు. ప్లీజ్ శెలవు పెట్టెయ్. చెప్తాను. అవును, నువ్వు తీసుకునే నిర్ణయాన్నిబట్టే మన జీవితాల్లోకి కొత్త వెలుగు వస్తుంది" అంటూ ఫోన్ పెట్టేశాడు. ఆ పైన తనలోతనే గర్వంగా నవ్వుకున్నాడు!!



రాణి ఊహించలేదు సత్యమూర్తి సడన్‌గా ఫోన్‌చేసి తన దగ్గరకు వస్తున్నానని చెబుతాడని! మామూలుగా అయితే 'ఈ

కథలకేంలే' అని రిటార్ట్ ఇచ్చేది. కానీ ఆమె ఉన్న పరిస్థితులు ఆమెను కొద్దిగా వెనక్కే నెట్టాయి! అవును వారంగా ప్రతి సంఘటనా హఠాత్తుగానే జరుగుతూ వస్తోంది. అనుకోకుండా చిన్నాన్న వచ్చి ఆప్యాయతగా మాట్లాడి, తనున్న పరిస్థితుల్ని తెలుసుకుని బాధపడి, భవిష్యత్‌ను ఎలా తీర్చిదిద్దుకుంటే బావుంటుందో చెప్పాడు. తర్వాత భైరవి, చైతన్య, ఇంకా బోసుబాబు తనింటికి వచ్చి పలకరించారు. అయినా ఏ ఒక్కరూ హద్దులు దాటి మాట్లాడలేదు. పైగా తను చెప్పిన మాటల్ని అర్థంచేసుకున్నారు. నమ్మారు. ఆఖరిగా సత్యమూర్తి ఏదో రిసార్ట్‌లో ఎ.సి.బి. వాళ్ళకు చిక్కాడని, అతని ఇంటిమీద కూడా రైడింగ్ జరిగిందనీ పేపర్లో చదివింది. భయం, బాధా రెండూ కలిగాయి. సత్యమూర్తి మీద కోపం, జాలీ పుట్టాయి. భైరవి ఆరోజు పేపరు చూసి వెంటనే తన వాటాలోకి వచ్చి "చూశారా?" అంది. నిజమే తను తల వంచుకుంది. ఏం మాట్లాడాలో తెలియలేదు.

"అన్నయ్య చేతులారా చేసుకున్నాడు. ఎవరూ ఏంచేయలేరు"

"మూర్తి మీద కేసులు పెడతారు. నాకూ భయంగా ఉంది. ఈ ఇల్లూ, యివీ అన్నీ నా పేరుమీద ఉన్నాయి"

"కంగారుపడవద్దు... చైతన్యని అడుగుతాను. బహుశా మీ మీదకు ఏం రాకపోవచ్చు" అని కాసేపు ఆగి, "మేం వేరే ఇల్లు చూసుకుంటున్నాం. ఎందుకంటే ఈ ఇల్లు అన్నయ్యది. ఇక్కడ మేం ఉండడం మంచిది కాదు"

"మీ ఇష్టం... నేనూ ఇక్కడినుంచి వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్‌కు షిఫ్ట్ అవుదామనుకుంటున్నాను. వాళ్లతో మాట్లాడాను"

"మరి ఈ ఇల్లు ఏంచేస్తారు?"

"మీరూ, నేనూ ఖాళీచేసిన తర్వాత ఫోన్ చేసి చెప్తాను"

నాల్గురోజులతర్వాత చెప్పినట్టుగానే చైతన్యా, భైరవి ఇల్లు ఖాళీ చేశారు. తను ఒక్కత్తీ ఉంటోంది. మరో పదిరోజులు ఆగితే ఉమెన్స్ హాస్టల్‌కు వెళ్ళిపోవచ్చు తను ఇచ్చిన అప్లికేషన్, ఇతర వివరాలూ హాస్టల్ అథారిటీస్‌వారు చెక్‌చేసుకుని పర్మిషన్ యివ్వవల్సి ఉంటుంది.

రాణి ఆలోచనలనుంచి తప్పించుకుని డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుంది. సరిగ్గా అప్పుడే బయట స్కూటర్ ఆగిన చప్పుడు, గేటు తెరుచుకోవడం, ఆపైన కాలింగ్ బెల్ మోగడం వరుసగా జరిగాయి. రాణి తలుపు తెరిచింది. గుమ్మం బయట నుంచున్న మూర్తిని చూసి, "రా, మూర్తీ" అంది. సత్యమూర్తి సోఫాలో కూర్చున్నాడు.

"టిఫిన్, కాఫీ రెడీగా ఉన్నాయి తెస్తాను" అని రాణి లేచి లోపలికి వెళ్ళి ప్లేట్లో టిఫిన్ పెట్టి తీసుకువచ్చి సత్యమూర్తి ముందు పెట్టింది. సత్యమూర్తి గబగబా టిఫిన్ తిన్నాడు. కాఫీ తాగాడు. అయినా ఇద్దరి మధ్యా ఏ మాటలూ సాగలేదు. సత్యమూర్తే ఓసారి పైకీ కిందకీ చూసి, "చాలా గొడవ జరిగింది. అన్నీ పేపర్లో చూసే ఉంటావు నువ్వు. మా మేనేజ్‌మెంటు నన్ను ఉద్యోగాన్నుంచి సస్పెండ్ చేసింది. ఎ.సి.బి నామీద కేసు ఫైల్ చేసింది"

రాణి తలవంచుకునే సత్యమూర్తి మాటలు వింటోంది.

"నీకు ఫోన్ చేసి చెప్పాలంటే అదోలా అన్పించింది. నువ్వయినా నాకు ఫోన్ చేస్తావనుకున్నాను. ఇంట్లో కూడా ఎవరూ నాకు సహకరించడంలేదు. నన్ను వెలివేసినట్టు చూస్తున్నారు"

"తెలిసింది"

"ఎవరు చెప్పారు?"

"భైరవి మీ నాన్నగారికి ఫోన్ చేస్తే ఆయన అన్నీ చెప్పారుట. భైరవీ చైతన్యగారు చాలా బాధపడ్డారు. పాపం మీ ఇంటికి రావాలనుకున్నారుట. కానీ నువ్వు ఏమంటావో, ఏం మాట్లాడతావోనని, రాలేక




పోయారుట"

"రాణీ వాళ్ళమాటలు- ముఖ్యంగా చైతన్య మాటలు నువ్వు నమ్ముతున్నావా? నన్నూ విశ్వనాథంగారినీ ట్రాప్ చేయించింది ఈయనగారే. పోనివ్వు. వెన్నుపోటు పొడి చేవాళ్ళు ఉంటే, వెన్నుతట్టి నేనున్నాననే వాళ్లూ ఉంటారు. అవునా?" అన్నాడు నెమ్మదిగా.

రాణి మాట్లాడలేదు.

"ఈ విషయంలో నేను కోర్టుకు కూడా వెళ్ళవల్సి ఉంటుంది. కానీ నా తరపున నిల బడి స్టేట్‌మెంట్స్ యివ్వడానికి మా నాన్న, ఝాన్సీ కూడా మొరాయించారు" అంటూ ఇంట్లో జరిగినదానిని రెండింతలు చేసి చెప్పాడు సత్యమూర్తి.

"అలానా?"

"రాణీ ఓ మాట చెప్తాను, నమ్ముతావా నన్ను?"

"చెప్పు, మూర్తీ"

"నిజమే నీతో అబద్ధాలు చెప్పి నిన్ను నాదాన్ని చేసుకున్నాను. నువ్వు కోరిన కోరి కను వాయిదాలు వేస్తూ వచ్చాను. నిన్ను క్షోభ పెట్టాను. తప్పే"

"సరే- అవన్నీ ఎందుకులే"

"నాకూ, ఝాన్సీకి అసలు పడటంలేదు. మేం కలిసి సంసారం చేయడంకల్ల. నేను ఆమెకు విడాకులు యివ్వడానికే నిశ్చయిం చుకున్నాను. ఆ తర్వాత నిన్ను పెళ్ళిచేసు కుంటాను. ఇది చెబుదామనే నీకు ఫోన్ చేసి ఇటు వచ్చాను"

రాణి ఆశ్చర్యంగా అతని మొహంలోకి చూస్తూ ఉండిపోయింది.

"నువ్వు ఏమంటావ్? నా ప్రపోజల్‌కు ఒప్పుకుంటావా?"

"ఇంత సడెన్‌గా నువ్వు నీ భార్యకు ఎందుకు విడాకులు యివ్వాలనుకుంటు న్నావ్?"

"నేను లంచాలు మరిగానని నిందిం చింది. నేను కేసులో యిరుక్కున్నందువల్ల ఆమెకు చిన్నతనంగా ఉందిట. అదీ ఆమె మాట్లాడేతీరు. నువ్వు చెప్తే నమ్మవు. కానీ నిజం ఏమిటంటే ఆమె నన్ను దగ్గరకు రాని వ్వడంలేదు. మా పక్కలూ, మా గదులూ వేరయ్యాయి"

"అయితే నువ్వు నా దగ్గరకు వచ్చింది ఈ కారణాన్నిబట్టి. లేకపోతే ఇటు వచ్చేవా డివి కాదు, అవునా?"

"రాణీ, నువ్వంటే నాకు ఇష్టమని నీకు తెలియదా?"

"తెలుసు... కానీ నీతో ఓమాట చెప్పా లని ఉంది"

"చెప్పు... నువ్వేం చెప్పినా వింటాను"

"నువ్వు నన్ను పూర్తిగా మర్చిపోతే బావుంటుంది మూర్తీ. ఎలాగో ఓలాగ నీ భార్యను నువ్వు దారిలోకి తెచ్చుకో. నాకు బ్రతుకంటే రోత పుట్టింది. నేనూ ఏంచె య్యాలా అనే ఆలోచిస్తున్నాను"

"అదికాదు రాణీ... ప్లీజ్ నా మాట విను. మనం పెళ్ళి చేసుకుంటే నీకు భార్య హోదా వస్తుంది. నీకు పిల్లలు పుడతారు. తల్లివి అవుతావు. మనిద్దరం సుఖంగా సంసారంలో ఇమిడిపోదాం" రాణి తల వంచుకునే ఉంది. కానీ జవాబు చెప్పలేదు.

"కానీ దీనికి ప్రతిగా నేను నిన్ను ఓ చిన్న కోరిక కోరుతున్నాను. కోపం, అనుమానం, ఆవేశం తెచ్చుకోకుండా సహృదయంతో నన్ను అర్థం చేసుకుందుకు ప్రయత్నించు. నా బలహీనతలు ఏమిటో నీకు తెలుసు. కానీ నీకు తెలియని బలహీనత కూడా వేరొ కటి నాకుంది. నేను సర్వీసులో బ్రైబ్స్ పట్ట డానికి అలవాటు పడ్డాను. నా దగ్గరకు వచ్చే పార్టీలకు ఫేవర్ చేస్తూ చాలా డబ్బు గణించాను. దాంతో విచ్చలవిడిగా ఖర్చులూ పెట్టాను, డబ్బూ దాచిపెట్టాను. కానీ మొన్న జరిగిన గొడవలతో అన్నీ బయటకు వచ్చాయి. ఇప్పుడు ఆ డబ్బు, బంగారం ఎక్కడిదో ఎలా వచ్చిందో లెక్కలు చూపిం

చవల్సివస్తోంది. దాంతో నాకు అంతా అయోమయంగా ఉంది"

"ఇవన్నీ ఎందుకు చెప్తున్నావ్ మూర్తీ"

"నీ దగ్గర ఏదీ దాచదల్చుకోలేదు రాణీ... ప్లీజ్ ట్రస్ట్‌మీ... ఇప్పుడు నువ్వు నాకోసం చొరవగా ముందుకు రావాలి. నా డబ్బులో కొంత నీదనీ... అది నీకు తల్లిదండ్రుల ద్వారా సంక్రమించిందనీ నువ్వు వెనక వేసుకున్నదనీ చెప్పాలి. అలాగే నా ఇంట్లో దొరికిన బంగారం కూడా నీ స్వార్జితంతో ఖరీదు చేసిందని చెప్పాలి. నువ్వు ఇలా చేస్తే నేను గట్టున పడతాను. ఎ.సి.బి. వాళ్ళు పెట్టిన కేసు వీక్ అవుతుంది"

"రేపు కోర్టులో 'నువ్వు ఎవరివని, ఈ డబ్బు, బంగారం మూర్తి దగ్గర ఎందుకు దాచవల్సి వచ్చిందని' అడగరా... నా దగ్గర ఏ సమాధానం వుంది. మనం బంధువులం కాదు. నన్ను ఏమని చెప్పమంటావ్. అక్కడ తీగ లాగితే డొంకంతా కదుల్తుంది. నీ మూలంగా నేను..."

"ఒకరికి సహాయం చేయడానికీ, వారిదగ్గర నుంచి సహాయసహకారాలు తీసుకుందుకు ప్రతి మనిషికీ హక్కువుంది. నీకు ఎవరూలేరు కాబట్టి జాగ్రత్తకోసం నీ ఎర్నింగ్స్‌ను నువ్వు నమ్మిన స్నేహితులదగ్గర దాచుకునే అధికారం నీకుంది. మనం పూర్వంలో ఒకే డిపార్ట్‌మెంట్‌లో పని చేశాం. అందుకని ఓ స్నేహితుడిగా రాణీ నన్ను నమ్మిందని నేను చెబుతాను. అప్పుడు నీ సాక్ష్యానికి విలువ వుంటుంది"

రాణీ అంతా విని "సారీ మూర్తీ" అనేసింది. సత్యమూర్తి సోఫాలోంచి లేచి రాణీ పక్కకు వెళ్ళి కూర్చుని, "ప్లీజ్ అలా అనొద్దు రాణీ... చెప్పు నామీద నీకు ప్రేమలేదా? నేను నిన్ను ప్రేమగా చూడలేదా... ఇప్పుడు నేను కష్టాల్లో ఉన్నానని నన్ను దూరంగా నెట్టేస్తావా? " అంటూ అడిగాడు.

"మూర్తీ... గుర్తుకు తెచ్చుకో. నువ్వు నాతో నీకు పెళ్ళి కాలేదని చెప్పి నాకు దగ్గరయినప్పుడు ఆ తర్వాత నిజం ఏమిటో నాకు తెలిసి నేను బాధపడ్డాను. అయినా సరిపెట్టుకున్నాను. కానీ నువ్విలా, ఇంతిలా దిగజారుతావని నేను ఎప్పుడూ అనుకోలేదు. అత్యాసకైనా హద్దుండాలి. కానీ నువ్వు అన్ని హద్దులూ దాటావు. ప్రస్తుతం నువ్వున్న పరిస్థితుల్లో నిన్ను పెళ్ళి చేసుకున్నందువల్ల నాకు కలిసొచ్చేదేమీ ఉండదు. చెడ్డపేరు తప్ప... సారీ, నువ్వు చెప్పినట్టు నేను చేయలేను మూర్తీ"

సత్యమూర్తి రాణీ మాటలతో నిశ్చేష్టుడయ్యాడు. కళ్ళు ఎర్రబడ్డాయి. మొహం కందగడ్డలా మారింది. కనుబొమలు ముడిపడ్డాయి. కోపంతో ఊగిపోయాడు.

"అంతేనంటావా..."

"నన్ను బలవంతపెట్టద్దు"

"కాదు కాదు..." అంటూ సత్యమూర్తి గొణుక్కుంటున్నాడు.

"మీ భైరవీ చైతన్యా ప్రైవాటా ఖాళీ చేసి వెళ్ళిపోయారు. నేను కూడా..."

"నువ్వు కూడా వాళ్ళలానే..."

"అవును మూర్తీ నేను రేపు ఈ ఇంట్లోంచి వెళ్ళిపోవాలనుకుంటున్నాను. ఈ ఇల్లు ఏం చేసుకుంటావో నీ ఇష్టం"

సత్యమూర్తి దిమ్మెరపోయాడు"ఇల్లు ఖాళీ చేయాల్సినంత అవసరం ఏం వచ్చింది. ఈ ఇల్లు నీది.... నువ్వూ..."

"ఇంకేం చెప్పద్దు మూర్తీ... నిన్ను మాటలతో గాయపర్చడం నాకిష్టంలేదు. ఆ పని నువ్వూ చేయద్దు. మాటకుమాట తెగులు అంటారు. నాకూ అలసటగా ఉంది. ఆ.... చెప్పడం మర్చిపోయాను. ఈ ఇంటి డాక్యుమెంట్స్ అల్మారాలో ఉన్నాయి"

"అంతేనా రాణీ... ఇదేనా నువ్వు చెప్పేది. నామాట విను ప్లీజ్"

"సారీ మూర్తీ"

"నిన్ను దాచమని రెండు లక్షల రూపాయిలు ఇచ్చాను. నువ్వు వాటి మాట




మాట్లాడ్డంలేదు. నీకు నా అవసరం లేకపో యినా డబ్బు అవసరం ఉందేమో. అవునా? " అన్నాడు వ్యంగ్యంగా.

"ఆ డబ్బులో ఒక్క పైసా నేను ముట్టుకో లేదు. నీకు తెలియదేమో"

"అవసరానికి పనికొస్తుంది ఉంచుకో. డబ్బుతో చాలా అవసరాలు తీరతాయి. ఈ రోజుల్లో డబ్బుతో మగవాళ్లే కాదు, ఆడవాళ్లు కూడా తమకు నచ్చినవాళ్లను దగ్గర చేసుకో వచ్చు... అవునా? "

"ప్లీజ్ హోల్డ్ యువర్ టంగ్ మూర్తీ" అంటూ రాణి లోపలికి వెళ్ళి ఐదునిము షాల్లో తన కూడా ఓ బేగ్ తెచ్చింది. అందులో వంద రూపాయల కట్టలు ఉన్నాయి. వాటన్నిటి కింద పోసింది కుప్పలా.

"అదేమిటీ... అలా ఊగిపోతున్నావు దేనికి? ఏమయ్యింది? నీకు మతిపో యిందా ఆర్ యూ మేడ్" అంటూ కంగా రుపడుతూ సత్యమూర్తి రాణీ దగ్గరకు వెళ్ళ బోయాడు.

"ఆగు" అని రాణీ గట్టిగా అరిచి- లోపలి నుంచి తన కూడా తెచ్చిన అగ్గిపెట్టెలోంచి పుల్లతీసి వెలిగించి ఓ వందరూపాయల కట్టమీద వేసింది. ఆ నోట్లకట్ట భగ్గున మండసాగింది. ఆ మంటలు ఒక కట్ట నుంచి మరో కట్టకి వ్యాపించాయి.

"చూశావా... నీ డబ్బు ఎలా అగ్నికి ఆహుతి అయ్యిందో. నిజానికి నా స్థానంలో వెనకటి తరం అమ్మాయి ఉంటే కిరసనాయి ల్‌తో తన వళ్లు కాల్చుకునేది. కానీ నేనలా చేయలేదు. నీ డబ్బును, డబ్బుతో ముడిపడ్డ నీ మనసును పరోక్షంగా అగ్నికి ఆహుతి చేశాను" అంటూ రాణీ పగలబడి నవ్వే సింది.

"యూ బిచ్" అంటూ సత్యమూర్తి రాణీ మీద చెయ్యి ఎత్తాడు. రాణికి ఉవ్వెత్తున కోపం వచ్చింది. ఆవేశం వచ్చింది. వెంటనే అతనిమీదకు వెళ్ళి తనూ చెయ్యెత్తి, "బయ టకు పో, పోరా... లేకపోతే నేను నిన్నేం చేస్తానో నాకే తెలియదు" అని అరిచింది. సత్యమూర్తి ఆమెమీదకు వెళ్ళడానికి అడుగు ముందుకు వేశాడు. కానీ గుమ్మం దగ్గర నిలబడి "బావగారూ" అని పిలిచిన బోసు బాబును చూసి, ఓ అడుగు వెనక్కి వేశాడు. "మీరు రాణీమీద చేయివేసి ఇప్పటికే దిగ జారిన మీ పరువును బజారుకు యీడ్చుకో వడం మంచిది కాదు" అన్నాడు బోసుబాబు నెమ్మదిగా.

"నీ దగ్గర నీతులు నేర్చుకోవల్సిన అవ సరం నాకు లేదే" అని సత్యమూర్తి వ్యంగ్యంగా నవ్వి, తిరిగి "ఈమె నీకు దొరి కిందా. లేక నువ్వు ఆమెకు దొరికావా... కొత్త స్నేహం సరికొత్త అనుభవం. బ్రహ్మ చారివి కదా. ఆల్ రైట్, ప్రొసీడ్" అనేశాడు.

"క్షమించండి... 'నువ్వు బయటకు పోతావా లేదా గెంటించమంటావా' అనే మాట ఆమె నోటినుంచి రాకుండా మీరు వెళ్ళడం మంచిది బావగారూ" అన్నాడు బోసుబాబు తలవంచుకుని.

"అలానా, అలానా" అంటూ సత్యమూర్తి గేటుదాటి బయటకు వెళ్ళిపోయాడు.

"సారీ రాణిగారూ"

"నేనే మీకు సారీ చెప్పాలి"

"ఇలాంటివి జరిగిన వెంటనే మర్చిపో వాలి. లేకపోతే మనసు చివుక్కుమం టుంది"

"నిజమే"

"మీ తర్వాత కార్యక్రమం ఏమిటీ? "

"నేను ఈ ఇల్లు రేపే ఖాళీ చేస్తున్నాను"

"మంచిమాట చెప్పారు"

"మా చిన్నాన్నతో, భైరవితో ఈ విషయం చెప్పండి. కొంతకాలం ఆగి విజయవాడ వస్తానని కూడా చెప్పండి. ప్రస్తుతానికి ఆయన మాట మన్నించలేకపోతున్నాను నేను"

"ఏం మీ మనసులో మరేదయినా ఆలో చన ఉందా? "

"అవును. ఇంతవరకూ నా జీవితం ఒక రకంగా వెళ్ళింది. దీనికో కొత్తమలుపు ఇవ్వాలంటే నేను కూడా కొత్తరూపు ఎత్తితే బావుంటుందనిపిస్తోంది."

"అంటే"

"మన ఆంధ్రదేశంలో, చుట్టుపక్కల రాష్ట్రాల్లో చక్కని ఆశ్రమాలు ఉన్నాయి. అక్కడ జీవించేవాళ్లలో ప్రశాంతత కన్పిస్తోంది. ఎంతో అదృష్టం చేసుకుంటేగాని ఆశ్రమ జీవితం లభించదంటారు. చూస్తాను. వీలైతే ఈ శేషజీవితాన్ని అలాంటి ప్రదేశాల్లో గడిపేస్తాను"

బోసుబాబు వింటున్నాడు.

సత్యమూర్తికి రాణీ ఇంటినుండి బయటకు వచ్చిన తర్వాత ఎక్కడికి వెళ్ళాలో, ఏంచేయాలో తోచలేదు. కాసేపు ఆలోచించి సెల్ ఫోన్ తీసుకుని,

"జయంత్, నువ్వు ఖాళీగా ఉన్నావా?



నీతో మాట్లాడాలి. రమ్మంటావా? " అని అడిగాడు.

అవతలినుంచి "యూ ఆర్ వెల్‌కమ్, ఈరోజు కోర్టుకు సెలవు" అంటూ మరేవో ప్రశ్నలు వేశాడు జయంత్.

"నేను వచ్చి అన్నీ మాట్లాడతాను" అనేసి సత్యమూర్తి పదినిముషాల్లో రామకోటిలోని జయంత్ ఇంటికి జేరాడు.

జయంత్ "రా, సత్యమూర్తీ" అంటూ కుర్చీ చూపించాడు. ఓసారి స్నేహితుడి మొహంలోకి చూసి "అదేమిటి డల్‌గా ఉన్నావ్? " అన్నాడు.

"ఏం చెప్పమంటావ్ జయంత్" అంటూనే సత్యమూర్తి ఇంట్లో జరిగింది చెప్పాడు.

"కనీసం నీ వైఫ్, నీ అత్తారు తరఫువాళ్లు ముందుకు వచ్చినా చాలు. నీ వైఫ్ ఏమంటుంది? ఆమెతో అన్నీ వివరంగా చెప్పావా? "

"అన్నీచెప్పాను. ఆమె కూడా మా నాన్న లాగే మాట్లాడుతోంది"

"అదేమిటోయ్. కట్టుకున్న పెళ్లాం అలా ఎందుకు మాట్లాడుతోంది? " అని కాసేపు ఆగి, "ఏం మీ ఇద్దరికీ టరమ్సు బాగా లేవా? " అని అడిగాడు.

"అవును"

"అరే... మరెలా? "

"అదే ఆలోచిస్తున్నాను"

"ఆమెగారు ఎందుకో నీమీద అలిగి ఉంటుంది. ఆడవాళ్లు దువ్వితే వాళ్లే దారికి వస్తారు. ముద్దు చెయ్యి. నేను నీకు చెప్పాలా? "

"పొరబాటు నాదే జయంత్. నాకు మరో కామెతో ఎఫైర్ ఉంది. అది ఆమెకు తెలిసింది. దాంతో బాగా బిగుసుకుపోయింది"

"ఇదా కారణం? ఈ రోజుల్లో బయట తిరగని వాళ్లెవరు? దీనికింత రభసా? "

"ఏంచెప్పమంటావ్ జయంత్. అంతా నా కర్మ"

"కర్మా లేదు, గిర్మాలేదు. ముద్దు చేస్తే లొంగకపోతే బెదిరించాలి. కొందరు ఆడవాళ్లు కళ్లెర్రజేస్తే, మరికొందరు చేయి ఎత్తితే గప్‌చుప్ అయిపోతారు"

"అలా అంటావా? "

"మరో ఐడియా. మాట వినకపోతే విషం తాగి చస్తానని బెదిరించు" సత్యమూర్తి జయంత్‌ను చూసి, "ఈ సలహా బావుంది. నిజమే"

"అసలు విషయం చెప్పడం మర్చిపోయాను. మనం ఈ వారంలో కోర్టులో ఎఫిడవిట్ సబ్‌మిట్ చెయ్యాలి. నువ్వు త్వరపడ్డం మంచిది"

"ఈవేళ తాడోపేడో తేలుస్తాను, వస్తాను" అంటూ సత్యమూర్తి జయంత్ ఇంటినుండి బయటపడ్డాడు. అతనికి తలంతా వేడెక్కినట్టుగా ఉంది. ఏమీ తోచక రెండుమూడు రోడ్లు పట్టుకు తిరిగాడు. ఇంటికి వెళ్ళాలనిపించలేదు. అందుకే దగ్గరలో ఉన్న హోటల్‌కు వెళ్ళి రూమ్ తీసుకున్నాడు. హోటల్‌బాయ్ ద్వారా ఓ క్వార్టర్ బాటిల్ 'ఓల్డ్‌మాంక్' తెప్పించుకున్నాడు. టిఫిన్ తింటూ విస్కీ తాగసాగాడు. ఆ తర్వాత మంచంమీద అటూ ఇటూ పొర్లాడు. ఆలోచనలో పడ్డాడు. ఏదో బాధ, భయం వచ్చి తన తోపాటు మంచంమీద అయినవాళ్లలా కూర్చున్నట్టు అన్పించింది. తనెక్కడున్నాడు? తను ఎక్కడికి పోతున్నాడు? తన భవిష్యత్ ఏమిటి? అప్పుడే కళ్లకు ఎదురుగా తల్లి, తండ్రి, ఝాన్సీ కన్పించారు. వాళ్లు చీదరించి మాట్లాడుతున్నారు, వెక్కిరిస్తున్నారు, ఎగతాళి చేస్తున్నారు. సత్యమూర్తి కోపం పట్టలేక 'పొండి పొండి' అని అరిచాడు. అప్పుడే సెల్‌ఫోన్ మోగింది. "నేను విశ్వనాథాన్ని. చెప్పింది ఏంచేశావ్? త్వరగా డబ్బు ఎరేంజ్ చెయ్యి. లేకపోతే నేనేం చేయలేను" అంటూ ఏవేవో మాటలు విన్పించాడు. సత్య




# ఏరిన ముత్యాలు

★ మానవ జీవితం భగవంతుడు స్వహస్తంతో రాసిన ఒక అద్భుత గాథ

– హాన్స్ క్రిస్టన్ అండర్సన్

★ కోపం ఎప్పుడూ మనిషిని మందమతిగానూ నిర్భాగ్యుడుగానూ తయారు చేస్తుంది.

– ఫ్రాన్సిస్ బేకన్

★ స్వల్ప ధనంతో మీకు సుఖపడడం తెలియకపోతే అపారమైన ధనం కూడా మిమ్మల్ని సుఖపెట్టలేదు.

– అజ్ఞాత

★ దుర్బుద్ధి తాను నింపిన విషపాత్రలో సగం తానే తాగుతుంది.

– సెనెకా

★ తిరస్కారాన్ని ప్రదర్శించే చక్కని పద్ధతి మౌనం.

– జార్జి బెర్నార్డ్ షా

★ ఉత్సాహం అగ్ని పర్వతం లాంటిది. ఏ సందేహం దానిపై మొలవదు.

– ఖలీల్ జిబ్రాన్

★ డబ్బు అనేది మంచి సేవకుడు లాంటిది అన్నమాట నిజమే కావచ్చు కానీ దానంత చెడ్డ యజమాని కూడా లేడన్నది నిజం.

– ఫ్రాన్సిస్ బేకన్

★ అన్ని కళల్లోకీ గొప్పదైన కళ అందమైన నడవడి.

– ఎమర్సన్

★ అహం ప్రవేశించే మార్గంనుంచే మనిషి తాలూకూ కీర్తి బయటకు వెళ్ళిపోతుంది.

– స్పానిష్ సామెత

★ తనని తాను తగ్గించుకున్నవాడే హెచ్చింపబడతాడు.

– బైబిల్

★ అదృష్టానిది స్త్రీ స్వభావం. వలచినకొద్దీ అది వెనకకు పోతుంది.

– 5వ ఛార్లెస్

★ స్వాంతన చేకూర్చే మాటలను నేర్పుగా పలకటమే మనిషికి తెలిసిన పురాతన వైద్యం.

– లూయీస్ నైజర్

★ అయిష్టంగా ఎవరికీ ఏమీ ఇవ్వనవసరం లేదు. కానీ లేదని అబద్ధం చెప్పకూడదు. ఇవ్వలేనని చెప్పాలి.

– షిర్డీ సాయిబాబా

★ మానవుని పంచేంద్రియ జ్ఞానానుభోగానికి సహకరించే ఆరో ఇంద్రియం సౌభాగ్యం

– విచర్డ్‌నే

సేకరణ : తరిగొప్పుల వి.ఎల్.ఎన్ మూర్తి

విన్పించాడు. సత్యమూర్తికి ఏడుపు వచ్చింది. జుట్టు పీక్కున్నాడు!



"రెండురోజులు గడిచాయి. సత్యమూర్తి తను అనుకున్నట్టుగా ఝాన్సీతో మాట్లాడలేకపోయాడు. వంట్లో నలతగా ఉండడంతో ఆమె తల్లితో కలిసి చెకింగ్ కోసం నర్సింగ్‌హోమ్‌కి వెళ్లింది. ఇంటికి వచ్చి తల్లి గదిలో పడుకుంటోంది. ఇంట్లోకి కొత్తగా వంటమనిషి వచ్చింది. ఆమె వండి పెడుతుంది. ఇక తండ్రి పగలు ఎక్కడికో వెళ్ళి మధ్యాహ్నం వస్తాడు. సత్యమూర్తి పలకరించినా ఆయన మాట్లాడలేదు.

తల్లిమాత్రం పొడిపొడి మాటలే మాట్లాడుతోంది. సత్యమూర్తికి ఉండుండి ఉడుకుమోత్తనం, కోపం వస్తున్నాయి. పైగా తండ్రిని పలకరిస్తే ఆయన తన జవాబును చిన్న కాగితాల మీద రాసి చేతికి ఇవ్వడం మొదలుపెట్టాడు.

సత్యమూర్తి విసిగి "నాతో మాట్లాడరా నాన్నగారూ" అన్నాడు.

గాంధీగారు చిన్న కాగితంమీద "అవసరం అన్పించడంలేదు" అని రాసి సత్యమూర్తికి ఇచ్చాడు.

"అమ్మా ఇదేమిటీ?" అన్నాడు బాధగా.

"ఆయన సంగతి నేను నీకు చెప్పాలా. మేం రేపు ఉయ్యూరు బయలుదేరుతున్నాం" అంది కాంతమ్మ.

"నాన్నగారూ ఈ వయసులో మీరు ఆ ఊళ్లో వుంటే బావుండదు. ఏదైనా అవసరం వస్తే?" అన్నాడు తనుగా తండ్రి ముందుకు వెళ్ళి సత్యమూర్తి.

"మాకు పైవాడు దిక్కుగా ఉంటాడు" అంటూ గాంధీగారు తను రాసిన మరో చీటీ అందించాడు.

"సత్యమూర్తికి కోపం తన్నుకు వచ్చింది. "ఎలాగూ వెడతామంటున్నారు. అమ్మను ఈరోజైనా తన చేత్తో నాకు అన్నం పెట్టమని చెప్పండి. మీరు అనుమతిస్తేనేగాని అమ్మ నాకు అన్నం పెట్టనంది" అనేశాడు.

"నీ భార్య ఝాన్సీని అడుగు. ఆమె పెట్టవచ్చు నిన్ను పెంచి పెద్దచేసిన మా చేతులకు చలవ ఉన్నట్టులేదు. అవి ఇప్పటికే నీకు అపకారం చేశాయి. నీకు సరియైన మార్గం చూపించలేకపోయాయి" అనే మరో చీటి అందించాడు గాంధీ.

సరిగ్గా అప్పుడు ఝాన్సీ అటువచ్చి "వంట అయ్యింది. వంటామె రెడీగా ఉంది. వెళ్ళి అన్నం తినండి" అంది ముభావంగా. సత్యమూర్తి కొరకొరా ఝాన్సీవైపు చూసి, "ఓహో, అలానా? ఏం నీకూ ఏమైనా అయ్యిందా? గోడతో గొందితో మాట్లాడినట్టుగా కొత్త పోకడలు పోతున్నావ్" అంటూ అరిచాడు.

"మన ఇంటి వాతావరణంలోని మహిమ"

"చాల్లే"

"అన్నీ డైనింగ్‌టేబిల్ మీద సర్ది ఉన్నాయి, తింటే మంచిది" అని అనేసి ఝాన్సీ తన గదిలోకి వెళ్ళిపోయింది. సత్యమూర్తి ఆలోచనల నుంచి తేరుకుని తిరిగి హాలంతా పరీక్షగా చూసి తండ్రి గది దగ్గరకు వెళ్ళి తలుపుతోసి లోపలికి చూశాడు. తల్లీ, తండ్రీ పెట్టెలు సర్దుకుంటూ కన్పించారు.

కాసేపు గుమ్మం దగ్గరే నిలబడి లోపలికి వెళ్ళి అక్కడే ఉన్న కుర్చీలో కూర్చుని, "అయితే మీరు ఇక్కడినుంచి వెళ్ళిపోవడా నికే నిశ్చయించుకున్నారా నాన్నగారూ? " అని అడిగాడు.

గాంధీగారు కళ్లజోడు సర్దుకుని తన పక్కనే పెట్టుకున్న ఓ స్లిప్‌మీద "అవును" అని రాసి కొడుకు చేతికి ఇచ్చాడు.

"మేం రేపు ఉదయం ట్రయిన్‌కు వెడు తున్నాం, సెలవు" అంది కాంతమ్మగారు.

"మీకు పిచ్చెక్కింది"

గాంధీగారు చిన్నగా తనలో నవ్వుకుని, "నువ్వు ఈ గదినుంచి బయటకు వెడితే మాకు మేలు చేసినవాడివి అవుతావు... సెలవు" అని మరో కాగితం రాసి కొడుకు చేతికి ఇచ్చాడు.

"మీ ఆదర్శాలతో, పట్టుదలతో అన్న య్యను ఇంట్లోంచి వెళ్ళిపోయేటట్టు చేశారు. ఇది మీకు మంచిదికాదు. నేనీ జన్మలో మీ మొహం చూడను. ఆ తరువాత బాధపడ తారు. మీ కర్మ" అంటూ సత్యమూర్తి కుర్చీ లోంచి లేచాడు. హాల్లోకి వెళ్ళి డైనింగ్ టేబి ల్ ముందు కూర్చుని, "ఝాన్సీ" అని పిలి చాడు. జవాబు రాలేదు. తిరిగి, "నిన్నే, లేచిరా అన్నం పెట్టు" అని అరిచాడు. అయినా ఝాన్సీ గదినుంచి ఆమె కాదుకదా, పిసరంత గాలి కూడా రాలేదు. అటూఇటూ చూశాడు. హాల్లోని ప్రతి వస్తూవూ వెక్కిరి స్తోన్నట్టుగా ఉంది. తలవంచుకుని తన గదిలోకి అడుగులు వేశాడు. లోపలికి వెళ్లి మంచంమీద కూర్చుని ఝాన్సీ కోసం చూశాడు. పడగ్గది బావురుమంటూ అతన్ని వెక్కిరించింది. ఐదు నిమిషాల తర్వాత స్టీల్ చెంబుతో మంచినీళ్లు తెచ్చి వాటిని టేబుల్ మీద పెట్టింది ఝాన్సీ. తిరిగివచ్చిన దారినే బయటకు వెళ్లబోయింది.

"అలా వెళ్ళిపోతున్నావ్ దేనికి ఝాన్సీ? నీతో మాట్లాడాలి. ఐదు నిమిషాలు కూర్చో నేను నిన్నేం చేయనులే" అన్నాడు.

ఝాన్సీ మాట్లాడకుండా డబుల్ కాట్ మీద ఓ కొనగా కూర్చుంది.

"ఝాన్సీ చూశావు కదా నాన్న సంగతి... నాతో మాట్లాడ్డం మానేశారు. ఇది అన్యాయం కాదా. వీళ్లు ఇలా మారిపోతా రని నేనెప్పుడూ అనుకోలేదు"

ఝాన్సీ మాట్లాడలేదు.

"రేపు వాళ్లు ఉయ్యూరు వెళ్లిపోతారుట"

"అవును. నాతోనూ చెప్పారు"

"ఝాన్సీ... నువ్వే కలగజేసుకుని వాళ్లకు నచ్చజెప్పి ఆపాలి... నువ్వు అడిగితే వాళ్ళు కాదనరు"

"ఆయనకు తన ఆదర్శాలికన్నా, మిన్న అయినది ఉందని నేను అనుకోను. మీమాటే ఆయన చెవిని పెట్టనప్పుడు, నా మాట వింటారా? "

"అయితే చెప్పు... నేనేం చెయ్యాలం టావ్? నేను గడ్డి తిన్నమాట నిజమే. అందుకని కన్నకొడుకునూ, కడుపుతో ఉన్న కోడల్నీ వదులుకుంటారా? ఈ వయసులో వాళ్ళకు మన సహాయం అవసరం అవదా? "

"ఆయన తను ఇలాంటి గాలి వానలు ఎన్నో చూశానని చెప్పారు. సుఖాలకు పొంగిపోకుండా, కష్టాలకు కృంగిపోకుండా ఉండగల్గేవాళ్ళను వాళ్ళ మనోబలాన్నీ ఇంకా ఇంకా భగవంతుడే కాపాడతాడనీ అన్నారు"

"పోనీలే, పోనీలే" అని సత్యమూర్తి తనలోతను గొణుక్కుని,

"వాళ్లను వెళ్లనీ మనకు మనమే తోడు. మనకు ఎవరూ లేరని అనుకుందాం" అని కాసేపు ఆగి, "రేపు మనం లాయర్ జయంత్ ఇంటికి వెళ్ళిరావాలి ఝాన్సీ" అన్నాడు చిన్నగా.

"దేనికి? "

"ఇప్పుడు- నువ్వు అడ్డుపడి, చక్రం తిప్పక పోతే నేనూ నా పరిస్థితీ నువ్వు ఊహించ లేవు... ప్లీజ్... మొన్న రాత్రి నేను నిన్ను

తిట్టాను. చెయ్యెత్తాను. క్షమించి అన్నీ మర్చిపో... మీ నాన్నగారికి ఫోన్ చెయ్యి... లేకపోతే నాకు విషం మింగి చావడం తప్ప మరోదారి లేదు"

ఝాన్సీ మాట్లాడలేదు.

"ఏమిటి అలా చూస్తున్నావేమిటి, ఝాన్సీ"

"చూడడంలేదు. మీ మాటలు వింటున్నాను"

"అంటే? "

"మీరు ఇంతిలా, ఎలా దిగజారగల్గారా అని ఆలోచిస్తున్నాను"

"అలా ఎందుకు అనుకుంటున్నావ్... కోపంతో కాదు, ప్రేమ నింపుకుని ఆలోచించి చూడు. అప్పుడు నా మనసులో క్షోభ నీకు అర్థం అవుతుంది"

"వద్దండీ... ఎక్కువ మాట్లాడొద్దు... మీతో మాట్లాడాలన్నా, మీవైపు చూడాలన్నా నాకు చచ్చే సిగ్గుగా ఉంది. పొట్ట తీసుకువెళ్లి ఎక్కడ పెట్టుకోవాలో తెలియడంలేదు"

సత్యమూర్తికి ఝాన్సీ మాటలు కొరడాలతో కొట్టినట్టుగా తగిలాయి.

"మీ నాన్నగారిలా, మీరూ- మా నాన్నగారిలా నేను అలా మనిద్దరం వాళ్లలాగే ఆదర్శానికి కట్టుబడి బతుకుతాం అనీ, బతకాలనీ నేను ఎన్నో కలలు కన్నాను. కానీ మీరు అవినీతి పనులు చేసి ప్రజల సొమ్ము తిని పట్టుబడినప్పుడు, మీకు ఏమనిపించిందో నాకు తెలియదుగానీ, నేను ఆరోజే చచ్చిపోయాననుకుంటున్నాను"

చెప్తోంటే అర్థంచేసుకోవేమిటి... ఒకటే ఉపన్యాసాలు"

"నేను వెళుతున్నాను. నాకు నిద్రవస్తోంది"

"అయితే నువ్వు చెప్పేది నన్ను చావమనేగా... అంతేనా? "

"చావనక్కరలేదండీ... మీరు మీ నాన్నగారు చెప్పినట్టు లేకపోతే మీ మనస్సాక్షి చెప్పినట్టు, చేయండి. నేను మీకు చెప్పింది కూడా నా హృదయం నాకు విన్పించిందే"

"అంటే నీ ఉద్దేశం నేను..."

"మీమీద కేసు బలంగా ఉంది. మీరెన్ని దొంగసాక్ష్యాలు సేకరించినా మీమీద కేసు వీగిపోదు. మీకున్నది ఒకటే దారి. నిజాన్ని అదే, చేసిన నేరాన్ని గౌరవంగా ఒప్పుకుని..."

"చాల్లే...నీకు బుద్ధుందా... నన్ను వెళ్ళి కటకటాల వెనక కూర్చోమంటావా? ఇది నువ్వు భార్యగా యివ్వవల్సిన సలహాయేనా? "

"లేదండీ... మీరు తప్పుదోవలోపడి నిజాన్ని గుర్తించడంలేదు. నేను ఓ స్నేహితురాలిగా, భార్యగా మంచి సలహాయే చెప్పాను. మీరు అలా ఆవేశంతో ఊగిపోతే నేనేం చేయలేను. నేను మళ్లీ చెప్తున్నాను. నేను ఏ లాయర్ దగ్గరకూ రాను. నన్ను బలవంతం పెట్టొద్దు. మీకు జ్ఞానంలేకపోయినా, నాకు ఉంది"

సత్యమూర్తి కళ్ళు రక్తసిక్తమయ్యాయి. మనిషి ఆవేశంతో క్షణం ఊగిపోయాడు. అప్పుడు అతని కళ్లకు ఝాన్సీ భార్యగా తనతో ఐదేళ్ళు కాపురం చేసిన మనిషిలా కాకుండా ప్రత్యర్థిలా, బద్ధవిరోధిలా, కాళిలా కనబడింది!! తన తప్పుల్నీ, నేరాల్నీ వేలెత్తి చూపి, దండన విధించే న్యాయాధిపతిలాగా కన్పించింది! తన పక్కనే కూర్చుని హెచ్చరిస్తున్న న్యాయదేవతలానూ అన్పించింది!

అయినా సత్యమూర్తిలో ఆలోచన, వివేకం, విజ్ఞతా లోపించి తను మనిషినని మర్చిపోయాడు. ఫక్తు మగవాడిలా, ఓ భర్తలా, ఓ పశుప్రాయుడిలా మారాడు. మొహం కందగడ్డలా చేసుకున్నాడు. దాంతో అతని మనసు పొరల్లో, ఇంకా ఇంకా లోతైనచోట అధోలోకపు అంచులనుంచి పశుత్వం తలెత్తింది. శరీరం నిప్పులకుంపటిగా మారింది. అందుకే ఏం చేస్తున్నాడో, ఏం చేయబోతున్నాడో తెలియకుండా సత్యమూర్తి విసురుగా ఝాన్సీ మీదకు వెళ్ళాడు. ఆమెను రెండుచేతులతో బలంగా పట్టుకుని ఎటూ కదలనివ్వకుండా చేసి ఆమె బుగ్గలూ, పెదాలు కొరికాడు. తుఫాను హోరుగా మారి ఆమెను చుట్టుముట్టాడు. మంచం మధ్యకు ఆమెను బలవం




తంగా తెచ్చాడు.

ఝాన్సీ ఆ హఠాత్ పరిణామానికి మొదట భయపడింది. ఆకులా వణికింది. తనమీదా, తన అవయవాలమీదా, తనతో, తన శరీరంతో ఏమాత్రం పరిచయంలేని వ్యక్తి అమానుషంగా దాడిచేస్తోన్నట్టు, రాక్షస రతికి ఉపక్రమిస్తోన్నట్టూ అన్పించి ఆమె తనకు తెలియకుండానే శక్తినంతా కూడగట్టుకుని చేతులు విదుల్చుకుంటూ, శరీరాన్ని అతనికి అందకుండా చేస్తూ కాళ్ళతో ప్రతిఘటించడం చేయసాగింది.

"ప్లీజ్... ఎవే ఫ్రంమ్ మీ... డోంట్ టచ్ మీ" అంటూ ఒకటి రెండుసార్లు అరిచింది. నోరు మూస్తున్న భర్త చేతుల్ని కరవసాగింది.

"నోర్ముయ్... అరిచావంటే చంపేస్తాను"

సరిగ్గా అప్పుడే తలుపులు తోసుకుని ఆ గదిలోకి గాంధీగారూ, కాంతమ్మా వచ్చారు. తల్లిదండ్రుల్ని చూసి సత్యమూర్తి ఏదో మాట్లాడాలని ప్రయత్నించాడు. కానీ అతని గొంతు పెగల్లేదు. అప్పటికే ఝాన్సీ మంచం దిగి పమిట సరిజేసుకుని వడిలిన లేత ఆకులా అత్తగారిలోకి యిమిడిపోయి భోరున ఏడ్చేసింది!! కాంతమ్మ ఝాన్సీని తనలోకి తీసుకుని ఆమె తల నిమిరి నెమ్మదిగా బయటకు తీసుకువెళ్ళింది.

సత్యమూర్తి మంచానికి దూరంగా నిలబడ్డ తండ్రిని చూశాడు. అతనికి తండ్రిని చూస్తే భయం వేసింది. సత్యమూర్తికి మొదటిసారి తండ్రి కళ్లల్లో కనుపాపలకు బదులు రెండు అగ్నిగోళాలు కన్పించాయి. గాంధీగారు ఏమీ మాట్లాడకుండా బయటకు వెళ్ళిపోయాడు. సత్యమూర్తి ఏకాకిలా మంచంమీదే కూర్చుని ఉండిపోయాడు. చెప్పలేని దాహం పుట్టింది. జరిగింది అంతా కళ్ళముందు తిరుగుతుంటే నిస్తత్తువగా నిస్సహాయంగా నేలచూపులు చూశాడు. అలా పదినిముషాలు గడిచాయి. కిటికీలోంచి లేత వెలుగులు కన్పిస్తున్నాయి. అయినా మంచంమీద నుంచి లేవలేకపోయాడు

అప్పుడే ఇంటిముందు టాక్సీ ఆగిన చప్పుడు విన్పించింది. డ్రాయింగ్ రూమ్ నుంచి తల్లితండ్రుల మాటలు చిన్నగా విన్పిస్తున్నాయి. మరో అయిదు నిముషాలు గడిచాయి. సత్యమూర్తికి తన గదిలోకి వస్తున్న అడుగుల చప్పుడు విన్పించింది. ఆ తర్వాత తండ్రి గొంతు విన్పించింది!

"అసలు ఈ ఇంట్లో నీముందు నోరు విప్పి మాట్లాడకూడదనే వారంగా మౌనం పాటిస్తూ వచ్చాను. మౌనవ్రతంతోనే ఇక్కడినుంచి వెళ్ళిపోవాలనీ అనుకున్నాను. కానీ ఝాన్సీమీద నువ్వు చేసిన బలప్రయోగం చూసిన తర్వాత నేను నోరు విప్పవల్సివచ్చింది. ప్రతిమనిషికీ డబ్బు అవసరం ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. కానీ మనిషికి ధనదాహం ఉండకూడదు. ఆ దాహం ముదిరితే అది మనిషిని పశువుగా మారుస్తుంది. ఆ తర్వాత నీతి నియమాలకు అర్థం తెలియకుండాపోతుంది. నువ్వు నీతి తప్పావు. అది మొదటి తప్పు. రెండోది నువ్వు స్త్రీనీ, స్త్రీశక్తినీ అవమానించావు. ఈ రెండు తప్పులూ నిన్ను దహించకమానవు. అందుకే ఝాన్సీ కోరిక మీద ఆమెను నాతోపాటు ఉయ్యూరు తీసుకు వెడుతున్నాను. ఇప్పుడు ఇక ముందు, మరే రోజయినా నీకు నీ భార్య కావాలనుకుంటే నువ్వు భర్తగా, స్నేహితుడిగా, మంచి మనిషిగా జీవించాలనుకుంటే ఝాన్సీ నీకు చెప్పిన సలహా పాటించు. లేదంటావా మమ్మల్నే కాదు ఆమెనూ నువ్వు మర్చిపో వచ్చు ఉంటాను. మేం వెడుతున్నాం"

సత్యమూర్తి బయటకు చూశాడు. తెల్లవారిన గుర్తుగా బయట చిన్నపాటి వెలుగు కన్పించింది. తిరిగి తనలోకి చూసుకున్నాడు. కానీ తనలో చీకటి దట్టంగా నిండుకుని ఉందని అతనికి తెలియలేదు. అయితే వీధిలో టాక్సీ చప్పుడు దూరం అవడం మాత్రం అతనికి ఖచ్చితంగా తెలిసింది!!



# చతుర కతలు

## నవనవ అనుభవం

ఆ రోజు ఆదివారం. రాజేశ్వరి పూజ ముగించి వంట ఇంట్లోకి వెళ్ళడానికి సిద్ధంగా వుంది. శ్రీవారు 'ఈనాడు ఆదివారం'లో 'పదవినోదం' పూర్తిచేస్తూ కూర్చున్నారు. అబ్బాయి సుమన్ లీగ్ క్రికెట్ పోటీలలో తన క్లబ్ తరపున మొదటిసారి ఆడడానికి వెళ్ళాడు.




ఇంతలో కాలింగ్‌బెల్ మోగింది. ఎవరయివుంటారా అని రాజేశ్వరి తలుపు తీసేసరికి ఎదురుగా కేబుల్ ఆపరేటర్.

"ఈ నెల రెండు వందలు కట్టేశామే" అంది రాజేశ్వరి.

"అదికాదు మేడమ్. మరో తెలుగు ఛానల్ ఒకటో తారీఖునుంచీ ప్రారంభమవుతోంది. ఇది పూర్తి కుటుంబ ఛానల్. ఆ ఛానల్ ప్రసారం చేసే కార్యక్రమాల కరపత్రం ఇదిగో" అంటూ కేబుల్ ఆపరేటర్ ఒక కాగితం రాజేశ్వరి చేతిలో పెట్టాడు.

రాజేశ్వరి అది చదువుకుని "కనెక్షన్ ఇవ్వండి" అంది.

"మీరు అడుగుతారని నాకు తెలుసు. అయితే మీరు ఎక్స్‌ట్రాగా ఇంకో ఇరవై ప్రతి నెలా చెల్లించాలి. ఇవాళనుంచే ట్రయిల్ ప్రసారం ప్రారంభమవుతుంది. ఒకటో తారీఖు, అదే, ఫైవారంనుంచీ రెగ్యులర్ ప్రసారాలు" అన్నాడు కేబుల్ ఆపరేటర్.

టి.వి., దానికి సంబంధించిన అనుబంధ విషయాలలో రాజేశ్వరికి భర్తని సంప్రదించవలసిన అవసరంలేదు. అందులో ఫుల్ ఫ్రీడమ్ రాజేశ్వరికి వుంది.

"సరే" అంది రాజేశ్వరి.

ఆపరేటర్ నూరుచానళ్ల సోనీలో 55లో 'నవనవ టీవీ'కి కనెక్షన్ ఇచ్చి సెట్ చేసి





వెళ్ళిపోయాడు. అది రాజేశ్వరి లక్కీనంబర్!

'నవనవ టీవీ' ట్రయిల్ ప్రసారం చూస్తూ వంట, ఇంటిపని వాయిదా వేసింది రాజేశ్వరి.

నవనవ టీవీ ట్రయిల్ ప్రసారంలో తెర మీదకి పంచె, జుబ్బా, కండువాలతో ప్రత్యక్షమైన వ్యక్తి "ఎందరో నవనవ టీవీ ప్రేక్షకులు, అందరికీ వందనం. ఫైవారం మా అసలు ప్రసారాలు ప్రారంభమవుతాయి. ఉదయం తెలుగు సుప్రభాతం, ఆ తర్వాత తెలుగు భక్తిగీతాలు, ఆ తర్వాత రుచికరమైన తెలుగు వంటలకి ప్రాధాన్యం ఇస్తూ 'వండండి, తినండి' కార్యక్రమం ప్రసారం చేస్తాం. ఈ కార్యక్రమంలో చెప్తూ, చేసి చూపించే వంటలను అప్పటికప్పుడే చేసుకోవచ్చు టీవీ వున్న గదిలోకే మీరు గ్యాస్ స్టవ్, సిలిండర్, సరుకు, సరంజామా అన్నీ తెచ్చుకోవచ్చు ఒకవేళ మీ వంట ఇల్లు పెద్దదయితే ట్రాలీమీద వున్న టీవీని అక్కడికే లాక్కుపోవచ్చు వచ్చే ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకు 'వండండి, తినండి', మరచిపోవద్దు" అంటూ ఆయన సెలవు తీసుకున్నాడు.

వచ్చే ఆదివారం రానే వచ్చింది. రాజేశ్వరి ఎనిమిదిన్నరకే రెడీ అయిపోయింది. టీవీ వున్న గదిలోనే వంట ఏర్పాటు చేసేసుకుంది. ఆరోజు ఆ ఏరియాలో కరెంట్ కోత వుండదని పేపర్ చూసి నిర్ధారణ చేసుకుంది. ఎవరూ ఫోన్‌చేసి డిస్టర్బ్ చేయకూడదని రిసీవర్ తీసి పక్కన పెట్టింది. కాలింగ్‌బెల్ ఎవరేనా కొడితే తలుపుతీసి చూసి వచ్చిన వారిని పంపే పనిని శ్రీవారికి అప్పగించింది రాజేశ్వరి.

తొమ్మిదయింది. రాజేశ్వరి '55'ని రిమోట్‌తో రప్పించింది. "నవనవ టీవీ తొలి రోజు ప్రసారంలో మీ ముందుకు వస్తున్న 'వండండి, తినండి' కార్యక్రమానికి ఆహ్వానం" అంది తెరమీద కనిపించిన ఆవిడ. రాజేశ్వరి ఆవిడని చూసి ఆశ్చర్యపోయింది.

ఆ ఆశ్చర్యాన్ని పసిగట్టినట్టు "వంటపనులకి ఎవరేనా మేకప్‌తోనూ, వంటినిండా నగలతోనూ, కంచిపట్టు చీరతోనూ సిద్ధమవుతారా? అందుకే ఇలా వున్నాను" అంది. వెలిసిపోయిన చీర కట్టుకున్న ఆవిడ.

టీవీ వంటపనికి అంత నేచురల్‌గా వచ్చిన ఆవిడని, నవనవ టీవీని రాజేశ్వరి మెచ్చుకుంది.

"ఇక 'సమర్పణ' అనే వంట ప్రారంభిద్దాం. మీరూ నాతోపాటే చేయండి" అంది ఆవిడ.

"ముందు స్టౌమీద మూకుడు పెట్టి, నూరు మిల్లీలీటర్ల నూనెపోసి, స్టౌ వెలిగించండి" అంది ఆవిడ. రాజేశ్వరి అలాచేసి స్టౌ వెలిగించడానికి అగ్గిపెట్టె తీసుకునేలోపునే బ్రహ్మాండమైన పేలుడుతో రూమ్ అదిరిపోయింది. రెండు బర్నర్‌ల స్టౌమీద ఒకపక్క 'నవనవ టీవీ'కోసం ఖాళీగా వుంచి మరొక పక్క 'ఫుల్‌లోడ్'తో పదిలీటర్ల ప్రెషర్‌కుక్కర్‌ని పెట్టి ఆవిరి వచ్చాక వెయిట్ పెట్టినా ఆరు కూతలు వచ్చాక ఆవైపు బర్నర్‌ని ఆపెయ్యాలనే విషయం రాజేశ్వరి పూర్తిగా మరిచిపోయింది. ఫలితమే ఆ బ్రహ్మాండమైన పేలుడు. ప్రెషర్ కుక్కర్ హైజంప్ చేసి పైకప్పుని తాకి మళ్ళీ స్టౌమీద అంతే అమితవేగంతో పడింది.

ప్రెషర్‌కుక్కర్, స్టౌ రెండింటి షేప్‌లు మారిపోయాయి.

చుట్టుపక్కల ఫ్లాట్లవాళ్లు అందరూ రాజేశ్వరి ఫ్లాట్‌కి పరిగెత్తుకుని వచ్చారు. ఎవరికీ ఏమీ కాలేదని ఊపిరి పీల్చుకున్నారు. రాజేశ్వరిని కొత్త స్టౌ, కొత్త కుక్కర్ కొనుక్కోవచ్చని ఓదార్చారు. ఒక్కొక్క ఫ్లాట్‌లో నుంచి ఆదివారం కనుక ఒక్కొక్క ఐటమ్ తినడానికి పంపించారు. టీవీకి ఏమీ అవలేదని రాజేశ్వరి సంతోషించింది.

రాజేశ్వరి ఇల్లంతా శుభ్రం చేశాక ఆది

వారం పేపర్‌లో గృహోపకరణాల పేజీ తీరికగా తిప్పింది. ఏ బ్రాండ్ ప్రెషర్‌కు క్కర్‌లు, గ్యాస్‌స్టవ్‌లు ఏ ధరకి లభిస్తాయో, పచ్చడయి పోయినవాటిని ఎక్స్ ఛేంజ్ చేసుకోవచ్చో లేదో తెలుసుకోవటం ప్రారంభించింది.

– తాజీప్రసాద్

---

## ప్లాట్లు

ఉదయం లేచిన దగ్గర్నుంచీ ఒకటే హడావిడిగా వుంది అలివేలు మంగతాయారు. 'కలువ' పత్రిక సంపాదకుడు చేసిన ఫోన్‌తో మొదలు, ఉదయం అయిదు గంటలనుంచి విడవకుండా ఫోన్ మోగుతూనే వుంది. "హలో" అంటూ పలకరింపులు, ఆపైన అభినందనల చిలకరింపులు.




'కలువ' పత్రికలో అలివేలు మంగతాయారు అరవై నెలలపాటు అంతులేకుండా సాగతీసిన 'ఆగని పోరాటం' నవలకు 'అదేదో' సంస్థవారు అవార్డు ప్రకటించడమే అందుకు కారణం. 'అదేదో' సంస్థకు జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ మంచి గుర్తింపు, పేరుప్రఖ్యాతులు ఉన్నాయి. అందుకే ఆ సంస్థ ప్రకటించే అవార్డులకి, రివార్డులకి కూడా అంత విలువ ఉంది. ఆ సంస్థ అవార్డు పొందగలగడం గర్వంగా భావిస్తారు కూడా!

అలాంటి ఆ 'అదేదో' సంస్థ అవార్డు తన నవలకు ప్రకటించారని 'కలువ' పత్రికా సంపాదకుడు ఫోన్ చేసి చెప్పడంతోనే ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయింది అ.మం.తా. అంతే కాదు తను రాయబోయే తదుపరి నవలని తమ పత్రికకే ఇవ్వాలంటూ ఆ ఎడిటర్ పదేపదే అడగడం మరింత గర్వంగా అన్పించింది. వెంటనే నవల పేరు చెప్తే అభినందనలతో పాటుగా కొత్త సీరియల్ ప్రకటన కూడా వచ్చే సంచికలో వేస్తామని చెప్పడంతో కొంత బెట్టు చేయాలని కూడా అన్పించింది. అయినా పైకి మాత్రం "అదేమిటి సార్.

మీకు కాక మరెవరికిస్తాను. నన్నింతదాన్ని చేసింది మీ పత్రిక. మళ్ళీ మీకు ఫోన్ చేస్తా" అంది.

ఉదయం పదిగంటలు కాలేదు, వివిధ పత్రికలవాళ్ళు, దూరదర్శన్‌వాళ్ళు, ప్రైవేట్ ఛానెల్స్ వాళ్ళు బిలబిలమంటూ తమతమ వానుల్లో దిగిపోయారు ఇంటిముందు. అందర్నీ సాదరంగా ఆహ్వానించింది. శీతల పానీయాలతోనూ, అల్పాహారాలతోనూ అతిథి మర్యాదలు చేసింది. వారిముందు వినమ్రంగా కూర్చుంది సోఫాలో.

ఆయా ఛానెల్స్‌వాళ్లు, పత్రికలవాళ్ళు తమతమ టేప్‌రికార్డర్స్‌ని, కెమేరాలని ఆన్ చేసుకున్నారు. ఆమెతో ఇంటర్వ్యూ ప్రారంభించారు. వీడియో కెమేరాలు నిశ్శబ్దంగా ఆ కార్యక్రమాన్ని చిత్రీకరిస్తున్నాయి. మధ్య మధ్యలో స్టిల్ కెమేరాల ఫ్లాష్‌లు తళుక్కుమంటున్నాయి.

"మీరు 'అదేదో' సంస్థ వారి అవార్డు పొందినందుకు మా అభినందనలు. ఈ అవార్డు రావడం మీకు ఎలా అన్పిస్తోంది"

"చాలా సంతోషంగా ఉంది" సింపుల్‌గా జవాబు చెప్పింది అ.మం.తా.

"మీ నవలకి ఈ అవార్డు వస్తుందని మీరు ముందుగానే ఊహించారా?"

"అస్సలు లేదండీ. సీరియల్ అశేష పాఠకుల్ని విశేషంగా ఆకట్టుకొని నాకు ఎంతో మంది అభిమానుల్ని చేసింది. చాలామంది నిర్మాతలు రైట్స్‌కోసం వత్తిడి చేస్తున్నారు. ఒక మంచి సినిమాగా వస్తుందనుకుంటున్న తరుణంలో ఈ అవార్డు రావడం చాలా ఆనందంగా వుంది" సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బవుతూ చెప్పింది అ.మం.తా.

ముఖంమీద చిరునవ్వు చెదిరిపోకుండా జాగ్రత్తపడుతోంది. స్టిల్ కెమేరాలతోపాటు వీడియో కెమేరాలకి కూడా ఫోజులు బాగానే ఇస్తోంది.

"చివరిగా... మీ రచనా వ్యాసంగానికి మీవారి తోడ్పాటు ఏమైనా వుందా?"

"అయ్యో. లేకేం. అసలీ రచనా వ్యాసంగం అలవడింది నాకు పెళ్ళైన తర్వాతే" ఉత్సాహంగా చెప్పింది అ.మం.తా.

"ఇంతకీ మీవారి తోడ్పాటు ఏవిధంగా ఉంటుందో చెప్పలేదు"

"అదే చెప్పబోతున్నాను. రోజూ ఇంటికి ఆలస్యంగా వచ్చే మావారు కారణం అడిగితే చెప్పిన కథ చెప్పకుండా రోజుకొక కథ చెప్పేవారు. ఆ కారణాలే నా కథలకి... నవలకి ప్లాట్లు" చెప్పింది అ.మం.తా.

"ఆc..." అంటూ ఆశ్చర్యపోవడం విలేఖరుల వంతయింది.

**– సూరిపండు**

---

## కాంపెన్సేషన్

టప్... టప్... ఇచ్... ఇచ్...

"ఏమిటయ్యా కాంపౌండరూ!? దేన్ని అంత గట్టిగా కొడుతున్నావ్?" అరిచాడు డాక్టర్ లింగం.

"ఈగల్ని... డాక్టర్" అరిచాడు కాంపౌండర్ బయటిగదిలోంచి.

'ప్చ్... ఈరోజు కూడ ఒక్క పేషంటూ రాలేదు' నిట్టూర్చాడు డాక్టర్ లింగం. ఇంతలో ఎవరో వచ్చిన అలికిడయ్యింది.

"ఏమి కావాలి నాయనా?"

"మా ఇంట్లో పేషెంటు వున్నాడు డాక్టర్, గుజరాత్ సమస్యలా... ఎంతకీ తేలకుండా, చావు బతుకులమధ్య ఊగిసలాడుతున్నాడు. ఇక్కడ ఎడ్మిట్ చేస్తే సరాసరి... వైకుంఠ యాత్రేనని"

"షటప్... అండ్... గెటౌట్.. ఇది



ఆస్పత్రి అనుకున్నావా? లేక ఆఫ్ఘనిస్తాన్ అనుకున్నావా? నేను తాలిబాన్లా కనబడు తున్నానా? " కసిరాడు డాక్టర్... వాడు వెళ్ళిపోయాడు.

'లాభంలేదు ఈ ప్రాక్టీస్ అచ్చిరాలేదు. ఇది మానేసి వేరే ఏ వృత్తయినా చేప ట్టాలి? ' గోడమీద కొటేషన్ చూశాడు. "పోలిటిక్స్ ఈజ్ లాస్ట్ రిసార్ట్ ఫర్ ఇడియట్స్" 'తనో ఇడియట్టా? '

లింగం రాజకీయాల్లోకి దిగాడు. కులం కార్డు, మతం కార్డు ఉపయోగించి... అయిపోయాడు 'మంత్రి'.

మంత్రయ్యాక ఓ విచిత్రం జరిగింది.

అతడి ప్రాక్టీస్ పెరిగింది. అందరూ అతనితో ఆపరేషన్ చేయించుకోవాలని తెగ ఆత్రుతపడుతున్నారు. 'నీ చేతి మాత్ర వైకుంఠయాత్ర' అనేవారే 'నీ చేతి మాత్ర ఇహలోక యాత్ర' అంటున్నారు.

అదే అర్థంగావటంలేదు లింగంకి. ఓరోజు కిడ్నీ ఆపరేషన్ చేయించుకోవటానికి ఓ వ్యక్తి వచ్చాడు.

"ఏవయ్యా!? నేను ఇదివరకూ సర్జన్నే... ఇప్పుడూ సర్జన్నే... పూర్వం నాతో ఆపరేషన్ చేయించుకోవటానికి జంకేవాళ్లు ఇవాళ ధైర్యంగా ఎందుకు ముందుకు వస్తున్నారు? "

"నిజం చెప్పమంటారా? అబద్ధం చెప్పమంటారా డాక్టర్? "

"హు... నిజమే చెప్పు!"

"మీ చేతుల్లో చస్తే ఏ 'సుఖీభవ' పథకం ద్వారానో కాంపెన్సేషన్ ఇప్పించగలరు. మిగతా డాక్టర్లకి ఈ సౌలభ్యం లేదు కదండీ... ఎంతయినా మీరు మంత్రిగారు కదా!"

కెవ్వున అరిచి కిందపడ్డాడు డాక్టర్ లింగం.

– డా. కె. శివసుబ్బారావు




★

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060. Cuddapah: 70011; Tadepalligudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78



ఈసారి వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్, ఏ వంటకమై వండాలనుకున్నప్పుడు సంసిద్ధంగా ఉండే 'ప్రియ' వారి శ్రేష్ఠమైన అల్ల వెల్లుల్లి, చింతపండు పేస్ట్‌లను వాడండి. అత్యంత పరిశుభ్ర పరిసరాల అత్యుత్తమ పదార్థాలతో తయారు చేసిన పేస్ట్‌లు ఇ. మీ ఇంటి రుచులను మైమరపించే ఈ ప్రియ రుచుల్ని ఆస్వాదించండి.

priya

Culinary Paste

# అత్యుత్తమ పదార్థాలు నోరూరించే రుచులు!

priya Tamarind Paste

priya Ginger & Garlic Paste

priya Ginger Paste

priya Garlic Paste

• అల్లం మిశ్రమం • అల్లం-వెల్లుల్లి మిశ్రమం • వెల్లుల్లి మిశ్రమం • చింతపండు మిశ్రమం

**Manufactured by : USHODAYA ENTERPRISES LIMITED (Priya Foods Divisi**

EENADU COMPLEX, SOMAJIGUDA, HYDERABAD - 500 082, INDIA. Ph: 040-3323717/3324727 Fax: 040-3393640 Website: www.priyafoods.

Mudra: P: 99322